ధర : రూ. 120/–

అట్టమీది బొమ్మ : కశ్మీర్‌పై రోలీ ముఖర్జీ గీసిన చిత్రం
(Shadows beyond the Ghost Town, watercolour on paper)

మొదటి ముద్రణ : అక్టోబర్ 2016

ప్రతులకు, వివరాలకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్,
ప్లాట్ నెం. 85, బాలాజీ నగర్,
గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 006.
ఫోన్ : 23521849
www.hyderabadbooktrust.blogspot.com

---

ముద్రణ : అనుపమ ప్రింటర్స్, గ్రీన్ వ్యూ, 126 శాంతినగర్,
హైదరాబాద్ – 28 ఫోన్ : 23391364, 23304194
Email: anupamaprinters@yahoo.co.in

# మా మాట

"కశ్మీర్ ఏదో ఒక కారణంగా వార్తలలో ఉంటూనే ఉంది. మిలిటెంట్లు పర్యాటకులను చంపారనో, మిలిటెంట్లను సైన్యం చంపి వారి కుట్రలను భగ్నం చేసిందనో అడపా దడపా వార్తలు చదువుతూనే ఉంటాం.... భారత పాకిస్తాన్‌ల పరస్పర నిందారోపణలు, దూషణల సందర్భంగా కూడా కశ్మీర్ గురించి వింటుంటాం" అని బాలగోపాల్ తన 'కల్లోల లోయ: 50 ఏళ్ళ కశ్మీర్' పుస్తకానికి రాసిన ముందుమాటలో అన్నారు. ఆ పుస్తకాన్ని మేము వేసింది జనవరి 2007లో. పదేళ్లు గడుస్తున్నా అప్పటికి ఇప్పటికి ఈ పరిస్థితిలో ఇంత కూడా మార్పు రాలేదు. ఇవ్వాళ కూడా కశ్మీర్ వార్తలలో ఉన్నది అక్షరాలా ఇవే కారణాలకే. 'పర్యాటకుల' స్థానంలో భారత సైనికులను అన్న ఒక్క మార్పు చేసుకుంటే చాలు.

బుర్హాన్ వాని ఎన్‌కౌంటర్ తర్వాత కశ్మీర్ లోయ మరోసారి భగ్గుమనడం చూశాం. యువకుల నుండి పెద్దఎత్తున రాళ్ల దాడులు, సైన్యం నుండి పెద్దఎత్తున పెల్లెట్ల ప్రయోగమూ, కాల్పులూ జరిగి ఈ మూడు నెలలలో ఇప్పటికే 88 మంది దాకా కశ్మీరీలు చనిపోయారు. 1989 నుండి కశ్మీర్ చరిత్రంతా ఒక సంఘర్షణ నుండి మరో సంఘర్షణకు ప్రయాణమే. ఒక రక్తపాతం నుండి మరో రక్తపాతానికి ప్రయాణమే. ఇది ఈ రోజుకి తాజాది. మరోటి జరగదన్న నమ్మకం లేదు.

బాలగోపాల్‌ను కశ్మీర్‌వాది అనొచ్చు. అంతగా ఆ ప్రజల స్వయం నిర్ణయాధికారం హక్కు కోసం ఆరాటపడ్డారు. కనీసం ఏడెనిమిది సార్లు ఆ రాష్ట్రంలో పర్యటించి వచ్చాక రాసిన వ్యాసాలే ఇవి. 1990–2008 మధ్య రాసిన ఈ వ్యాసాలలో ఎక్కువ భాగం కరపత్రాలు, వివిధ పత్రికలకు రాసిన కాలమ్స్. ప్రతి కొత్త మార్పును చర్చించేటప్పుడు పాత విషయాల ప్రస్తావన రాకుండా ఉండదు కనక కొన్ని విషయాలు మళ్లీ మళ్లీ వచ్చినట్టు అనిపించొచ్చు. కాని దేని సందర్భం దానిదే. అయినప్పటికీ విషయాలు పునరావృతమైనట్టు అనిపించిన దాదాపు పది వ్యాసాలను ఈ పుస్తకంలో చేర్చలేదు.

కశ్మీర్ సమస్యకు సంబంధించిన ఏ పరిష్కారమైనా కశ్మీర్‌ల మనోభీష్టం మేరకే జరగాలని బాలగోపాల్ ఈ వ్యాసాల్లో పదే పదే చెప్పారు. 'కశ్మీర్‌లో మన కర్తవ్యం' శీర్షికతో 2008లో రాసిన చివరి వ్యాసంలో కూడా " కశ్మీర్‌ల మనోభావాలకు జవాబు చెప్పకుండ అణచివేతతో, కాలయాపనతో దాటవేయడం 60 సంవత్సరాలుగా భారత ప్రభుత్వ విధానంగా ఉంది. దానికిప్పటికే ప్రజలు చాలా మూల్యం చెల్లించారు. ఇకనైనా సూత్రబద్ధ వైఖరి అవలంబించి ఏ పరిష్కారం సంబంధిత ప్రజలకు ఆమోదమైతే దానిని స్వీకరించమని మన పాలకుల పైన ఒత్తిడి పెట్టడం శాంతిని నిజంగా కాంక్షించే వారి కర్తవ్యం" అని నిక్కచ్చిగా అన్నారు.

ఎంతకాలం గడిచినా అటువంటి సూచనలేవీ కనుచూపుమేరలో కనిపించకపోవడం విషాదం.

4.10.2016

**హైదరాబాద్ బుక్ ట్రస్ట్**

# విషయ సూచిక

# ప్రత్యేక ప్రతిపత్తి రద్దు పరిష్కారమా?

**త**ప్పుడు పరిష్కార ప్రయత్నాల వల్ల – సమస్యలు జటిలమయినప్పుడల్లా చేసిన తప్పులనే మరింత సమగ్రంగా చేస్తే సమస్య పరిష్కారమయి పోతుందని సలహా ఇచ్చే వాళ్ళు ఎప్పుడూ వుంటారు. ఎంతోమంది సిక్కు యువకులను చంపినా కూడా 'పంజాబు సమస్య' పరిష్కారం కాలేదు కదా అంటే ఆ దమనకాండను అర్ధాంతరంగా ఆపేయకుండా చివరిదాకా కొనసాగిస్తే సమస్య పరిష్కారం కాకపోయేదా అని ఎదురు జవాబు చెప్పే వాళ్ళు చాలామంది ఉన్నారు. అందరినీ చంపేస్తే సమస్యే మిగలదు కదా!

ఆర్టికల్ 370 ఉండటం వల్ల 'కశ్మీర్ సమస్య' ఉత్పన్నమయిందనీ, దానిని రద్దు చేస్తే పరిష్కారం అయిపోతుందనీ వినవస్తున్న వాదన ఈ కోవకు చెందినదే. ఆర్టికల్ 370 వుండటం వల్ల సమస్య రాలేదు. దానిని గౌరవించకపోవడం వల్లనే సమస్య ఉత్పన్నమయ్యింది. ఆర్టికల్ 370లో హామీ ఇచ్చిన స్వయంప్రతిపత్తిని కేంద్రప్రభుత్వం ఒక పద్ధతి ప్రకారం వమ్ము చేసింది. 1953లో షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని అన్యాయంగా బర్తరఫ్ చేసి, అతనిని అరెస్టు చేసి, 1954లో కశ్మీర్ మీద కేంద్ర ప్రభుత్వానికి సకల శాసన అధికారాలూ ఇచ్చే 'రాజ్యాంగం (జమ్మూ–కశ్మీర్ సంబంధిత) ఆర్డర్'ను జారీ చేసి 1957లో జవహర్‌లాల్ నెహ్రూ 'కశ్మీర్ విలీనం ఒక నిర్వివాదమయిన చారిత్రక వాస్తవం' అని ప్రకటించి, ప్రజాభిప్రాయ సేకరణ చేస్తామని 1947లో కశ్మీర్ ప్రజలకిచ్చిన హామీని బుట్టదాఖలు చేసిననాడే ఆర్టికల్ 370 అసహజమరణం పాలయింది. ఆపైన అది కేవలం అలంకారప్రాయంగా మట్టుకే రాజ్యాంగంలో కొనసాగుతూ వుంది. ఇవ్వాళ దానిని పునరుద్ధరించడం భారత ప్రభుత్వ నైతిక బాధ్యత.

ఈ మాటలు చాలామందికి కోపం తెప్పిస్తాయి. పాకిస్తాన్ ఒక వైపు భారత భూభాగాన్ని ఆక్రమించుకోవడానికి కాలు దువ్వుతుంటే ఈ మాటలేమిటని అంటారు. ఎన్నాళ్ళని ముస్లింలకు భయపడుతూ బతుకుతాం అని హిందువులు అడుగుతారు. వాళ్ళు డిమాండు చేశారు కాబట్టి ఏ రాష్ట్రానికీ లేని స్వయంప్రతిపత్తి కశ్మీర్‌కు ఇచ్చేయవలసిందేనా అని ఆవేశపడతారు. ఆవేశాలకు లోనుకాకుండా వాస్తవాలు తెలుసుకోవడం అవసరం. పుక్కిటి పురాణాలపై విశ్వాసముంచకుండా హేతుబద్ధంగా

ఉదయం దినపత్రిక, 3–4–1990

వివేచించడం అవసరం. దేశమంటే మట్టి అనుకునే దేశభక్తి మనుషులకు అన్యాయం చేస్తుంది. కశ్మీర్ సమస్య పాకిస్తాన్ దేశభక్తికీ, భారత దేశభక్తికీ సంబంధించిన సమస్య కాదు. అది కశ్మీరీ ప్రజల సమస్య. ఆ మాటే 40 ఏళ్ళుగా కశ్మీర్ ప్రజలు మనకు చెప్పాలని ప్రయత్నం చేస్తున్నారు. అయితే వాళ్ళు మాట్లాడుదామని నోరు తెరచినప్పుడల్లా 'అదిగో పాకిస్తానీ ఏజెంట్లు' అని మనం వాళ్ళ నోళ్ళు నొక్కేస్తున్నాం. షేక్ అబ్దుల్లా నుండి ఇప్పుడు కశ్మీర్ లోయలో అత్యధిక జనాదరణ పొందుతున్న జమ్మూ కశ్మీర్ విమోచనా సంస్థ (జె.కె.ఎల్.ఎఫ్) దాకా కశ్మీరీ రాజకీయాల ప్రముఖ ప్రతినిధులంతా కశ్మీరీ జాతీయవాదులే గానీ పాకిస్తానీ ఏజెంట్లూ కాదు, మతతత్వవాదులూ కాదు. పాకిస్తాన్ ఏజెంట్లూ మతతత్వవాదులూ లేకపోలేదు గానీ వాళ్ళ ప్రాబల్యం అల్పమే. తక్కిన భారతదేశం కశ్మీరీ జాతీయవాదాన్ని గుర్తించడానికి నిరాకరించి పాకిస్తానీ బూచినీ, మతతత్వం బూచినీ రెచ్చగొడుతూ పోతే ఆ ప్రాబల్యం ఎంతో కాలం అల్పస్థాయిలో వుండదు. కనీసం ఆ దృష్టితోనయినా మనం కొంచెం హేతుబద్ధంగా ఆలోచించాలి.

ఆర్టికల్ 370 ముస్లిం మతతత్వవాదులు కుట్రచేసి సాధించుకున్నది గాదు. నెహ్రూను బ్లాక్‌మెయిల్ చేసి షేక్ అబ్దుల్లా సాధించుకున్నదీ గాదు. భారత రాజ్యాంగసభ దానిని కూలంకషంగా చర్చించి ఏకగ్రీవంగా ఆమోదించింది. ఆర్టికల్ 370ని రాజ్యాంగ సభలో ప్రతిపాదించిన శ్రీ గోపాలస్వామి అయ్యంగార్ ఎటువంటి ప్రత్యేక పరిస్థితుల్లో ఆ ఆర్టికల్‌ను ప్రతిపాదించవలసి వస్తున్నదో వివరించారు. ఆ ప్రత్యేక పరిస్థితులేమిటో మనం కొంచెం గుర్తుచేసుకోవాలి.

బ్రిటిష్‌వాళ్ళు భారత ఉప ఖండం మొత్తాన్ని ఏ రోజూ ప్రత్యక్షంగా పరిపాలించలేదు. అందులో సగభాగం మటుకే బ్రిటిష్ పాలిత ప్రాంతం. తక్కిన భూభాగంలో చిన్న పెద్ద రాజ్యాలూ, సంస్థానాలూ, జాగీరులూ వుండేవి. వీటిలో హైదరాబాద్, భోపాల్, జమ్మూ కశ్మీర్ పెద్దవి. అయితే వీటన్నిటి మీదా బ్రిటిష్ ప్రభుత్వం తన సార్వభౌమత్వాన్ని ప్రకటించుకుంది. ఈ రాజులు, సంస్థానాధీశులు బ్రిటిష్ ప్రభుత్వానికి కప్పం చెల్లించడమేగాక ఇతర విషయాల్లోనూ లోబడి వుండేవారు. అయినా వాళ్ళకు ఏదో ఒక మేరకు పరిపాలన స్వయంప్రతిపత్తి వుండేది. కొన్ని రాజ్యాలకు శాసనసభలూ రాజ్యాంగ సభలూ కూడా వుండేవి. బ్రిటిష్ వాళ్ళు గనుక భారతదేశాన్ని వదిలిపెట్టి వెళ్ళిపోతే వాళ్ళతోపాటే వాళ్ళ సార్వభౌమత్వమూ పోవాలనీ, తాము తిరిగి సర్వ స్వతంత్రులు కావాలనీ ఈ రాజులూ, సంస్థానాధీశులూ కోరుకున్నారు. సైమన్ కమిషన్ (1927) నుంచి కాబినెట్ రాయబారం (1947) దాకా అందరికీ వాళ్ళు ఇదే మొరపెట్టుకున్నారు.

కాంగ్రెస్ వారి జాతీయ ఉద్యమం ఈ రాచరికాల పట్ల విచిత్రమైన ద్వంద్వ వైఖరిని అవలంబించింది. ఒక పక్క వాళ్ళను బ్రిటిష్ ఏజెంట్లనీ, మధ్యయుగాల అవశేషాలనీ

విమర్శిస్తూ మరొక పక్క ఆ రాజ్యాలలోకి జాతీయోద్యమం విస్తరించకుండా జాగ్రత్తపడింది. దేశీయ సంస్థానాల్లో జాతీయోద్యమం ఎదగకుండా తానే అడ్డుపడ్డానని గాంధీ సగర్వంగా చెప్పుకున్నాడు కూడా. బ్రిటిష్ పాలిత ప్రాంతాలకు మట్టుకే జాతీయోద్యమాన్ని పరిమితం చేసి బ్రిటిష్ వాళ్ళను ముందు బయటకు తరిమేస్తే ఆ తరువాత స్థానిక రాచరికాలను లొంగదీసుకుని కలుపుకోవచ్చుననేది కాంగ్రెస్ నాయకుల వ్యూహం. ఆ ప్రకారమే స్వాతంత్ర్యానంతరం వారు దేశీయ సంస్థానాలను, రాజ్యాలను ఇండియన్ యూనియన్‌లో చాలా చాకచక్యంగా కలుపుకున్నారు. రాజులను, సంస్థానాధీశులను వివిధ రాజకీయ పార్టీలలో కలుపుకుని మంత్రులుగాను, గవర్నర్లుగాను పునరావాసం కల్పించారు. వాళ్ళ ఆస్తులు కాపాడు కోవడానికీ, కొత్త రూపాలలో పెంపొందించుకోవడానికీ సకల అవకాశాలు కల్పించారు. ఒక్క జమ్మూకశ్మీర్ విషయంలో మట్టుకే ఈ వ్యూహం విఫలం అయింది.

రాజ్యాంగ సభ నిర్ణయించిన ప్రకారం భారతదేశంలో విలీనమయ్యే ప్రతి రాజ్యమూ ఒక 'విలీన ఒడంబడిక' (Instruments of accession) ప్రాతిపదిక మీద విలీనం అవుతుంది. ఆ ఒడంబడిక మీద భారత ప్రభుత్వమూ ఆ రాజ్యపాలకుడయిన రాజూ సంతకం చేస్తారు. ఆ రాజ్యం మీద కేంద్ర ప్రభుత్వం అజమాయిషీ ఏ మేరకు వుండేది, రాజ్యానికి స్వయంప్రతిపత్తి ఏ మేరకు ఉండేది ఒడంబడిక నిర్ణయిస్తుంది. కేంద్రానికి కేవలం విదేశీ వ్యవహారాలు, రక్షణ, రవాణా ప్రసార సాధనాల మీద అధికారం ఇచ్చి మిగిలిన విషయాల్లో రాజ్యానికి స్వయంప్రతిపత్తి వుండాలని చాలామంది సంస్థానాధీశులు భావించారు. అయితే కాంగ్రెస్ నాయకులు రకరకాల ఆశలూ, భయాలూ చూపించి ఏ స్వయంప్రతిపత్తి లేకుండానే ఒక్కొక్క సంస్థానాన్నీ పూర్తిగా లొంగదీసుకున్నారు.

జమ్మూకశ్మీర్ మట్టుకు ఈ ప్రలోభాలకు, భయాలకు లొంగలేదు. నైసర్గికంగా, సాంస్కృతికంగా, భాషాపరంగా ఆ ప్రాంతానికున్న ప్రత్యేకత వల్ల తాము స్వతంత్రంగా వుండిపోవాలని వాళ్ళు ఆశించారు. అందులో తప్పేమీ లేదు. ఆ కోరికను భారత పాకిస్తాన్‌లు గౌరవించి వుంటే కశ్మీర్ వేరే దేశంగా వుండేది. అయితే ఆ సంస్కారం ఈ రెండు దేశాల్లోనూ లేకుండాపోయింది. 1947 అక్టోబర్ 26వ తేదీన పాకిస్తాన్ కశ్మీర్ మీదకి ఒక మూకను పంపించింది. కశ్మీర్ రాజయిన హరిసింగ్ భారతదేశాన్ని శరణు కోరాడు. స్వతంత్రంగా వుండిపోతే తనకు పూర్తి సహాయం దొరకదన్న భయంతో జమ్మూ కశ్మీర్‌ను భారతదేశంలో విలీనం చేయడానికి ఒప్పుకున్నాడు. భారత ప్రభుత్వానికి రక్షణ, విదేశీ వ్యవహారాలు, రవాణా ప్రసార సాధనాల మీద మట్టుకు అధికారం ఇస్తూ ఇతర విషయాల్లో జమ్మూ కశ్మీర్‌కు స్వయంప్రతిపత్తి వుంటుందని ఈ ఒడంబడిక గుర్తించింది. భారత సైన్యాలకూ, పాకిస్తాన్ సైన్యాలకూ ఆపైన యుద్ధం జరిగింది. కొంతకాలం తర్వాత సంధి కుదిరింది. కశ్మీర్ భవితవ్యాన్ని గురించి కశ్మీర్‌లో ప్రజాభిప్రాయ సేకరణ (Plebiscite)

జరగాలని ఐక్యరాజ్యసమితి తీర్మానించింది. దానికి కట్టుబడి వుంటామని నెహ్రూ ఒప్పుకున్నాడు కూడా.

గోపాలస్వామి అయ్యంగార్ ఈ విషయాలన్నింటినీ రాజ్యాంగ సభకు నివేదించి వీటిని దృష్టిలో వుంచుకుని రాజ్యాంగంలో కశ్మీర్ స్థానాన్ని నిర్ణయించాలని అన్నాడు. అందుకోసం ఆర్టికల్ 370ని ప్రత్యేకంగా కశ్మీర్ కోసం ప్రతిపాదించాడు. రాజ్యాంగ సభ దానిని చర్చించి ఆమోదించింది. ఆర్టికల్ 370 ప్రకారం కేంద్ర ప్రభుత్వానికి రక్షణ, విదేశీ వ్యవహారాలు, రవాణా ప్రసార సాధనాల మేరకే కశ్మీర్‌లో శాసనాధికారం ఉంటుంది. ఒక విషయం ఈ జాబితాలోకి వస్తుందా లేదా అనేది రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదించి నిర్ణయించాలి. ఈ మూడు కాక వేరే ఏ విషయాల్లోనయినా భవిష్యత్తులో కేంద్ర ప్రభుత్వం శాసనాధికారం కోరుకుంటే ఆ అధికారాన్ని రాష్ట్ర ప్రభుత్వ సమ్మతితో పొందాలి.

ఈ చివరి విషయమే ఆర్టికల్ 370కి ప్రాణాంతకమయ్యింది. రాష్ట్ర ప్రభుత్వం అనుమతితో కేంద్రం ఎంతటి శాసనాధికారాన్నయినా పొందవచ్చుననేసరికి కేంద్రానికి వ్యతిరేకమయిన రాష్ట్ర ప్రభుత్వానికి కశ్మీర్‌లో మనుగడే లేకుండా పోయింది. అందుకే కశ్మీర్ ప్రజల ప్రతినిధిగా అద్వితీయ స్థానం కలిగివున్న షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని 1953లో చాలా అన్యాయంగా బర్తరఫ్ చేసి అతనిని అరెస్టు చేశారు. బర్తరఫ్ చేసిన రాష్ట్ర గవర్నర్ కరణ్‌సింగ్ (పాత కశ్మీర్ రాజు హరిసింగ్ కుమారుడు) దేశ రాజకీయాలలో ఆ తరువాత చాలా ప్రముఖుడయ్యాడు. ఈ విధంగా ప్రజా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేసిన తరువాత గవర్నర్ సమ్మతితో రాజ్యాంగం (జమ్మూకశ్మీర్ సంబంధిత) ఆర్డర్‌ను 1954లో జారీ చేశారు. దాని ప్రకారం కశ్మీర్‌లో కేంద్రానికి అన్ని విషయాలలోను శాసనాధికారం ఉంటుంది. కశ్మీర్‌కు వేరే రాజ్యాంగం నామమాత్రంగా వున్నా ఆచరణలో ఆ రాష్ట్రం బలవంతంగా ఇతర రాష్ట్రాలలాగా భారతదేశంలో భాగం అయ్యింది. ఆర్టికల్ 370ని రద్దు చేయాలని ఇవ్వాళ కొందరు గొడవచేస్తున్నారు గాని అది ఆనాడే నిస్సారమయ్యింది.

ఆ తర్వాత కూడా జమ్మూ కశ్మీర్‌లో ఏ ఒక్క ఎన్నికనూ ప్రజాస్వామికంగా జరగనీయలేదు. రిగ్గింగ్‌తో, తుపాకులతో, దొంగ ఓట్లతో కేంద్రానికి అనుకూలమయిన వాళ్ళే గెలిచేటట్లు చేశారు. 1975లో షేక్ అబ్దుల్లా ఇందిరాగాంధీతో ఒప్పందం చేసుకొని కశ్మీర్ ప్రత్యేకతను ఇక మరచిపోతాం అని హామీ ఇచ్చిన తర్వాతే ఆయన రాజకీయ స్వేచ్ఛ పొందగలిగారు. అయితే ఆయన మరణానంతరం ముఖ్యమంత్రి అయిన ఫరూక్ అబ్దుల్లా ప్రతిపక్ష పార్టీలతో చేతులు కలిపి రాష్ట్రాల స్వయంప్రతిపత్తిని గురించి మాట్లాడడం మొదలెట్టేసరికి అతని ప్రభుత్వాన్ని కూడా 1984లో అక్రమంగా బర్తరఫ్ చేశారు. తిరిగి అతను రాజీవ్‌గాంధీతో ఒప్పందం కుదుర్చుకొని ప్రతిపక్ష కూటమికి గుడ్‌బై కొట్టిన

తర్వాతే అధికారానికి రాగలిగాడు. ప్రజాస్వామ్యాన్ని కశ్మీర్‌లో ఖూనీ చేసినంత సమర్థవంతంగా మన దేశంలో వేరే ఎక్కడా చేయలేదు.

తమ జాతీయ వ్యక్తిత్వాన్ని కాపాడుకోవాలని ప్రజలెవరయినా కోరుకోవడం తప్పు కాదు, దేశద్రోహం కాదు. అస్సాంలో అగ్రకుల హిందువులు అదే కోరిక కోరుకుంటే దేశమంతా వాళ్ళను సమర్థించింది. కశ్మీర్‌లో ప్రజలు ముస్లింలు అయ్యేసరికి దేశద్రోహం, వేర్పాటువాదం అంటున్నారు. ప్రజాస్వామ్యబద్ధంగా తమ వ్యక్తిత్వాన్ని కాపాడుకోవడం అసాధ్యమవుతుందన్న విశ్వాసం పోగొడితే ప్రజలు హింసాత్మకమయిన మార్గాలు చేపడతారు. 40 ఏళ్ళుగా కశ్మీర్‌లో ప్రజాస్వామ్యాన్ని ఖూనీ చేసినప్పుడు మనం మాట్లాడకుండా ఇప్పుడు హింసను గురించి ఆవేదన చెందితే ప్రయోజనం లేదు. ఎవరు ఒప్పుకున్నా ఒప్పుకోకున్నా ఈనాటి పరిస్థితి ఏమిటంటే కశ్మీర్ లోయలోని మెజారిటీ ప్రజానీకం భారతదేశం పట్ల విముఖత కలిగి ఉంది. ఆర్టికల్ 370లో ఇచ్చిన హామీని గౌరవించి కశ్మీర్‌కు స్వయంప్రతిపత్తి ఇచ్చి ఉంటే ఈ పరిస్థితి ఉత్పన్నం అయ్యేది కాదేమో! కశ్మీర్ ప్రజల ఆదరాభిమానాలు చూరగొన్న షేక్ అబ్దుల్లా వంటి నాయకులకు రాజకీయ స్వేచ్ఛ లేకుండా చేయకుంటే ఈ పరిస్థితి ఉత్పన్నం అయ్యేది కాదేమో! ఎన్నికల్లో రిగ్గింగ్‌కు పాల్పడి, కేంద్రానికి అనుకూలమయిన వారినే తప్ప, తమకు ఇష్టం అయిన వారిని ఎన్నుకొనే హక్కు కశ్మీర్ ప్రజలకు లేకుండా చేయకుంటే ఈ పరిస్థితి ఉత్పన్నం కాకుండా వుండేదేమో! ఇప్పటికయినా 1954 నాటి ఆర్డర్‌ను రద్దుచేసి ఆర్టికల్ 370ని పునరుద్ధరించే ప్రయత్నం చిత్తశుద్ధితో చేస్తే పరిష్కారానికి మార్గం దొరకవచ్చు. దాని బదులు పాకిస్తాన్ బూచి గురించి హెచ్చరికలు చేస్తూ ఈ లోపల శ్రీనగర్‌లోను, అనంతనాగ్‌లోను, బారాముల్లాలోను ప్రతి రోజూ కాల్పులలో డజన్లకొద్దీ జనాన్ని చంపుతూపోతే సమస్య పరిష్కారం కాకపోగా, బ్రహ్మారాక్షసి అయి కూర్చుంటుంది.

# కశ్మీర్ సమస్య : కొన్ని వాస్తవాలు

మొన్నటి పార్లమెంటు ఎన్నికలు జరిగిన తరువాత కొద్దిరోజులకే కశ్మీరుకు చెందిన జె.కె.ఎల్.ఎఫ్. (జమ్మూకశ్మీరు విముక్తి సంఘటన) కార్యకర్తలు దేశ హోంమంత్రి శ్రీ ముఫ్తీ మహమ్మద్ సయీద్ కుమార్తె అయిన డా. రుబియాను కిడ్నాప్ చేసి జైల్లో బందీలుగా ఉన్న తమ కార్యకర్తలను విడిపించుకున్నారు. అప్పటినుండి 'కశ్మీరు సమస్య' అనేది దేశంలో విస్తృతంగా చర్చకు వచ్చింది. కశ్మీరు గురించి వార్తలు ప్రతిదినం పత్రికలలో వస్తూ వున్నాయి. సంపాదకులు వ్యాఖ్యలు రాస్తున్నారు. మేధావులు వ్యాసాలు రాస్తున్నారు. అయినా అసలు విషయం ఏమిటో ఎవ్వరూ స్పష్టం చేయడం లేదు. 'దేశభద్రత', 'దేశ సమైక్యత', 'దేశ సమగ్రత' అనే వాటిని ఎట్లాగయినా సంరక్షించాలనీ, విచ్ఛిన్నకారులకు ప్రభుత్వం ఎంతమాత్రం లొంగకూడదనీ, పాకిస్తాన్ యుద్ధానికి వస్తే జాతి యావత్తూ ఒకటిగా నిలబడి ఎదుర్కొనాలనీ అందరూ పదే పదే విజ్ఞప్తులు చేస్తున్నారు గానీ అసలు ఇంతగా గాభరా పడవలసిన పరిస్థితి ఎందుకు ఉత్పన్నం అయిందో ఎవరూ వివరిస్తున్నట్టు కనిపించదు.

ఏ విషయాన్నయినా ప్రభుత్వం దృష్టితో కాకుండ ప్రజల దృష్టితో చూడడం ముఖ్యం. ప్రజాస్వామిక దృక్పథానికి ఇది కీలకమయిన విషయం. అసలు 'కశ్మీరు సమస్య' అనే మాటలు వాడడంలోనే అప్రజాస్వామిక ధోరణి వుంది. అది ఎవరికి సమస్య? కశ్మీర్ ప్రజలకా, భారత ప్రభుత్వానికా? కశ్మీరు ప్రజలకయితే అది హోంమంత్రి కుమార్తె కిడ్నాప్‌తో ప్రారంభం కాలేదే, 1947 నుండి వుందే. మరి ఇన్నాళ్ళూ దాని గురించి ఇంత పెద్దఎత్తున ఎందుకు చర్చ జరగలేదు? ఇన్నాళ్ళు 'కశ్మీర్ సమస్య' అనేది భారత్ పాకిస్తాన్ ప్రభుత్వాల మధ్య సమస్యగానూ ఇవ్వాళ మనందరి సమస్యగానూ ఎందుకు చూపిస్తున్నారు?

'భారతదేశం' అని ఇవ్వాళ మనం పిలుచుకునే దేశం చరిత్రలో అనాదిగా వున్నది కాదు. ఈ భూభాగంలో ఒక సామాజిక వ్యవస్థ, ఒక సంస్కృతి చాలాకాలంగా నెలకొని ఉన్నమాట వాస్తవమే. కులవ్యవస్థ, బ్రాహ్మణ మతం, సంస్కృత భాష, ఢిల్లీ సుల్తాన్ల తరువాతి కాలంలో ఒక రెవెన్యూ విధానం, ఒక పరిపాలనా యంత్రాంగం – ఇవీ ఆ

---

నలుపు మాసపత్రిక, ఏప్రిల్ 1990

సామాజిక వ్యవస్థ ప్రముఖ లక్షణాలు. ఈ వ్యవస్థలో విభిన్న భాషలు, ఆచారాలు, మతాలు, సంస్కృతి వున్న ప్రజలు నివసిస్తున్నారు. 'దేశ సమగ్రత' గురించి బాధపడే ముందు వీళ్ళంతా ఒక 'దేశం' ఎప్పుడయ్యారు, ఎట్లాగయ్యారు అని కొంచెం ఆలోచించాలి. అసలు వీళ్ళంతా ఒక 'దేశం' అయ్యారా అన్న అనుమానం వస్తే దానిని తొక్కిపెట్టకుండా చర్చించాలి. ఆర్టికల్ 370ని రద్దుచేయాలి అని గొడవ చేసేవాళ్ళు అసలు ఆర్టికల్ 370 రాజ్యాంగంలోకి ఎందుకొచ్చింది అని కొంచెం ఆలోచించాలి.

ఈ 'ఉపఖండం' అంతటా ఒకే రాజ్యం చరిత్రలో ఎన్నడూ లేదు. అశోకుడి నుండి ఔరంగజేబ్ దాకా ఇందులో కొంత భాగాన్నే తప్ప ఎవరూ అంతటినీ పరిపాలించ లేదు. బ్రిటిష్ వాళ్ళు మొత్తం అంతటికీ తాము సార్వభౌములమని ప్రకటించుకున్నారు గానీ వాళ్ళు ప్రత్యక్షంగా పరిపాలించిన ప్రాంతం ('బ్రిటిష్ పాలిత ప్రాంతం') సగభాగం మాత్రమే. మిగిలిన సగం భూభాగాన్ని బ్రిటిష్ వారికి సామంతులయిన రాజులు, నవాబులు, జాగీర్దార్లు, సంస్థానాధీశులు పరిపాలించారు. బ్రిటిష్ వాళ్ళు వెళ్ళిపోగానే తాము తిరిగి స్వతంత్రులు కావాలని వాళ్ళు కోరుకున్నారే తప్ప అందరూ ఒకే ఒక 'భారతదేశం'లో కలిసిపోవాలని కోరుకోలేదు. బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చలు జరిగినప్పుడల్లా వాళ్ళు ఈ విషయాన్ని నొక్కి చెప్పారు.

ఉపఖండంలోని ప్రజలంతా ఒకటయి ఇటు స్థానిక రాజవంశాల పాలనకూ అటు బ్రిటిష్ పాలనకూ వ్యతిరేకంగా పోరాటం చేసి విముక్తి పొంది వుంటే ఒక 'భారతదేశం' అనేది సహజంగా ఏర్పడి వుండేదేమో గానీ అటువంటిదేమీ జరగలేదు. గిరిజనులూ రైతాంగమూ కార్మికులూ చేసిన అనేక పోరాటాలు, సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటాలు విడి విడిగా అనైక్యంగా ఉండిపోయాయి. ఐక్యత సాధించినది బ్రిటిష్ పాలిత ప్రాంతాలలోని సంపన్నవర్గాలు మట్టుకే. వాళ్ళంతా ఒకటయి కాంగ్రెసు నాయకత్వంలో బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా బేరసారాల, రాజీ సర్దుబాట్ల పోరాటం నడిపారు. స్థానిక రాజ్యాలలోనూ సంస్థానాలలోనూ ఎటువంటి పోరాటాలు జరగకుండ కాంగ్రెస్ జాగ్రత్త పడింది. ఆ విషయం గాంధీ సగర్వంగా ప్రకటించుకున్నాడు కూడా. బ్రిటిష్ పాలిత ప్రాంతంలోని సంపన్నులు 'బ్రిటిష్ సామ్రాజ్యం అనే కుటుంబంలో మాకు కూడా ఒక గౌరవనీయమయిన స్థానం కావాలని' (ఇవి గాంధీగారి మాటలు) జరిపిన ఉద్యమం కాంగ్రెస్ వారి జాతీయ పోరాటం.

ఈ ఉద్యమం ఫలించే నాటికి స్థానిక రాజ్యాలనూ సంస్థానాలనూ ఏం చేయాలనే సమస్య వచ్చింది. బ్రిటిష్‌వాళ్ళు వెళ్ళిపోగానే వాళ్ళతోపాటు వాళ్ళ సార్వభౌమత్వం కూడా పోవాలనీ, ఆ సార్వభౌమత్వం కొత్త భారత ప్రభుత్వానికి సంక్రమించడానికి వీలులేదనీ, తాము స్వతంత్రులం కావాలనీ స్థానిక రాజులూ, సంస్థానాధీశులూ మొదటి నుంచి వాదిస్తూ

వచ్చారు. బ్రిటిషువాళ్ళు కూడ, స్థానిక రాజ్యాలు పూర్తిగా స్వతంత్రంగా ఉండకున్నా, తాము కోరుకున్న స్వయంప్రతిపత్తిని కలిగి వుండాలని భావించారు. సైమన్ కమిషన్ (1927), భారత ప్రభుత్వ చట్టం (1935), క్రిప్స్ రాయబారం (1942), కేబినెట్ రాయబారం (1947) అన్నీ కూడా కుడి ఎడమలుగా ఈ అభిప్రాయాన్నే వెలిబుచ్చాయి. కాంగ్రెసు నాయకులు అన్ని విషయాలలో లాగే ఈ విషయంలో కూడా బయటికి ఈ స్వతంత్ర ప్రతిపత్తి వాదాన్ని వ్యతిరేకిస్తూ లోపాయికారిగా దానితో రాజీపడుతూ వచ్చారు. అధికార మార్పిడి జరిగి నూతన రాజ్యాంగాన్ని రాయడానికి సమాయత్తమైన భారత రాజ్యాంగసభ కూడ బ్రిటిష్ కమీషన్ల సంప్రదాయాన్నే ఆమోదించింది. ప్రతి స్థానిక సంస్థానానికీ ఇటు భారతదేశంలో గానీ, అటు పాకిస్తాన్‌లో గానీ విలీనం అయ్యే హక్కు వుంటుందనీ, ఆ విలీనానికి ప్రాతిపదికగా ఒక విలీన ఒడంబడిక (Instruments of accession) మీద ఇరుపక్షాలూ సంతకం చేయాలనీ, విలీనమయ్యే సంస్థానం కొత్త కేంద్ర ప్రభుత్వానికి ఆ ఒడంబడికలో ఏ అధికారాలనయితే దత్తం చేస్తుందో (ప్రధానంగా రక్షణ, విదేశీ వ్యవహారాలు, రవాణా ప్రసార సాధనాలు) అవి తప్ప తక్కిన అన్ని విషయాలలోనూ స్వయంప్రతిపత్తిని కలిగి వుంటుందనీ భారత రాజ్యాంగకర్తలు ఒప్పుకున్నారు. ఇది వారు స్వచ్ఛందంగా అంగీకరించిన విషయమే తప్ప ఎవరూ కుట్ర పూరితంగా సాధించుకున్నది కాదు. ఎవరో దేశద్రోహుల చర్య కాదు.

చిన్న చిన్న రాజ్యాలూ సంస్థానాలూ తమకు ఏ స్వయంప్రతిపత్తీ వద్దని పూర్తిగా విలీనం అయిపోయాయి. పెద్ద రాజ్యాలయిన మైసూరు, భోపాల్, జమ్మూ-కశ్మీర్, హైదరాబాద్ కొంత తటపటాయించాయి గానీ వల్లభాయి పటేల్ వాటిని నయానా భయానా ఒప్పించి సంపూర్ణ విలీనాన్ని సాధించాలని ప్రయత్నించి జమ్మూ-కశ్మీర్ తప్ప తక్కిన అన్ని సంస్థానాలనూ విలీనం చేశాడు. ఇక బ్రిటిష్ పాలిత ప్రాంతాలలోని ప్రజలకయితే భారతదేశంలో చేరడం చేరకపోవడం అనే స్వేచ్ఛే లేదు. చేరడానికి పెద్దగా అభ్యంతరం లేని ప్రాంతాలే కాక చేరడానికి ఎంత మాత్రం ఇష్టంలేని నాగాలాండ్, మిజోరం, మణిపూర్‌లు కూడా బలవంతంగా భారతదేశంలో భాగమయ్యాయి. మన దేశ సమగ్రత, సమైక్యతల చరిత్ర ఇది.

జమ్మూకశ్మీర్ మట్టుకు ఇటు భారతదేశంలో గానీ అటు పాకిస్తాన్‌లో గానీ చేరడానికి ఇష్టపడలేదు. నైసర్గికంగా కూడ ఆ రాష్ట్రం స్వతంత్రంగా ఉండగల ప్రాంతం. వారికి ప్రత్యేకమయిన జాతి, భాష, సంస్కృతి ఉన్నాయి. కశ్మీర్ జాతీయ భావం చాలా లోతయినది. భారత పాకిస్తాన్ దేశాలు ఆ జాతీయ భావాన్ని గౌరవించి వుంటే జమ్మూకశ్మీర్ స్వతంత్రంగా ఉండేదేమో. అయితే ఈ దేశాల పాలకులలో అంతటి ప్రజాతంత్ర స్వభావం ఏ రోజూ లేదు. ఎవరికి వారు కశ్మీర్‌ను ఎట్లా కలుపుకోవాలి అనే చూశారు. జమ్మూకశ్మీర్‌లో

అత్యధికులు ముస్లింలు కాబట్టి మాకే చెందాలని పాకిస్తాన్ అంటే, పరిపాలకుడయిన హరిసింగ్ హిందువు కాబట్టి భారతదేశంలో చేరకపోతాడా అని మన వాళ్ళు ఆశపెట్టుకున్నారు. వాదనలతో సరిపెట్టుకోక పాకిస్తాన్ 1947 అక్టోబర్ 26వ తేదీన దుండగుల ముఠాలను కశ్మీర్ మీదికి పంపించింది. కశ్మీర్ రాజు గాభరాపడి భారత ప్రభుత్వం అండ కోరాడు. ఈ దేశంలో విలీనం అయితే సైనిక సహాయం దొరుకుతుందని విలీన ఒడంబడిక మీద సంతకం చేసి జమ్మూ కశ్మీర్‌ను భారతదేశంలో కలిపాడు. అయితే విలీన ఒడంబడిక ప్రకారం రక్షణ, విదేశీ వ్యవహారాలు, రవాణా ప్రసార సాధనాలు తప్ప తక్కిన విషయాలలో జమ్మూకశ్మీర్‌కు స్వయంప్రతిపత్తి ఉంటుంది. ఇది ఇరుపక్షాలూ ఒప్పుకున్న ఒడంబడికే.

రాజ్యాంగాన్ని తయారుచేయడం మొదలుపెట్టేసరికి పరిస్థితి ఇది. జమ్మూ – కశ్మీర్‌కు ఉన్న ప్రత్యేక స్థితిని రాజ్యాంగకర్తలు స్పష్టంగా గుర్తించారు. వాళ్ళంతా 'దేశభక్తులే', పాకిస్తాన్ ఏజెంట్లు కారు. దేశ విచ్ఛిన్నకులు కారు. ఆర్టికల్ 370ని ప్రతిపాదించిన గోపాలస్వామి అయ్యంగార్ జమ్మూ కశ్మీర్ విలీనం వెనక వున్న చరిత్రను దృష్టిలో ఉంచుకొని ఆ రాష్ట్రం కోసం ప్రత్యేక అధికారాన్ని ప్రతిపాదిస్తున్నానన్నాడు. విలీన ఒడంబడికలో చెప్పిన మేరకు మాత్రమే కేంద్ర ప్రభుత్వానికి కశ్మీర్ మీద శాసన అధికారం ఉంటుందనీ, ఏదయినా ఒక విషయం ఆ పరిధిలోకి వస్తుందా రాదా అన్న విషయాన్ని భారత ప్రభుత్వం కశ్మీర్ ప్రభుత్వాన్ని సంప్రదించి నిర్ణయిస్తుందనీ, విలీన ఒడంబడికలో లేని విషయాలలో కూడా కేంద్ర ప్రభుత్వం తనకు శాసనాధికారం కావాలని కోరుకుంటే రాష్ట్ర ప్రభుత్వం అనుమతితో మాత్రమే పొందగలదని ఆర్టికల్ 370 అంటుంది.

ఇందులో మూడవ అంశమే కశ్మీర్ వ్యక్తిత్వానికి గొడ్డలిపెట్టు అయింది. స్వయంప్రతిపత్తి ఇస్తున్నామని ఒకవైపు చెప్తూ ఆ స్వయంప్రతిపత్తిని రాష్ట్ర ప్రభుత్వం అనుమతితో తొలగించవచ్చునని కొసరు చేర్చడం వలన స్వయంప్రతిపత్తి ఏ మాత్రం మిగలలేదు. ప్రజాస్వామికంగా ఎన్నికయిన షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని 1953లో గవర్నర్ కరణ్‌సింగ్ (మాజీ రాజు హరిసింగ్ కొడుకు) 'అసమర్థ పాలన' అనే పేరుపెట్టి బర్తరఫ్ చేశాడు. షేక్ అబ్దుల్లాను అరెస్టు చేశారు. ఈ రకంగా రాష్ట్ర ప్రభుత్వాన్ని లొంగదీసుకొని, 1954లో 'రాష్ట్ర ప్రభుత్వం అనుమతి'తో కేంద్ర ప్రభుత్వానికి ఇతర రాష్ట్రాలలో ఉన్న శాసన అధికారాన్ని కశ్మీర్‌లో కూడా దత్తం చేసే 'రాజ్యాంగం (జమ్మూ – కశ్మీర్ సంబంధిత) ఆర్డర్'ను జారీ చేసింది కేంద్ర ప్రభుత్వం. దీనితో ఆర్టికల్ 370 పూర్తిగా నిస్సారమయి పోయింది. 1957లో జమ్మూకశ్మీర్‌కు ఒక ప్రత్యేక రాజ్యాంగాన్ని రాసుకున్నారు గానీ అంతిమ పరిశీలనలో జమ్మూకశ్మీర్‌కు మిగిలిన స్వయంప్రతిపత్తి మృగ్యం.

1947లోనే పాకిస్తాన్ తన ఎత్తుగడ విఫలమయిందని గుర్తించి 'కశ్మీర్ సమస్య'ను ఐక్యరాజ్యసమితికి నివేదించింది. కశ్మీర్ భవితవ్యాన్ని కశ్మీర్ ప్రజలే నిర్ణయించుకోవాలనీ,

అందుకోసం ప్లెబిసైట్ (Plebiscite) అంటే... సర్వజన అభిప్రాయ సేకరణ నిర్వహించాలనీ ఐక్యరాజ్యసమితి తీర్మానించింది. ఆ రోజులలో నెహ్రూ కూడా 'కశ్మీర్ భవితవ్యాన్ని కశ్మీర్ ప్రజలే నిర్ణయించుకుంటారు. ఇది మేము కశ్మీర్ ప్రజలకే కాక యావత్ ప్రపంచానికి ఇస్తూ వున్న వాగ్దానం' అని ప్రకటించాడు. ఆరేళ్ళ తరువాత అదే నెహ్రూ షేక్ అబ్దుల్లా ప్రభుత్వాన్ని బర్తరఫ్ చేయించి, కశ్మీర్ స్వయంప్రతిపత్తిని హుళక్కి చేసే 1954 ఆర్డర్‌ను జారీచేసి 1957 ఎన్నికల నాటికి 'కశ్మీర్ భారత భూభాగమేననడంలో ఎటువంటి వివాదానికి తావులేదు' అని ప్రకటించడం మొదలుపెట్టాడు. ఐక్యరాజ్యసమితిలో పాకిస్తాన్ కశ్మీర్ ప్రస్తావన తెచ్చినప్పుడల్లా భారతదేశం సోవియట్ రష్యా యొక్క వీటో అధికారాన్ని అడ్డం పెట్టుకొని బయటపడుతూ వుంది.

కశ్మీర్‌లో మళ్ళీ ప్రజా ప్రభుత్వం ఏర్పడడం అంటూ జరిగితే సమస్య తిరిగి మొదటికొస్తుందని చెప్పి కాంగ్రెస్ ప్రభుత్వం ఆ రాష్ట్రంలో ఏ ఒక్క ఎన్నికలను కూడా సక్రమంగా జరగనివ్వలేదు. అన్ని ఎన్నికలలోనూ రిగ్గింగ్, హింసాకాండ పెద్దఎత్తున జరుగుతూ వచ్చాయి. ఎప్పుడూ కూడా కేంద్రానికి తొత్తులయిన వాళ్ళే గెలుస్తూ వచ్చారు. 1975లో ఇందిరాగాంధీకి, షేక్ అబ్దుల్లాకు జరిగిన ఒడంబడికలో కశ్మీర్ సమస్య పరిష్కారం అయిపోయిందని అబ్దుల్లా ఒప్పుకున్న తరువాతనే అతని రాజకీయ స్వేచ్ఛ పునరుద్ధరించబడింది. ఆ తరువాతే అతను తిరిగి అధికారంలోకి రాగలిగాడు. అతని మరణానంతరం 1983లో అతని కుమారుడు ఫరూక్ అబ్దుల్లా ఎన్నికయ్యాడు. అయితే అతను ఇతర ప్రతిపక్ష పార్టీలతో కలసి మళ్ళీ రాష్ట్రాల స్వయంప్రతిపత్తిని గురించి మాట్లాడడం ప్రారంభించేసరికి ఏడాదిలోనే అతని ప్రభుత్వాన్ని కూడా బర్తరఫ్ చేశారు. తిరిగి ఫరూక్ అబ్దుల్లా కాంగ్రెస్‌కు తొత్తుగా మారడానికి ఒప్పుకొని రాజీవ్‌గాంధీతో 1986లో ఒప్పందం చేసుకున్న తరువాతే అధికారానికి రాగలిగాడు. దానివల్ల అతను పొందిన ప్రతిఫలం ఏమిటంటే, విపరీతమయిన స్థాయిలో అతను బాహాటంగా అవినీతికి పాల్పడడం ప్రారంభించినా కేంద్రం జోక్యం చేసుకోకుండా కొనసాగనిచ్చింది.

ఇదీ క్లుప్తంగా 'కశ్మీర్ సమస్య' చరిత్ర. కశ్మీర్ ప్రజల జాతీయ వ్యక్తిత్వాన్ని అగౌరవపరచి, వాళ్ళకు కల్పిస్తామని హామీ యిచ్చిన స్వయం ప్రతిపత్తినీ స్వయం నిర్ణయాధి కారాన్నీ లేకుండా చేసి, కనీసం పార్లమెంటరీ ప్రజాస్వామ్య సంప్రదాయాలనూ, విలువలనూ పాటించకుండా కేంద్రానికీ కాంగ్రెస్ పార్టీకీ తొత్తులయిన వారికి మట్టుకే కశ్మీర్‌లో అధికారానికి వచ్చే అవకాశం వుందని పదే పదే స్పష్టం చేసి, అందుకోసం ప్రభుత్వాలను బర్తరఫ్ చేసి, హింసకు పాల్పడి – ఇన్ని చేసిన తరువాత కశ్మీర్ ప్రజలకు భారతదేశం మీద ఇంకా ప్రేమ మిగిలివుంటే మనం ఆశ్చర్యపోవాలి గానీ ద్వేషం పెరిగితే ఆశ్చర్యపోవలసిన అవసరం ఏముంది? అసలు భారతదేశంలో అంతర్భాగంగా ఉండడం

వల్ల జమ్మూకశ్మీర్ ఏం సాధించింది, ఏ ప్రయోజనం పొందింది? కనీస పారిశ్రామిక ప్రగతి గానీ ఆర్థిక అభివృద్ధి గానీ ఈ నాలుగు దశాబ్దాలలో కశ్మీర్‌కు దక్కాయా? ఏ ప్రయోజనమూ పొందనప్పుడు వాళ్ళు ఈ దేశంలో విలీనం కావాలని ఎందుకు కోరుకోవాలి? నాలుగు దశాబ్దాల దగాకోరు పాలన ఫలితంగా ఇవ్వాళ కశ్మీర్ ప్రజలు నూటికి నూరు శాతం తమకు భారతదేశంలో అంతర్భాగంగా ఉండాలని లేదనీ స్వాతంత్ర్యం కావాలనీ కోరుకుంటూ వుంటే, సైన్యం మోహరింపులకూ, పోలీసుల కాల్పులకూ బెదరకుండా భయపడకుండా వేల సంఖ్యలో ఊరేగింపులు చేస్తూ వుంటే ఇదంతా దేశద్రోహుల నిర్వాకమని, పాకిస్తాన్ సాగిస్తున్న దుర్మార్గమనీ ఎన్నాళ్ళు ఆత్మవంచన చేసుకుంటాం? 'దేశభక్తి'నీ 'దేశ సమగ్రత'నూ తుపాకులతో నిలబెట్టాలనే అర్థరహితమయిన ప్రయత్నాన్ని ఎన్నాళ్ళు సహిస్తాం?

# పాపం కశ్మీరీలు

**క**శ్మీర్ ప్రజలంత దురదృష్టవంతులు ఈ దేశంలో ఎవరూ ఉండరు. వాళ్ళ ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా ఇండియా-పాకిస్తాన్‌లు 50 ఏళ్ళ కింద వాళ్ళ భూభాగాన్ని రెండుగా పంచుకున్నాయి.

ఇప్పుడు వాళ్ళ 'విముక్తి' పోరాటం కూడా వాళ్ళ ఇష్టాయిష్టాలతో సంబంధం లేకుండా ఇస్లామిక్ సనాతనవాదుల చేతిలోకి పోతున్నది.

కశ్మీరీలలో ఇస్లామిక్ సనాతనవాదులు లేనేలేరని కాదు. ఉన్నారు. కానీ ఈ రోజు కశ్మీరీ మిలిటెన్సీని తమ చేతులలోనికి తీసుకున్న హర్కత్-ఉల్-అన్సార్ వంటి 'పాన్ ఇస్లామిక్' సంస్థల ప్రాపంచిక దృక్పథం కశ్మీర్‌లో పెద్దగా ప్రభావం ఉన్న దృక్పథం కాదు. ప్రపంచ ముస్లింలందరూ ఒక్కటనీ, ఎక్కడున్నా వారు మొదట ముస్లింలే తప్ప వేరే ఏదీ కాదనీ, వారి రాజకీయ దృక్పథంలో ఇస్లాం కేంద్ర విషయమనీ పాన్ ఇస్లామిక్ వాదులు నమ్ముతారు. కానీ ఇస్లాం పట్ల గాఢమైన అభిమానం ఉన్న కశ్మీరీలు సహితం తమ కశ్మీరీ జాతీయతను మరచిపోవడానికి ఇష్టపడరు. కశ్మీర్ భూభాగమన్నా కశ్మీరీ సంస్కృతి అన్నా వారికి గాఢమైన అభిమానం.

ఈ అభిమానం వల్లనే కశ్మీరీలు 1947లో అత్యధిక ప్రజామోదంతో పాకిస్తాన్‌లో చేరడం కంటే ఇండియాలో భాగం కావడం మేలనుకున్నారు. పాకిస్తాన్‌లో నెలకొల్పబోతున్న ఇస్లామిక్ రాజ్యం తమ సాంస్కృతిక వైవిధ్యాన్నీ ప్రత్యేకతలనూ గౌరవించదనీ, నూతన భారత పాలకులు నెలకొల్పబోయే లౌకిక ప్రజాతంత్ర రాజ్యంలో అది సాధ్యం అవుతుందనీ వారు భావించారు. ఈ రెండు దేశాలలో ఇదో అదో తేల్చుకోవలసిన అవసరమేమీ లేదనీ, కశ్మీరు స్వతంత్రంగా ఉండవచ్చుననీ ఆశించిన వారు లేకపోలేదు గానీ అది ఆచరణ సాధ్యం కాదని ఎక్కువమంది భావించారు.

అయినా ఆ ఆలోచన కశ్మీరులో చావలేదు. ఒక బలమైన కోరికగా ఉండిపోయింది. ఇండియా కల్పించిన లౌకిక ప్రజాతంత్ర రాజ్యంలోని మంచి చెడుల సంగతి ఎలా ఉన్నా, భారత పాలకుల సార్వభౌమత్వ ప్రయోజనాల ముందు అది తలవంచవలసిందేనని కశ్మీరీలు త్వరలోనే గుర్తించారు.

---

ప్రజాతంత్ర వారపత్రిక, 18-10-1998

మళ్ళీ 'ఆజాదీ' కశ్మీరులో బలమైన నినాదం అయింది. 1990-91 ప్రాంతంలో అది స్వతంత్ర, లౌకిక, ప్రజాతంత్ర కశ్మీర్ కావాలన్న కాంక్షగానే ముందుకొచ్చింది. కానీ 1992 తర్వాత, వివిధ కారణాల వల్ల, పాకిస్తాన్‌లో కశ్మీర్‌ను విలీనం చేయాలనే మత రాజకీయ కాంక్షదే కశ్మీర్ మిలిటెన్సీలో పైచేయి అయింది. ఆ కారణాలలో ముఖ్యమైనది- మత రాజకీయ మిలిటెన్సీకే పాకిస్తాన్ ఆర్థిక, సైనిక సహాయం చేయడానికి సిద్ధంగా ఉండడం. ఆ సహాయం లేకుండా కశ్మీరీలు భారత సైన్యంపైన యుద్ధం చేయలేరు. అందువల్ల కశ్మీర్‌ను పాకిస్తాన్‌లో విలీనం చేయాలన్న కోరిక కశ్మీరీలలో మెజారిటీ కోరిక కాకపోయినప్పటికీ, కశ్మీరీ మిలిటెన్సీలో ఆ ఆలోచనా సరళిదే పైచేయి అయింది.

దాదాపు 1992 నుండి కశ్మీర్‌లో నెలకొన్న ఈ పరిస్థితి పోనుపోను మరింత వికృత రూపం తీసుకోవడం మొదలుపెట్టింది. కశ్మీరీ మిలిటెన్సీ మరింతగా పాకిస్తాన్ చేతులలోనికి, ఆపైన హర్కత్-ఉల్-అన్సార్, ఇఖ్వాన్ ఉల్ ముస్లిమీన్‌ల వంటి 'పాన్ ఇస్లామిక్' సంస్థల చేతులలోనికి పోయింది.

దాని పర్యవసానం హిందువుల విచ్చలవిడి ఊచకోత. కశ్మీరీ మిలిటెన్సీ కశ్మీరీల చేతిలోనే ఉన్నన్నాళ్ళు, కేవలం హిందూ మతస్తులయినందుకు ఎవ్వరినీ కశ్మీర్‌లో చంపటం జరగలేదు. ఆర్.ఎస్.ఎస్ బాధ్యులనూ, కశ్మీర్ స్వాతంత్ర్యాన్ని వ్యతిరేకించిన హిందువులనూ మాత్రమే చంపారు. ఈ హత్యలు అన్నీ సమర్థనీయమని కాదు గానీ, కేవలం మతపరంగా హిందువులయినందుకు కశ్మీర్‌లో ఆనాడు ఎవ్వరినీ చంపలేదు. ఆ విషయానికి కశ్మీరీలు గర్వించేవారు కూడా.

కానీ కశ్మీరీ మిలిటెన్సీ బయటి దేశాల ఇస్లామిక్ మిలిటెంట్ల చేతిలోకి పోయిన కొద్దీ ఇటువంటి హత్యాకాండ పెరిగింది. అయితే కశ్మీరీలు గర్వంగా చెప్పుకునే కశ్మీరీ సంస్కృతికి నిలయమైన కశ్మీర్ లోయలో కాక కశ్మీర్ లోయకూ జమ్మూకూ మధ్యనున్న పీర్‌పంజల్ పర్వత శ్రేణుల ప్రాంతంలో ఈ హత్యాకాండ ఎక్కువగా జరుగుతున్నది.

ఉధంపూర్ జిల్లాలోని ప్రాణ్‌కోట్‌లో ఈ సంవత్సరం ఏప్రిల్ 17-18 రాత్రి 26 మందిని, పూంచ్ జిల్లా సురాన్‌కోట్‌లో మే 5న ఒకే కుటుంబానికి చెందిన నలుగురిని, దోడా జిల్లాలోని దేశా గ్రామంలో అదే రోజున మృతదేహాన్ని శ్మశానానికి తీసుకుపోతున్న వారిపైన కాల్పులు జరిపి ఏడుగురిని, దోడా జిల్లాలోనే ఛాప్నారిలో జూన్ 20న రెండు పెళ్ళి బృందాలపైన కాల్పులు జరిపి 25 మందిని, అదే జిల్లా కిష్ట్వార్ తాలూకాలోని రెండు గ్రామాలలో జూలై 27-28 రాత్రి 16 మందిని, పూంచ్ జిల్లా సురాన్‌కోట్ తాలూకాలోని నాలుగు గ్రామాలలో ఆగస్ట్ 4 రాత్రి 19 మందిని సాయుధ మిలిటెంట్లు కాల్చిచంపారు. చనిపోయిన వారందరూ హిందువులే. కేవలం చేతికి చిక్కిన వాళ్ళను చంపి బీభత్సం సృష్టించాలన్న అమానుష తర్కానికి వారు బలి అయ్యారు తప్ప వారి

హత్యలకు వేరే కారణమేమీ లేదు. నిజానికి హతులలో చిన్నపిల్లలు కూడా చాలామంది ఉన్నారు.

జమ్మూ ప్రాంతంలో జరిగిన ఈ హత్యలేకాక కశ్మీర్‌లోనూ ఒక ఘటన జరిగింది. జనవరి 25న శ్రీనగర్ నుండి లదాఖ్ పోయే రహదారిపైన ఉన్న గందర్బల్ తాలూకాలోని వంధమా గ్రామంలో 23 మంది హిందూ పండిట్‌లను మిలిటెంట్లు కాల్చి చంపారు.

ఈ హత్యలు చేసిన మిలిటెంట్లు స్థానికులు కారని అన్ని పత్రికలూ రాశాయి. వాళ్ళంతా పాకిస్తాన్‌లోని శిక్షణ శిబిరాలలో శిక్షణ పొంది కశ్మీర్‌లో పోరాటం చేయడానికి వచ్చిన పాకిస్తానీలు, ఆఫ్ఘాన్‌లు, ఇతర పశ్చిమాసియా దేశస్తులు. కశ్మీరీ మిలిటెన్సీ పూర్తిగా కశ్మీరీ సంస్థ అయిన జమ్మూకశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ చేతి నుండి కొంతవరకు పాకిస్తాన్ ప్రభావంలో ఉన్న హిజ్బుల్ ముజాహిదీన్ చేతిలోనికి, ఆ తరువాత అధిక భాగం విదేశీ ముస్లిం మతవాదులయిన వృత్తి మిలిటెంట్ల సంస్థలయిన హర్కత్-ఉల్-అన్సార్, లష్కర్-ఇ-తొయిబా వంటి సంస్థల చేతిలోకి పోయిన పర్యవసానమే ఈ హత్యాకాండ. ఇప్పుడు ముస్లిం సనాతనవాద వృత్తి మిలిటెంట్ల అగ్రపోషకులలో ఒకడయిన ఒసామా బిన్‌లాడెన్ కశ్మీర్ మీద దృష్టిసారించాడని తెలుస్తున్నది. కశ్మీర్‌ను ఎట్లాగయినా 'విముక్తి' చేయడానికతను సంసిద్ధంగా ఉన్నాడట. భారతదేశం కూడా ఎట్లాగయినా కశ్మీర్‌ను 'కాపాడడానికి' సిద్ధంగా ఉంది. కశ్మీర్ వివాదంలోని భిన్నపక్షాలు ఉపయోగిస్తున్న ఈ భాష విన్నప్పుడు ఎవరు ఎవరి నుండి ఎవరిని 'కాపాడుతున్నారో', 'విముక్తి చేస్తున్నారో' అర్థం కాదు. తమ జీవితం, తమ భవితవ్యం తమదికాని రాజకీయ అజెండాలలో ఇరుక్కుపోవడం కశ్మీరీలు గడచిన యాభై ఏళ్ళుగా అనుభవిస్తున్న దురదృష్టం. మొదట అది భారత్-పాకిస్తాన్‌ల పోటీ జాతీయవాద అజెండాలో ఇరుక్కుంది. తరువాత అమెరికా-సోవియట్ రష్యాల ప్రచ్ఛన్న యుద్ధ అజెండాలో ఇరుక్కుంది. ఆపైన పాన్ ఇస్లామిక్ వాదుల సనాతనవాద అజెండాలో ఇరుక్కుంది. ఈ జగన్నాటకంలో లేటెస్టుగా తెరమీదికి వచ్చిన వాడు ఒసామాబిన్ లాడెన్. ఈ మధ్య బిల్‌క్లింటన్ ప్రభుత్వం ఇతని మీద బాంబు దాడి చేసినప్పుడితను పత్రికలకెక్కాడు. కానీ నిజానికి ఇతనినీ, ఇతని వంటి మరి కొందరు ముస్లిం సనాతనవాద మిలిటెంట్లనూ, రాజకీయవేత్తలనూ పోషించిందీ పెంచిందీ అమెరికాయే. ఆఫ్ఘానిస్తాన్ నుండి సోవియట్ రష్యాను తరిమేయడానికి పాన్ ఇస్లామిక్ మిలిటెన్సీ పనికొస్తుందని భావించిన అమెరికాయే ఈ అరబ్బు కోటీశ్వరుడిని ఆఫ్ఘానిస్తాన్‌లో ప్రవేశపెట్టింది. అమెరికా అవసరం తీరిపోయింది గానీ అతనికి వేరే అవసరాలున్నాయి కాబట్టి వాటి సాధన కోసం ఆఫ్ఘానిస్తాన్‌లో తన 'పోరాటం' కొనసాగిస్తున్నాడు. ఇది ఇప్పుడు బిల్‌క్లింటన్‌కు ఇబ్బందికరంగా తోచవచ్చును గాక.

ఒక్క బిన్‌లాడెన్ మాత్రమే కాదు. హర్కత్-ఉల్-అన్సార్ వంటి పాన్ ఇస్లామిక్ మిలిటెంట్ సంస్థలు కూడా ఆఫ్ఘానిస్తాన్ నుండి సోవియట్ రష్యాను తరిమేయడానికి

పనికొస్తాయని అమెరికా ఒకనాడు వాటిని ప్రోత్సహించింది. ఇప్పుడది ఏకుమేకయి కూర్చునే సరికి హర్కత్-ఉల్-అన్సార్ 'టెర్రరిస్టు' సంస్థ అని అమెరికా ప్రకటించింది. అయినా ఆ సంస్థ తన పేరును హర్కత్-ఉల్-ముజాహిదీన్‌గా మార్చుకొని తన కార్యకలాపాలను ఎప్పటిలాగే కొనసాగిస్తున్నది.

ఈ పరిణామాల పర్యవసానంగా జమ్మూకశ్మీర్‌లో నివసించే హిందూమతస్తుల పైన జరుగుతున్న ఘోరమైన హత్యాకాండను నిర్ద్వంద్వంగా ఖండించడం, వారిలో నెలకొన్న అభద్రత పట్ల సానుభూతి చూపించడం ఎంత అవసరమో, దాదాపు ఏడు దశాబ్దాలుగా ఆ రాష్ట్ర రాజకీయాలకు కేంద్ర విషయంగా ఉన్న కశ్మీరీ జాతీయవాదాన్ని ఈ పరిణామాలు భ్రష్టుపట్టించి సనాతనవాద మిలిటెన్సీగా దానిని తిరగరాస్తున్న తీరును గుర్తించడం, దానికి ప్రపంచం ముందు బాధ్యత వహించవలసి వస్తున్న కశ్మీరీ ముస్లింల సందిగ్ధస్థితి పట్ల సానుభూతి చూపించడం కూడా అంతే అవసరం. తమ 'విముక్తి' పేరుమీద జరుగుతున్న ఈ సనాతనవాద మతవాద హింసను వాళ్ళు పూర్తిగా దూరం ఉంచనూ లేరు, అదే సమయంలో అందులో ఉన్న అనాగరిక విద్వేష రాజకీయాలను ఆమోదించనూ లేరు.

హిందువుల పట్ల ద్వేషం కశ్మీరీ జాతీయవాదంలో ఏనాడూ ఒక ముఖ్యలక్షణం కాదు. ఉద్యమాలు – ముఖ్యంగా మిలిటెంట్ పోరాటాలు – తమలోని ద్వేషాన్ని మామూలుగా గొప్పగా భావిస్తాయి. తాము ఒకరిని ద్వేషిస్తున్నట్టు కనపడుతున్నందుకు సిగ్గుపడే గుణం కశ్మీరీలలో మాత్రమే కనిపిస్తుంది. 'మేము ద్వేషిస్తున్నది ఇండియానే తప్ప ఇండియన్స్‌ను కాదు' అని అడగకుండానే కశ్మీరీలలో చాలామంది సంజాయిషీ చెప్తుంటారు.

అటువంటి వాళ్ళిప్పుడు తమ 'విముక్తి' పేరుమీద హర్కత్-ఉల్-ముజాహిదీన్ వంటి సంస్థలూ, ఒసామా బిన్‌లాడెన్ వంటి వాళ్ళూ సాగిస్తున్న విద్వేష రాజకీయాలను కాదనలేక అవుననలేక సతమతం కావడం బాధాకరమైన విషయమే. పోనీ వాళ్ళకు ఈ అంతర్వేదన తప్ప వేరే నష్టమేమీ లేదా అంటే చాలా ఉంది. ఎనిమిదేళ్ళుగా భారత సైనిక బలగాలు కశ్మీర్‌లో పెద్దఎత్తున ఊచకోతకు పాల్పడుతున్నాయి. మిలిటెంట్ల చేతిలో హిందువులు చనిపోతే మనకి ఇక్కడ వార్త అవుతుంది గానీ ప్రతిరోజూ సైనిక బలగాల చేతిలో చనిపోతున్న కశ్మీరీ ముస్లింల చావు ఇక్కడ వార్త కాదు. కశ్మీరీ మిలిటెన్సీ మత సనాతనవాదుల చేతిలోకి పోయేకొద్దీ దానిని కారణంగా చూపించి కశ్మీరీ ముస్లింలను మరింత పెద్దెత్తున చంపడం భారత సైనిక బలగాలకు సులభం.

# ఇది కేవలం సరిహద్దు సమస్య కాదు

దేశమంతటిలోకీ ఒక్క కశ్మీర్‌లో మాత్రమే ప్రజలు ఈ రోజు ప్రపంచ కప్ క్రికెట్ కంటే యుద్ధాన్ని గురించి ఎక్కువ చర్చించుకుంటున్నారని ఒక కశ్మీర్ దినపత్రిక ఈ మధ్య కొంచెం వ్యంగ్యంగా వ్యాఖ్యానించింది. నిజమే మరి, వాళ్ళకు 1947 కాకున్నా 1965, 1971 బాగానే జ్ఞాపకం ఉన్నాయి. తక్కిన భారత పాకిస్తాన్ ప్రజానీకానికి ఆ యుద్ధాల జయాపజయాలు మాత్రమే జ్ఞాపకం ఉండవచ్చు కానీ కశ్మీరీలకు యుద్ధ అనుభవం జ్ఞాపకం ఉండక తప్పదు. పైగా 1947, 1965 యుద్ధాలలో కశ్మీర్ ప్రధాన విషయం కాగా 1971 యుద్ధంలోనూ అది ఇరు దేశాల యుద్ధ లక్ష్యంలో ఒక అంశమే. కశ్మీర్‌ను పాకిస్తాన్ నుండి 'రక్షించ'డానికి భారత ప్రభుత్వం, భారత్ నుండి 'విముక్తి' చేయడానికి పాకిస్తాన్ ప్రభుత్వం యుద్ధ రంగంలోకి దిగాయి. సగటు కశ్మీరీలు దానిని ఆ కళ్ళతోనూ చూడరు, ఈ కళ్ళతోనూ చూడరు. అయినప్పటికీ యుద్ధం పర్యవసానాలను వారే ఎక్కువ భరించవలసి రావడం కశ్మీరీల ఆధునిక చరిత్రలోని విషాదానికొక మచ్చుతునక.

గతంలో కంటే ఇప్పుడు భయం ఎక్కువ ఉండడానికి కారణం అణుబాంబులు. నిజానికి కశ్మీర్ ప్రజలే కాదు. దేశం యావత్తు ఈసారి యుద్ధ ప్రమాదాన్ని గురించి మరింత ఎక్కువ భయపడడానికి కారణం, ఈసారి యుద్ధం అంటూ వస్తే అది అణు యుద్ధంగా మారగల ప్రమాదమే. ఇరు దేశాలలోనూ ఈ ఆదుర్దాలను పెంచిన ఘనత మన పాలకులదే. అణుయుద్ధంలో గెలుపు ఓటములు ఉండవు. చెప్పుకోవడానికి ఒకరు గెలిచినవారు, ఒకరు ఓడినవారు ఉంటారు కానీ నిజానికి ఉండేది సార్వత్రిక విధ్వంసమే.

భారత్‌తో యుద్ధం చేసి గెలవడం తనకింక సాధ్యం కాదన్న అభిప్రాయానికి పాకిస్తాన్ 1971 యుద్ధం తరువాత వచ్చింది. ఇప్పుడు అణుబాంబులు వచ్చిన తరువాత కూడా పాకిస్తాన్ 'గెలవ' లేకపోవచ్చు. కానీ గెలుపు ఓటములు లెక్కపెట్టుకోవడానికి – అణుయుద్ధమంటూ వస్తే – ఇరువైపులా ఎక్కువ మిగలకపోవచ్చు. మన పాలకుల మితిమీరిన హైందవ జాతీయవాదం రెండు దేశాలనూ ఇక్కడికి తీసుకువచ్చింది.

---

ఆంధ్రప్రభ దినపత్రిక, 10-06-1999

అందుకే 'చొరబాటుదారుల' సమస్యను వీలయినంత తక్కువ ఆర్భాటంతో పరిష్కరించుకోవడం మంచిది. ఇదేదో కొత్తగా మొదలయిన సమస్య కాదు. 1947లో పాకిస్తాన్ ప్రాంతం నుండి 'చొరబాటుదారులు' జమ్మూకశ్మీర్‌లోకి ప్రవేశించడంతో 'కశ్మీర్ సమస్య' అనేది మొదలయింది. ఆ 'చొరబాటుదారులు' ఆనాటి నుండి ఈనాటి దాకా తమను తాము విముక్తి పోరాటకారులుగానే భావించుకుంటున్నారు. ఆనాటి నుండి ఈనాటి దాకా వారిలో పాకిస్తాన్ సైనికులు కొందరు అనధికారికంగా (అంటే వారిపై అధికారులకు తెలియకుండా అని కాదు) ఉంటూనే ఉన్నారు.

1965లో కూడా 'చొరబాటుదారులు' అని మన ప్రభుత్వం పిలిచేవారి ప్రవేశంతోనే యుద్ధం మొదలయింది.

1989 నుండి ఈనాటి దాకా ఆ రాష్ట్రంలో సాగుతున్న మిలిటెన్సీకి అండగా 'చొరబాటుదార్లు' ప్రవేశిస్తూనే ఉన్నారు. మొదట కశ్మీర్ లోయలోని సరిహద్దు జిల్లాలయిన బారాముల్లా, కుప్వారాలలోకి ప్రవేశించడం మొదలుపెట్టారు. తర్వాత జమ్మూ ప్రాంతంలోని రాజోరి, పూంచ్ సరిహద్దులగుండా ప్రవేశించారు. ఆ తర్వాత పీర్ పంజల్ కొండల మీదుగా దోడా జిల్లాలోకి రావడం మొదలయింది. ఇప్పుడు అన్నింటి కంటే కష్టతరమైన కార్గిల్ సరిహద్దు మీదుగా ప్రవేశిస్తున్నారు. పది సంవత్సరాలుగా భారత సైన్యం ఏ ఆర్భాటం లేకుండా వాళ్ళను వెనక్కి తరిమే ప్రయత్నం చేస్తూనే ఉంది. ఒక్కొక్కసారి విజయం సాధించింది. ఒక్కొక్కసారి అపజయం పాలయింది. కానీ ఎప్పుడూ లేనిది ఇప్పుడింత ఉద్రేకం ఎందుకు? దేశ ప్రజలంతా చొరబాటుదారులను ఎదుర్కోవడంలో నిమగ్నం కావాలన్న ఈ ఆవేశం ఎందుకు? బి.జె.పి.కి రాబోయే ఎన్నికలలో ఈ వాతావరణం బాగా ఉపయోగపడుతుందనుకోండి. కానీ దేశమంతా ఉద్రేకపడడం ఎందుకు?

ఉద్రేకం ఎందుకు వద్దంటే ఈ చొరబాటుదారులంతా భారత సైన్యం తాకిడికి తట్టుకోలేక పారిపోయినా, లేక మనవాళ్ళంతా చాలా ఉద్విగ్నతతో డిమాండ్ చేస్తున్నట్టు భారత సైన్యం వాళ్ళందరినీ చంపేసినా 'చొరబాటుదారుల' సమస్య అంతమయిపోదు. వాళ్ళను ఆహ్వానించడానికి కశ్మీర్ లోయలోని ప్రజలు సిద్ధంగా ఉన్నంత కాలం అది అంతమయిపోదు. భారత సైన్యాన్ని తప్పించుకోవడం ఈ చొరబాటుదారులకు కష్టం కావచ్చు, కానీ లోయలోకి ప్రవేశిస్తే దాదాపు ఏ ఇంట్లోనయినా వారికి ఆశ్రయం దొరుకుతుంది. ఈ సంసిద్ధతను 'దేశద్రోహం'గా అర్థం చేసుకునేట్టయితే 'చొరబాటు దారుల'నందరినీ చంపేయమని ఆవేశపడినట్టే కశ్మీరీలందరినీ చంపేయమని ఆవేశపడడం తప్ప చేయగలిగిందేమీ ఉండదు.

ఈ సంసిద్ధత వెనుకనున్నది చాలా లోతయిన చారిత్రక, రాజకీయ కారణాలున్న వైమనస్యం అని అర్థం చేసుకున్నట్లయితే 'చొరబాటుదారుల'కు ఆశ్రయం ఇవ్వడానికి

సిద్ధంగా ఉన్న కశ్మీరీలపైన గానీ, 'చొరబాటుదార్ల'పై గానీ రెచ్చిపోయి ఏమీ ప్రయోజనం లేదని అర్థం అవుతుంది. భారత ప్రభుత్వం, పత్రికలు ఈ 'చొరబాటుదారుల'ను కిరాయి గుంపులు అని అభివర్ణించడం జరుగుతుంటుంది కానీ వారు కిరాయి మూకలు కారు. పాన్ ఇస్లామిక్ ప్రాపంచిక దృక్పథం ఉన్న మత రాజకీయ మిలిటెంట్లు. ఆ దృక్పథం ఒక రకమైన ఉన్మాదం అనడంలో సందేహం ఏమీ లేదు. అయినప్పటికీ సిద్ధాంత విశ్వాసాల నుండి పుట్టిన మిలిటెన్సీని కేవలం సైనిక బల ప్రయోగంతో అంతమొందించడం అసాధ్యం. దాని సామాజిక పునాదిని దూరం చేయగలిగితేనే దానిని జయించడం సాధ్యమవుతుంది. అది సాధ్యంకాక బలప్రయోగాన్ని విపరీత పరిమాణంలో కొనసాగించడం దానికి పరిష్కారం అన్న తప్పుడు అభిప్రాయంతో సాగితే ఆ మిలిటెంట్లకు ఎంత హాని జరుగుతుందో ఏమో గానీ వారి సామాజిక పునాది అయిన జనానికి మాత్రం చాలా హాని జరుగుతుంది. ఆ సామాజిక పునాదిలోని జనం ఏదో ఒక వైమనస్యానికో, అసంతృప్తికో లోనయిన వారు. వారికి బలప్రయోగం ఎట్టి పరిస్థితిలోనూ జవాబు కారాదు.

కశ్మీరీలది నిజానికి చాలా విషాదకరమైన పరిస్థితి. ఇస్లామిక్ మతోన్మాదం ప్రభావం కశ్మీరీలపైన ఏమంత ఎక్కువ లేదు. 1946–47 సంవత్సరాలలో దేశమంతా మత ఘర్షణలతో అట్టుడికిపోతున్న తరుణంలో కూడా కశ్మీర్‌లో ఒక్క హిందువు తల వెంట్రుకను సైతం 95 శాతంగా ఉన్న ముస్లింలు ముట్టుకోలేదని గాంధీ ప్రశంసించాడు.

1989లో మిలిటెన్సీ మొదలయిన తరువాత కూడా స్వతంత్ర కశ్మీర్ లక్ష్యాన్ని వ్యతిరేకించిన వారిపైన – హిందువులపైన, ముస్లింలపైన కూడా – దాడులు జరిగాయే కానీ కశ్మీర్ మిలిటెన్సీ విదేశీ పాన్ ఇస్లామిక్ మిలిటెంట్ల చేతిలోకి పోయేదాకా హిందువులను కేవలం హిందువులుగా చంపిన ఘటనలు జరగనే లేదు. పాకిస్తాన్‌లో చేరాలన్న కోరిక కూడా కశ్మీర్‌లో మెజారిటీ అభిప్రాయం కాదు. అయినప్పటికీ ముస్లిం మత రాజకీయ మిలిటెంట్లయిన ఈ 'చొరబాటుదారుల'కు కశ్మీర్‌లో ఆశ్రయం ఎందుకు దొరుకుతుందంటే 'భారత్' మీద వేయడానికి ఏ రాయి అయితేనేం అన్న అభిప్రాయం కశ్మీరీలలో బలంగా ఉండడమే దానికి కారణం. అయితే ఈ రాయికీ, వాళ్ళకూ మధ్య ఉన్న ఎడం ఎంతటిదంటే నిర్దయగా బలప్రయోగం చేసే మతతత్వ వైఖరి, అత్యాధునిక ఆయుధ సంపద ఉన్న పాన్ ఇస్లామిక్ మిలిటెంట్లు సైతం ఈ పది సంవత్సరాలలో స్త్రీలెవ్వరూ బురఖాలు లేకుండా వీధిలోకి రాకూడదన్న తమ ఆదేశాన్ని కశ్మీర్‌లో అమలు చేయలేకపోయారు. ఒంటరిగా ఉన్నప్పుడు కశ్మీరీలు వీరి మూర్ఖత్వాన్ని గురించి విసుక్కుంటూ మాట్లాడతారు. కానీ భారత సైన్యం మీద యుద్ధం చేయడానికి సిద్ధంగా ఉన్న 'ముజాహిద్'లుగా మరొక పక్క వారిని గౌరవిస్తారు. ఆశ్రయం ఇస్తారు. అందువల్ల వచ్చే క్రూరమైన నిర్బంధాన్ని, సైన్యం చేతిలో చిత్రహింసలను కూడా భరిస్తారు.

గత పది సంవత్సరాలుగా కశ్మీర్‌లోని సైనిక అధికారులు చేసిన ప్రకటనలు చూస్తే ఏ రోజూ అక్కడ మిలిటెంట్లు మూడు నాలుగు వేల మంది కంటే ఎక్కువ లేరని అర్థం అవుతుంది. అందులో కశ్మీరీ మిలిటెంట్ల సంఖ్య కాలక్రమంలో తగ్గి 'చొరబాటుదార్ల' సంఖ్య పెరుగుతూ ఇప్పుడదే మెజారిటీగా ఉంది. ఈ మూడు నాలుగు వేల మందిని ఎదుర్కోవడానికి కశ్మీర్‌లో ఒక్కొక్క దశలో 3 లక్షల నుండి 5 లక్షల దాకా భారత సైన్యం మోహరించబడింది. అయినప్పటికీ మిలిటెన్సీ అణగారిపోలేదు. కశ్మీర్‌లోని మిలిటెంట్ల సంఖ్య ఏ దశలోనూ (భారత సైనిక అధికారుల లెక్కల ప్రకారమే) మూడు నాలుగు వేలు మించి లేకపోయినా ఇప్పటికే కశ్మీర్‌లో భారత సైన్యం చేతిలో చనిపోయిన వారి సంఖ్య ఎంత తక్కువనుకున్నా 20 వేలు ఉంటుంది. (కశ్మీరీ పోరాటకారులు 40 వేల మంది అమరులయ్యారంటారు.) అంటే ఎక్కువగా ఆ మిలిటెంట్ల సామాజిక పునాది అయిన సామాన్య కశ్మీరీలను చంపుతున్నారని అర్థం. అయినప్పటికీ మిలిటెన్సీ అణగారిపోలేదు.

ఇప్పుడు కార్గిల్ సరిహద్దు దాటిన 'చొరబాటుదారు' లందరినీ చంపి తీరాల్సిందేనని ఆవేశపడి ఏం ప్రయోజనం? వెనక్కి వెళ్ళిపోవడానికి సిద్ధంగా ఉన్న వాళ్ళను వెళ్ళిపోనిచ్చి ఈ ఉదంతానికి ముగింపు పలకాలన్న ప్రతిపాదన మీద (జార్జి ఫెర్నాండెజ్ లేక లేక చేసిన ఒక తెలివైన ప్రతిపాదన) అందరూ విరుచుకుపడడం ఎందుకు? ఇప్పుడు సరిహద్దు కొత్తగా దాటిన వాళ్ళందరినీ చంపేసినా చంపేయపోయినా కశ్మీర్ పరిస్థితిలో ఆవగింజతయినా తేడా రాదు. వాళ్ళందరినీ చంపేయాల్సిందేనన్న పట్టుదల పాకిస్తాన్‌తో యుద్ధానికి దారితీస్తే మాత్రం ఎవ్వరికీ మంచిది కాదు. మొదట్లో చెప్పినట్టు అణుబాంబులు ఇద్దరి దగ్గరా ఉన్న ప్రస్తుత పరిస్థితులలో గెలుపు ఓటములు ఉండవు. విధ్వంసం మాత్రమే ఉంటుంది.

మరి దీనికి అంతెప్పుడు? వాళ్ళు చొరబడడం, మనం బయటికి సాగనంపడం అనంతంగా జరుగుతూ ఉండవలసిందేనా? అని ఆవేశపడి ప్రయోజనం లేదు. కశ్మీర్ సమస్య మన పాలకుల స్వయంకృతం. ఆర్టికల్ 370ని నిజాయితీగా అమలుచేసి కశ్మీర్‌లో ప్రజాస్వామ్యాన్ని ఇతర రాష్ట్రాలలో గౌరవించిన మేరకయినా గౌరవించి ఉంటే కశ్మీర్ పరిస్థితి ఇక్కడి దాకా వచ్చేది కాదు. ఇప్పుడు జాతీయవాద ఉద్రేకంలో సులభ పరిష్కారం వెతుక్కుందామంటే దొరకదు. 1952 నాటి ఢిల్లీ ఒడంబడికను పునరుద్ధరించి ఆ తర్వాత కశ్మీర్ విషయంలో చేసిన శాసన సంబంధమైన మార్పులన్నింటినీ రద్దుచేసి కశ్మీర్ స్వయం ప్రతిపత్తిని ఒక రెండు మూడేళ్ళయినా గౌరవించి చూపిస్తే కశ్మీరీలు భారతదేశంలోనే ఉండడానికి సిద్ధపడతారేమో. అప్పటికీ సిద్ధపడకపోతే వారు స్వతంత్రంగా బతికే హక్కును గౌరవించడం న్యాయంగా ఉంటుంది. మనం తరచుగా గొప్పలు చెప్పుకునే అత్యున్నత నాగరికతా ప్రమాణాలకు తగినట్టుంటుంది.

ఇదంతా ఒకెత్తయితే కార్గిల్‌వాసులది మరీ దయనీయమైన స్థితి. కశ్మీర్ లోయ ప్రజల స్వతంత్రేచ్ఛతో కార్గిల్‌వాసులకు ఏమీ సంబంధం లేదు. 'చొరబాటుదారుల'కు పైన చెప్పిన కారణాల వల్ల కశ్మీర్ లోయలో ఆశ్రయం దొరుకుతుంది కానీ కార్గిల్‌లో దొరకదు. అత్యధికంగా షియా ముస్లింలయిన కార్గిల్‌వాసులకు ఈ సున్నీ మతవాద మిలిటెంట్లంటే ప్రేమ లేదు. సున్నీ ఇస్లాంను అధికార మతంగా కలిగిన పాకిస్తానంటే అసలే లేదు. అట్లాగని భారతదేశం పట్ల కూడా పెద్దగా అభిమానం లేదు. ఏ అభివృద్ధికీ నోచుకోకుండా విసిరివేయబడ్డట్లు ఎత్తయిన మంచు ఎడారిలో బతుకుతున్న ఆ ప్రజలకు మన ఆవేశం, పాకిస్తానీల ఆవేశం వికారంగా కనిపించక మానదు. ద్రాస్ పట్టణవాసులైతే ఆ ఊరిని ఖాళీచేసి వెళ్ళిపోయారు. కార్గిల్ పట్టణం దాదాపు మూడేళ్ళుగా పాకిస్తానీ తుపాకీగుండ్ల విధ్వంసాన్ని రుచి చూస్తున్నది. తాము షియాలు కాబట్టే పాకిస్తాన్ విచ్చలవిడిగా తుపాకీ గుండ్లు కురిపిస్తున్నదని ఒకవైపు, భారత ప్రభుత్వానికి కార్గిల్ కేవలం సియాచిన్‌కు దారి తీసే ఒక సరిహద్దు ప్రాంతమే తప్ప భారత పౌరులుండే ప్రాంతం కాదని మరొకవైపు కార్గిల్ ప్రజలు చేసే విమర్శ గత రెండేళ్ళుగా కశ్మీరీ పత్రికలలో క్రమం తప్పకుండా కనిపిస్తుంది.

'కశ్మీర్ సమస్య'లోని అతి ముఖ్యమైన సమస్య ఏమిటంటే అది కేవలం ఒక సరిహద్దు కాదని, అక్కడ మనుషులున్నారని వారికి భిన్న మనోభావాలు, దృక్పథాలు, కోరికలూ ఉన్నాయనీ ఇటు ఇండియాలో గానీ, అటు పాకిస్తాన్‌లో కానీ ఎవరూ గుర్తించక పోవడం. ఈ గుడ్డి దేశభక్తికి వారిని ఎన్ని రోజులింకా బలిపెడదాం?

# కార్గిల్‌కు ఒక కార్గిల్ కోణం ఉంది

ఎన్నడూ భారతదేశంలో వార్తలలో ఉండే 'అదృష్టం' ఎరుగని కార్గిల్‌వాసులకు ఈ మధ్య వార్తలన్నీ కార్గిల్ గురించే కావడం ఏ మాత్రం ఆనందం ఇస్తుందో గానీ చాలా కోపం, నిష్ఠూరం కలిగిస్తుందనడంలో అనుమానం లేదు.

జమ్మూ-కాశ్మీరు రాష్ట్రం గురించి మాట్లాడుకున్నా, ఆ పేరు సూచించే రెండు ప్రాంతాలే కాకుండా ఆ రాష్ట్రంలో లదాఖ్ అనే మూడవ ప్రాంతం ఉందని ఎవరికీ తోచదు. జమ్మూలో మామూలు మైదాన ప్రాంత నాగరికత ఉంది. హైందవ పుణ్యక్షేత్రమైన వైష్ణోదేవీ ఆలయం ఉంది. కశ్మీర్ సంగతి చెప్పనే అక్కరలేదు. సుందరమైన జీలం నదీలోయ, దేవదారు అడవులు, రకరకాల పళ్ళతోటలు, వరిచేలు, నిత్య రాజకీయ సంచలనం, గుల్మార్గ్, సోన్‌మార్గ్ వంటి పర్యాటక కేంద్రాలు, ఇప్పుడు పదేళ్ళుగా తీవ్రమైన మిలిటెన్సీ – కశ్మీర్ గురించి మాట్లాడుకోవడానికి చాలా ఉంది.

లదాఖ్ ఒక ఎత్తైన శీతల ఎడారి. చాలా భాగం నిర్మానుష్యంగా ఉంటుంది. అక్కడి అతి తక్కువ జనాభాలో సగభాగం బౌద్ధులు, సగభాగం షియా ముస్లింలు. ఇవి రెండూ భారతదేశంలో అప్రధానమైన మతశాఖలే. రాజకీయ సంచలనం సృష్టించడానికి కావలసిన సరంజామా ఏదీ లదాఖీల దగ్గర లేదు.

లదాఖ్ ఉత్తరార్థం కార్గిల్. శ్రీనగర్‌ను కార్గిల్‌కు కలిపే ఏకైక రహదారిని స్వాధీనపరచుకునే ఉద్దేశంతో పాకిస్తాన్ ప్రోత్సహిస్తున్న చొరబాటుదారులు సరిహద్దు దాటి ముందుకు చొచ్చుకు రావడంతో కార్గిల్ వార్తలకెక్కింది. ఆ రహదారి ఎక్కడ పాకిస్తాన్ వశమవుతుందోనని ఈ దేశంలో అందరూ ఆవేశపడుతున్నారు గానీ 50 ఏళ్ళ తరువాత కూడా కార్గిల్‌కు ఇంకొక రహదారి ఎందుకు లేదన్న ప్రశ్న ఎవరూ వేసుకోవడం లేదు. ఆ ఒక్క రహదారి కూడా సంవత్సరంలో ఆరు నెలలు మంచుతో కప్పుకుపోయి ఉంటుంది. పైపెచ్చు రహదారిలో చాలా భాగం ఇప్పటికీ తారురోడ్డు కూడా కాదు. కంకరరోడ్డు మీద ఎత్తైన జోజిలా కనుమ దాటి కార్గిల్‌వాసులు రాష్ట్ర రాజధాని అయిన శ్రీనగర్ చేరుకోవాలి.

---

ప్రజాతంత్ర వారపత్రిక, 27-06-1999

నిజానికి లదాఖ్ వాసులెవరూ ఆ రాష్ట్రంలోని ఇతర ప్రాంతాలలో ఎక్కడా కనిపించరు. జమ్మూ కశ్మీర్ ప్రాంతీయులు మాత్రం లదాఖ్‌లో ఉద్యోగాలు, వ్యాపారాలు చేసుకుంటూ కనిపిస్తారు. లదాఖీలు తమ ప్రాంతంలో పశువులు మేపుకుంటూ, సారవిహీనమైన నేలలలో వేసవికాలంలో ఒక కారు బార్లీ పండించుకుంటూ, అప్పుడప్పుడొచ్చే విదేశీ పర్యాటకులకు తమ సేవలు అమ్ముకొంటూ బతుకుతుంటారు. ఈ దేశం వాళ్ళ గురించి ఎప్పుడూ ఆలోచించదు. వాళ్ళూ ఈ దేశాన్ని గురించి ఎప్పుడూ ఆలోచించరు. వాళ్ళకు చారిత్రకంగా భారత్ అనే ఈ దేశంతో ఉన్న సంబంధం తక్కువ. సాంస్కృతికంగానూ తక్కువ. పోనీ ఈ యాభై ఏళ్ళలో భారత్‌లో ఉన్న పుణ్యాన ఏమైనా అభివృద్ధి పొందారా అంటే అది అంతకంటే తక్కువ. కార్గిల్ భారత భూభాగమంటూ పాకిస్తానీ చొరబాటుదార్ల మీద మనమంతా ఆవేశపడిపోతున్నాం గానీ ఆ భూభాగానికి చెందిన కార్గిల్‌వాసులు 'ఇది భారత భూభాగం' అంటూ ఏ రోజూ పెద్దగా ఆవేశపడలేదు. ఈ రోజు వాళ్ళు విజయానికీ వీరస్వర్గానికీ ఉవ్విళ్ళూరడం లేదు. ఎప్పుడూ ఎవరికీ అక్కరలేని కార్గిల్ ఇప్పుడు సరిహద్దు కోసం అక్కరకొచ్చిందా అని విసుక్కుంటున్నారేమో కూడా. దాదాపు నాలుగేళ్ళుగా నిత్యగండంగా బతుకుతున్న తమ జీవితాలలో శాంతి ఎప్పుడు నెలకొంటుందా అన్న ఎదురుచూపు తప్ప వేరే ఏ అనుభూతీ వారిలో ఉంటుందని నమ్మడం కష్టం.

కార్గిల్ సరిహద్దు మీద పాకిస్తానీల కన్ను పడి నాలుగేళ్ళయింది. 1995లో మొట్టమొదటిసారి కార్గిల్ పట్టణం మీద పాకిస్తానీ తుపాకీగుళ్ళ వర్షం కురిసింది. సరిహద్దు దగ్గర కొంత ఘర్షణ రేపి మిలిటెంట్లను ఆ సందడిలో సరిహద్దు దాటించడం పాకిస్తాన్ చాలాకాలంగా అనుసరిస్తున్న వ్యూహమే. ఆ మిలిటెంట్లు పాల్గొనడానికి కాశ్మీరు లోయలో ఒక పోరాటం ఉన్నంత కాలం, ఆ పోరాటం వెనక ఉన్న కశ్మీరీ ఆకాంక్షకు మన పాలకుల దగ్గర జవాబు లేనంత కాలం, ఆ మిలిటెంట్లనూ వారిని ప్రోత్సహించే పాకిస్తాన్‌నూ తిట్టుకొని ప్రయోజనం లేదు.

కానీ ఈ వ్యూహానికి కార్గిల్ అనువయిన సరిహద్దుగా పాకిస్తాన్ చాలాకాలం భావించలేదు. ఎందుకంటే పాకిస్తాన్ ప్రోత్సాహంతో కశ్మీరీ పోరాటంలోకి చొరబడుతున్న హర్కత్–ఉల్–అన్సార్ మిలిటెంట్లు సున్నీ ముస్లింలు. కార్గిల్ వాసులు అత్యధికంగా షియా ముస్లింలు. కార్గిల్‌పైన పాకిస్తాన్ గుండ్ల వర్షం కురిపించడం మొదలుపెట్టినప్పుడు కార్గిల్ వాసులు ఈ తేడానే ఎత్తి చూపారు. తాము షియాలు కాబట్టే పాకిస్తాన్ తమ ప్రాణాలను లెక్కచేయకుండా తుపాకీ గుళ్ళు కురిపిస్తున్నదని విమర్శించారు.

అటువంటి కార్గిల్‌ను పాకిస్తాన్ ఇప్పుడు మిలిటెంట్లను సరిహద్దు దాటించడానికి అనువైన ప్రాంతంగా ఎంచుకుందంటే దానికి కారణం ఉందనే వాళ్ళు లేకపోలేదు.

ఆర్థికంగా మధ్యఆసియా ఆ దేశాలతో సత్సంబంధాలు కోరుకుంటున్న పాకిస్తాన్, ఆ దేశాలు అత్యధికంగా షియా శాఖకు చెందినవని గుర్తించి కార్గిల్‌వాసులను దువ్వుతున్నదన్న అభిప్రాయం ఉంది. కార్గిల్ ముస్లింలు షియా శాఖకు చెందినవారే అయినప్పటికీ షియాలలో నూర్‌బక్షియా ఉపశాఖకు చెందినవారనీ, ఈ ఉప శాఖ సున్నీలకు కొంత సన్నిహితమనీ, అందువల్ల వారిలో తనకు ఒక పునాదిని ఏర్పరచుకోవడం అసాధ్యం కాదన్న అభిప్రాయానికి పాకిస్తాన్ వచ్చిందనీ అంటున్నారు.

మొత్తానికి భారత–పాకిస్తాన్‌ల 'కశ్మీర్ వివాదం' ఇక కార్గిల్‌కు వ్యాపించే సూచనలు మెండుగా కనిపిస్తున్నాయి. ఇన్నాళ్ళూ కార్గిల్ భారతదేశానికి సియాచిన్‌కు పోయే దారిలో ఒక స్థావరం. పాకిస్తాన్‌కు సానుభూతి దొరకని పరాయి ప్రదేశం. మారిన పరిస్థితులలో కార్గిల్ భారత్‌లో దేశసమగ్రతకూ సమైక్యతకూ దేశభక్తికీ సంకేతం అయింది. పాకిస్తాన్‌కు తన యాభై ఏళ్ళ వ్యూహాన్ని కొనసాగించడానికి ఒక కొత్త సింహద్వారమయింది. ఇన్నాళ్ళూ ఇరుదేశాలకూ అక్కరలేని కార్గిల్ ఇప్పుడీ విధంగా అకస్మాత్తుగా అక్కరకొచ్చింది.

భారత–పాకిస్తాన్‌ల 'కశ్మీర్ వివాదం' ఆధునిక చరిత్రలోని అతి వికృతమైన వివాదాలలో ఒకటి. ఇది మనుషులతో సంబంధం లేని భూవివాదం. అక్కడ బతికే మనుషుల మనోభావాలతో నిమిత్తం లేని గట్టు తగాదా. ఈ గట్టు తగాదా చుట్టూ రెండు దేశాలలోనూ అల్లుకున్న విపరీత దేశభక్తి ఆ గట్టు దగ్గర బతికే కశ్మీరీలకూ, ఇప్పుడు కార్గిల్ వాసులకూ హాస్యాస్పదంగా కనిపించక మానదు. అయితే అందులో హాస్యమేమీ లేదు. అది వారి ప్రాణాలనూ స్వేచ్ఛనూ పణంగా పెట్టి నడుపుతున్న ప్రహసనం. వాస్తవాధీన రేఖ ఇక్కడుందా అక్కడుందా అని వెతుక్కుంటున్న భారత–పాకిస్తాన్‌లకు ఆ రేఖకు అటూ ఇటూ జీవిస్తున్న రక్తబంధువులు, 'ఇక్కడసలు రేఖ ఎవడు గీయమన్నాడు' అని ఎదురు ప్రశ్న వేసే పరిస్థితి ఈ రోజు లేకపోవచ్చును గానీ, ఆ ప్రశ్నను ఈ రెండు దేశాలలోని ఉగ్రదేశభక్తులు తమకు తాము వేసుకోగలిగితే అందరికీ మంచిది.

# కశ్మీర్‌లో 'చెల్లని వోట్లు' దేనికి సూచన?

ఈ ప్రశ్న ఆశ్చర్యం, కోపం కూడా కలిగించవచ్చు.

సరిహద్దు దగ్గర అప్పట్లో మోహరించిన చొరబాటుదార్లందరినీ మన సైన్యం తరిమేయలేదా?

తరిమేసింది.

ఇంకొకసారి అటువంటి పొరపాటు జరగకుండా లదాఖ్ సరిహద్దు యావత్తు ఇక మీద పహారా పెట్టబోవడం లేదా?

పెట్టబోతున్నామని జార్జి ఫెర్నాండెజ్ అన్నాడు. అది అబద్ధం అనుకోవలసిన అవసరమేమీ లేదు.

ప్రపంచంలోని పెద్ద దేశాలు మొట్టమొదటిసారిగా పాకిస్తాన్‌ను తప్పుపట్టి బాహాటంగా విమర్శించలేదా? అది భారత్‌కు రాజకీయ విజయం కాదా?

కావచ్చు.

అయినప్పటికీ కార్గిల్ యుద్ధంలో నవాజ్ షరీఫ్ గెలిచాడని నేను వాదించదలిచాను.

కశ్మీర్‌పైన భారత రాజ్యం పట్టు మరింత బిగించుకోవడం మన విదేశాంగ నీతికి కేంద్ర బిందువుగా ఉంది. ఈ రోజే కాదు, యాభై ఏళ్ళుగా ఉంది.

ఆ పట్టును వీలయినంత సడలించడం పాకిస్తాన్ విదేశాంగ నీతికి కేంద్ర బిందువుగా ఉంది. యాభై ఏళ్ళుగానూ ఉంది.

కార్గిల్ యుద్ధం అనంతరం కశ్మీర్‌పైన భారత్ పట్టు మరింత సడలిందని చాలా సంఘటనలు తెలియజేస్తున్నాయి.

ఒకటి, కశ్మీర్‌లో మిలిటెంట్ల సంఖ్య పెరిగింది. వారి వల్ల జరిగే హింసాత్మక సంఘటనల సంఖ్య కూడా పెరిగింది. కార్గిల్ సరిహద్దు దాటుతున్న చొరబాటుదార్లను ఎదుర్కొనడానికి కశ్మీర్ లోయలో ఉన్న సైన్యం కార్గిల్‌కు పోయేసరికి లోయలోకి చొరబడే అవకాశం పెరిగింది. ముజఫరాబాద్ వైపు నుండి బారాముల్లా, కుప్వారా జిల్లాలలోనికీ పూంచ్ నుండి దోడా జిల్లాలోనికీ ఆ రోజులలో పెద్ద సంఖ్యలోనే చొరబాటుదార్లు

---

ఆంధ్రప్రభ దినపత్రిక, 14-10-1999

ప్రవేశించారు. ఈ చొరబాటు దాదాపు పది సంవత్సరాలుగా నిరవధికంగా జరుగుతున్నదే. ఇప్పుడు మరింత ఎక్కువగా జరిగింది. కార్గిల్ చొరబాటుదార్లను భారత సైన్యం విజయవంతంగా వెనక్కి నెట్టేసింది. కానీ ఆ అదను చూసుకుని కశ్మీర్‌లోకి ప్రవేశించిన వారు ఇక్కడే ఉండిపోయారు.

దీని ఫలితమొకటి త్వరలోనే కనిపించింది. కశ్మీర్ లోయలోను, జమ్మూ ప్రాంతం లోని దోడా జిల్లాలోను హింసాత్మక సంఘటనల సంఖ్య పెరిగింది.

అయితే ఇది అంత ముఖ్యం కాదు. ఆయుధాలు, హింసాత్మక సంఘటనలు మన దృష్టిని త్వరగా ఆకర్షిస్తాయి కానీ అవి నిజమైన మార్పుకు పరోక్షమైన సూచిక మాత్రమే.

ప్రత్యక్షమైన సూచిక నిన్నటి ఎన్నికలలో లభించింది. 1987 తరువాత కశ్మీర్‌లో మొట్టమొదటిసారి 1996లో ఎన్నికలు జరిపారు.

ఆ ఎన్నికలు రాష్ట్ర అసెంబ్లీకి జరిగాయి. సైనికులు, ప్రభుత్వ అనుకూల ('సర్కారీ') మిలిటెంట్లు జనాన్ని తుపాకులతో పొడుచుకుంటూ తీసుకొచ్చి వోట్లు వేయించిన ఘటనలనేకం జరిగాయి. పరిశీలకులందరూ కళ్ళారా అటువంటి సంఘటనలు చూశారు. అయినప్పటికీ గ్రామీణ ప్రాంతాలలో కొంత పోలింగ్ జరిగింది. కానీ కశ్మీర్ జాతీయ వాదానికి కేంద్రమయిన శ్రీనగర్ పట్టణంలో అతి తక్కువగా జరిగింది.

ఆ తరువాత జరిగిన పార్లమెంట్ ఎన్నికలలో కొంచెం తక్కువ హింసతోనే ఇంకొంచెం ఎక్కువ వోట్లు వేయించగలిగింది కశ్మీర్‌లో భారత సైన్యం. నెమ్మదిగా కశ్మీరీలు భారత్ ప్రభావంలోకి తిరిగి వస్తున్నారంటూ అప్పట్లో పెద్దలంతా తమ భుజాలు తామే చరచుకున్నారు. కశ్మీరీ వేర్పాటువాదం ఇంక ముగిసినట్టేనని పత్రికలు గంభీరంగా సంపాదకీయాలు రాశాయి.

కానీ నిన్నటి ఎన్నికలలో పరిస్థితి మళ్ళీ వెనక్కి పోయినట్టు కనిపిస్తుంది. ప్రజలచేత వోట్లు వేయించడానికి సైన్యం, సర్కారీ మిలిటెంట్లు చాలా నిర్లజ్జగా బలప్రయోగానికి పాల్పడ్డారంటూ పత్రికలు రాశాయి. అయినప్పటికీ ఎక్కువమంది వోట్లు వేయలేదు. పోలింగ్ బూత్‌లోకి ప్రవేశించి చేతికి సిరా చుక్క పెట్టించుకున్న వారి సంఖ్యను వోట్ల సంఖ్యగా పోలింగ్ దినంనాడు ప్రకటించారు. అదే తక్కువ అయితే వోట్ల లెక్కింపు రోజున డబ్బాలు తీస్తే అందులో ఉన్న వోట్లు ఇంకా తక్కువ. చాలామంది వోటర్లు సైన్యానికి చూపించడానికి వేలికి ఇంకు చుక్క పెట్టించుకున్నారు కానీ వోటు ఎవరికీ వేయలేదు. వారి ఉద్దేశం గ్రహించిన పోలింగ్ అధికారులు వారికి బ్యాలెట్ పేపర్ ఇవ్వకుండా వేలికి చుక్క మాత్రం పెట్టి పంపించిన ఉదంతాలనేకం జరిగాయి. ఆ అధికారులు కూడా కశ్మీరీలే కదా!

డబ్బాలలో పడిన వోట్లలో కూడా చెల్లనివి చాలా ఎక్కువ ఉన్నాయి. మామూలుగా మన దేశంలో చెల్లని వోట్లు సగటున రెండు శాతం మించవు. కశ్మీర్‌లో ఈ సారి అనేకచోట్ల

పది శాతం దాటాయి. అంటే కావాలని చెల్లకుండా చేయడం జరిగిందని అర్థం. అనంతనాగ్ పార్లమెంట్ నియోజకవర్గంలోని అనేక గ్రామాలలో గెలిచిన అభ్యర్థి కంటే 'ఇన్‌వాలిడ్' అభ్యర్థికి ఎక్కువ వోట్లు వచ్చాయని కశ్మీర్ పత్రికలు వ్యంగ్యంగా రాశాయి!

ఏదో ఒక రకంగా వీలయినన్ని వోట్లు వేయించి బయటి ప్రపంచానికి చూపించాలని భారత సైన్యం పడిన తాపత్రయాన్నీ, అది అనుసరించిన బలప్రయోగ పద్ధతులనూ కశ్మీరీ పత్రికలు చాలా కటువుగా విమర్శించాయి. అవి వేర్పాటువాద పత్రికలు కావు. పోనీ కశ్మీరీ ముస్లింలు నిర్వహించే పత్రికలూ కావు. 'జన జీవన స్రవంతి'లోని సాధారణ దిన పత్రికలే. హిందువులు నిర్వహించే పత్రికలే. కశ్మీరీ పత్రికలే కాదు, జాతీయ పత్రికలు అని పిలవబడే ప్రధాన ఆంగ్ల దినపత్రికల రిపోర్టర్లు సహితం చాలా విమర్శనాత్మకంగా రాశారు. ఇంత బాహాటంగా అందరూ విమర్శించినా ఎన్నికల కమిషన్ జోక్యం చేసుకోక పోవడం కూడా వ్యాఖ్యకు గురయింది. దేశమంతటా ఎన్నికల నియమాల గురించి చాలా పట్టుదలగా ఉన్నట్టు కనిపించే ఎన్నికల కమిషన్, కశ్మీర్‌లో ఎన్నికల ప్రక్రియ ఎంత వికృత రూపం తీసుకున్నా పట్టించుకోకపోవడంతో ఈ నాటకంలో ఎన్నికల కమిషన్ కూడా భాగమేనని కశ్మీరీ పత్రికలన్నీ వ్యాఖ్యానించాయి.

ఇంతచేసినా వోట్లు మాత్రం గత పార్లమెంట్ ఎన్నికలప్పటి కంటే తక్కువ పడ్డాయి. కార్గిల్ తరువాత కశ్మీరీలు భారత్‌కు మరింత దూరం అయ్యారనడానికి ఇదొక నిదర్శనం మాత్రమే. కశ్మీరీల ఆలోచనలతో పరిచయం ఉన్నవారికి ఈ పరిణామం పెద్దగా ఆశ్చర్యం కలిగించదు. కశ్మీరీలు 1996 తరువాత భారత్‌కు దగ్గరయ్యారనేది వట్టి భ్రమ. వారు అప్పుడప్పుడు పాకిస్తాన్ మీద ఆశలు పెంచుకుంటూ ఉంటారు. అప్పుడప్పుడు నిస్పృహ చెందుతుంటారు. కార్గిల్ తరువాత – పాకిస్తాన్ ప్రయత్నం విఫలం అయినప్పటికీ – ఆశ కొంచెం పెరిగింది. అది భారత్‌కు దూరం కావడంగా మనకు కనిపిస్తుంది. భారత్‌కు సగటు కశ్మీరీ ఎప్పుడూ దూరమే.

1989లో కశ్మీర్‌లో మిలిటెన్సీ మొదలయినప్పుడు 'మీరు లోయలో భారత సైన్యాన్ని ఇబ్బంది పెడుతుండండి. మేము సరిహద్దు ప్రాంతాలలో యుద్ధం ప్రకటించి కాగల కార్యం పూర్తిచేస్తాం' అని పాకిస్తాన్ హామీ ఇచ్చిన సంగతి కశ్మీర్‌లో బహిరంగ రహస్యమే. పాపం కశ్మీరీలు ఆ మాటల్ని నమ్మి పోరాటం చేసి ప్రాణాలు పోగొట్టుకున్నారు గానీ పాకిస్తాన్ తన మాట నిలబెట్టుకునే సాహసం చేయలేకపోయింది. 1997 నాటికి 'పాకిస్తాన్ మమ్మల్ని మోసం చేసింది' అని కశ్మీరీలు బాహాటంగానే అనసాగారు. కానీ మన పాలకులు అణుబాంబు పేల్చి పాకిస్తాన్ చేతిలోనూ అణుబాంబు పెట్టి అప్పటిదాకా లేని ధైర్యం పాకిస్తాన్‌కు ఇచ్చారు. కార్గిల్ యుద్ధం పాకిస్తాన్ నమ్మకద్రోహం ఫలితం కాదు. మన హిందూత్వవాద పాలకుల అణ్వస్త్ర చాపల్యం ఫలితం. అణుబాంబు చేతిలో ఉంటే దేశం

చిన్నదైనా పెద్దదైనా ఒకటే. సంప్రదాయక యుద్ధంలో సమ ఉజ్జీ అయినా కాకపోయినా ఒకటే. ఆ ధైర్యం మనం ఇచ్చిన తరువాతే పాకిస్తాన్ కార్గిల్ ఎత్తుగడ వేయగలిగింది.

దీనితో కశ్మీరీలలో మళ్ళీ ఆశ చిగురించింది. కార్గిల్ యుద్ధం జరుగుతున్నంత కాలం దేశమంతా చొరబాటుదార్లను నిందిస్తూ సైన్యాన్ని ప్రోత్సహిస్తూ ఉంటే కశ్మీర్‌లో 'తాడో పేడో ఈ దెబ్బకు తేలిపోతుంది' అన్న ఆందోళనతో కూడిన ఉత్సాహమే ఎక్కువ ఉండింది. చొరబాటుదార్లను ముజాహిదీన్‌లుగా ఆహ్వానిస్తూ భారత సైన్యాన్ని నిందిస్తూ ఊరేగింపులు తీశారు.

ఇదంతా మనకు దేశద్రోహంగా కనిపించవచ్చు. చాలామందికి కనిపిస్తుంది కూడా. కశ్మీరీలను అడిగితే 'ఏ దేశం? ఎవరికి ద్రోహం?' అని ఎదురు ప్రశ్న వేస్తారు. లక్షలాది మందిని మనం దేశద్రోహులుగా భావిస్తున్నామంటేనే దేశానికీ ద్రోహానికీ మనమిస్తున్న నిర్వచనంలోనే ఏదో ఒక లోపం ఉందని గుర్తించాలి.

కశ్మీరీలలో వేర్పాటువాదం మళ్ళీ కొంత బలపడడానికి తూర్పు తైమూర్ కూడా ఒక కారణం. ఒక పెద్ద దేశంలో ఒక మూలనున్న చిన్న జాతి అంతర్జాతీయ సహకారంతో తన స్వతంత్ర అస్తిత్వాన్ని తాను సాధించుకోగలిగిందని గుర్తించి అదే కశ్మీర్ విషయంలోనూ ఎందుకు జరగకూడదని వారు తర్కించుకున్నారు. ఇదేదో కశ్మీరీ రాజకీయవేత్తల ఆలోచన మాత్రమేననుకుంటే పొరపాటవుతుంది. కశ్మీరీల ప్రత్యేక పరిస్థితి వల్లనో ఏమోగానీ కశ్మీరీలలో రాజకీయ చర్చ, పరిజ్ఞానం ఇతర ప్రాంతాల కంటే ఎక్కువ.

అందువల్లనే పాకిస్తాన్ మాయమాటలు నమ్మి కశ్మీరీలు మోసపోతున్నారని జాలి చూపించడం కూడా (మన పత్రికలలో ఈ రకమైన వ్యాఖ్యలు కనిపిస్తుంటాయి) వాస్తవ దూరమే. పాకిస్తాన్‌కు ఏం కావాలో, తమకేం కావాలో కశ్మీరీలకు బాగానే తెలుసును. ఈ విషయం ప్రతి ఊరిలో, ప్రతి గల్లీలో, ప్రతి ఇంట్లో వందలసార్లు చర్చకు వచ్చే ఉంటుంది. కశ్మీరీలలో అధిక భాగానికి పాకిస్తాన్‌తో కలవాలన్న కోరిక పెద్దగా లేదు. అయితే భారత్ మీద వేయడానికి ఒక బండరాయిగా పాకిస్తాన్ పనికొస్తుందన్న గుర్తింపు మాత్రం ఉంది. ఆ సాధనాన్ని ఎవరేమి చెప్పినా వాళ్ళు వదులుకోరు.

పాకిస్తాన్‌లో కలవాలనుకునేవాళ్ళూ లేకపోలేదు. వీరు అధికంగా ఇస్లామిక్ మత వాదులు. పాకిస్తాన్ వీరికిచ్చే మద్దతు వల్ల వీరు బలంగా కనిపిస్తారు గానీ కశ్మీరీ ప్రజల జీవితంపైన, ఆలోచనలపైన వీరి ప్రభావం తక్కువే. కశ్మీరీ సామాజిక జీవిత నుడికారంలో లౌకికతే ప్రధానంగా ధ్వనిస్తుంది. నిజానికి ఆ కారణంగానే కశ్మీరీలు పాకిస్తాన్‌ను ఇష్టపడరనీ, వారిని భారత్‌లోనే ఉంచుకోవచ్చుననీ మన పాలకులు భావించారు. అయితే కశ్మీరీ ప్రజాజీవిత సంస్కృతిలోని ఏ లౌకికతత్వాన్నయితే మన పాలకులు వాడుకోవాలనుకున్నారో దానినెన్నడూ గౌరవించలేదు. కశ్మీరీలకు రాజకీయ స్వేచ్ఛ –

సాధారణ ప్రజాస్వామిక హక్కులు సహితం – ఇస్తే పాకిస్తాన్ ప్రభావం పెరిగిపోతుందని చెప్పి ఆ రాష్ట్రంలో కనీస ప్రజాస్వామ్యం లేకుండా చేశారు.

ఇప్పుడు పరిస్థితి ఇక్కడి దాకా వచ్చింది. కశ్మీరీ మిలిటెంట్లతో సహా ప్రతి ఒక్కరితోనూ చర్చించడం తప్ప ఈ పరిస్థితికి వేరే పరిష్కారం లేదని మన పాలకులు గుర్తించగలిగిన నాడు ఏమైనా పరిష్కారం దొరకవచ్చు. కానీ కశ్మీరీ సమస్య అనేదొకటి నిజంగా ఉందని గుర్తించడానికి సహితం ఇష్టపడని వారు – అది కేవలం పాకిస్తాన్ సృష్టి అని నమ్మేవారు – మనల్ని ఏలుతున్నారు. ఇంకొక అయిదు సంవత్సరాలు ఏలే లైసెన్స్ పొందారు. వారి వైఖరిలో మార్పు రాకపోతే కశ్మీరీలు ఇంకెంత హింసను చూడవలసి ఉందో!

# ఖందహార్ మ్యూజింగ్స్...

సాయుధ పోరాటాల నేపథ్యంలోంచి హక్కుల గురించి మాట్లాడడంలో రెండువైపులా ఇబ్బందులున్నాయి. ఖందహార్ హైజాక్ ఘటన కొత్త సంవత్సరం ముందు రాత్రి ప్రశాంతంగానే ముగిసింది గానీ, అది జరుగుతున్నంత కాలం హైజాకర్ల మీద దుమ్మెత్తి పోయడం తప్ప వేరే ఏ వ్యాఖ్యకూ సభ్య సమాజంలో చోటులేదు.

'వాళ్ళు నూట ఎనభైమందిని చెరబట్టి చంపుతామంటుంటే నువ్వు దాని వెనుక వున్న సామాజిక రాజకీయ నేపథ్యాన్ని గురించి హేతుబద్ధంగా ఆలోచించాలంటావా' అని విరుచుకుపడడం ఏకైక దేశభక్తియుతమైన వైఖరిగా చలామణి అయింది.

నిజమే. వాళ్ళ డిమాండ్లలోని తప్పొప్పులు ఎట్లాగున్నా వాటికి ఏ రకంగానూ బాధ్యులు కాని విమాన ప్రయాణీకులను, సిబ్బందిని పట్టుకొని 'మా కోరిక తీర్చకుంటే వీరినందరినీ చంపుతాం' అని బెదిరించడం, తమది ఆషామాషీ బెదిరింపు కాదని రుజువు చేయడానికి కేవలం తల ఎత్తిన పాపానికి ఒక ప్రయాణీకుడిని చంపడం అభిశంసనీయమైన ప్రవర్తనే.

కానీ అక్కడితో ఆపేద్దామంటే న్యాయం కాదు. న్యాయాన్యాయాల దాకా ఎందుకు, అక్కడితో ఆగిపోయే ఆలోచన హైజాకింగ్ సమస్యకు ఆచరణాత్మకమైన పరిష్కారాన్ని కూడా ఇవ్వజాలదు. కానీ మన ఆలోచనలు ఆచరణాత్మకమైన పరిష్కారాల దగ్గర ఆగి పోవడానికి కూడా వీలు లేదు. న్యాయాన్యాయాల వివేచన చేయాలి, ఆ ప్రాతిపదికన పరిష్కారాలు ఆలోచించాలి.

ఇప్పుడు విడుదలయిన ముగ్గురు మిలిటెంట్లలో ఇద్దరు 5 సంవత్సరాలుగాను, ఒకరు 6 సంవత్సరాలుగాను జైలులో ఉన్నారు. వాళ్ళమీద ఉన్న ఏ ఒక్క అభియోగం లోనూ విచారణ పూర్తి కాలేదు, శిక్ష పడలేదు. కేవలం రిమాండులో జైలులో ఉన్నారు. బహుశా, జమ్మూకశ్మీర్‌కు ప్రత్యేకమైన పబ్లిక్ సేఫ్టీ ఆక్ట్ (పి.ఎస్.ఎ) అనే 'నాసా' వంటి ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టం కూడా వారిపైన ప్రయోగించి ఉండవచ్చు.

ఈ ముగ్గురే కాదు, కశ్మీర్‌లో వేలాదిమంది ఈ రకంగా ఏ విచారణా లేకుండా సంవత్సరాల తరబడి జైలులో గడుపుతున్నారు. విచారణ వేగంగా జరిపి వారి నేరాన్ని

---

ఆంధ్రప్రభ దినపత్రిక, 6-1-2000

రుజువు చేయాలన్న ఆరాటం జమ్మూకశ్మీర్ పాలకులు ఏ రోజూ ప్రదర్శించలేదు. చంపగలిగితే చంపేయడం, లేకపోతే తీవ్ర అభియోగాలు మోపి దీర్ఘకాలం జైలులో ఉంచడం వాళ్ళు ఒక దశాబ్ద కాలంగా అనుసరిస్తున్న పద్ధతి. మొన్నటి 5వ తేదీన ఆ రాష్ట్ర ప్రభుత్వం విడుదల చేసిన గణాంకాల ప్రకారం (నిన్న విడుదలయిన ముగ్గురిని కలుపుకొని) 398 మంది ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాల కింద గానీ టాడా కింద గానీ చాలా ఏళ్ళుగా జైలులో ఉన్నారు.

అయినప్పటికీ వీళ్ళు అదృష్టవంతులనే అనవచ్చు. ఎందుకంటే కశ్మీర్‌లో భద్రతా సిబ్బంది చేతికి చిక్కిన 'మిలిటెంట్ల'ను జైలుకు పంపడం అరుదు. అధికార గణాంకాల ప్రకారమే 1990 నుండి ఈనాటి దాకా భద్రతా సిబ్బంది చేతిలో 14 వేలమంది మిలిటెంట్లు, పౌరులు చనిపోయారు. అనధికార లెక్కల ప్రకారం ఈ సంఖ్య 50 వేల దాకా ఉంటుంది. మిలిటెంట్లు ఎదురు కాల్పులలో చనిపోయినట్టు, పౌరులు రెండు వైపులా జరిగిన కాల్పులలో ఇరుక్కొని చనిపోయినట్టు కశ్మీర్ పాలకులు అంటారు. కానీ ఆంధ్రప్రదేశ్‌లోలాగే కశ్మీర్‌లో కూడా 'ఎన్‌కౌంటర్' అంటే పట్టుకొనిపోయి చంపడం, లేకపోతే అన్నం తింటున్నప్పుడో, నిద్రపోతున్నప్పుడో చుట్టుముట్టి చంపడం. ఈ 14 వేలమందిలో అత్యధిక భాగం ఆ విధంగా చనిపోయినవారే.

చంపదలచుకోనప్పుడు తీవ్రమైన అభియోగాలు పెట్టి, టాడా ఉన్న రోజులలో అయితే టాడా కేసుపెట్టి, టాడా ఉన్నా లేకున్నా 'పాకిస్తాన్ నుండి ఆయుధాలు తెచ్చుకొని భారత ప్రభుత్వాన్ని కూలదోయడానికి యుద్ధం చేస్తున్నారు' అని కేసుపెట్టి జైలులో పడేస్తారు. అటువంటి కేసులలో బెయిలు ఇచ్చే కోర్టు కశ్మీర్‌లోనే కాదు, ఎక్కడా లేదు గానీ ఒకవేళ బెయిలు వస్తుందనుకుంటే ప్రివెంటివ్ డిటెన్షన్ వారంట్ జారీచేసి సురక్షితంగా జైలులోనే ఉంచుతారు. 15 వేలమంది పైన ఇటువంటి కేసులు పెట్టారని ప్రభుత్వ గణాంకాలే చెప్తాయి. అయిదేళ్ళో, ఆరేళ్ళో గడిచిన తరువాత ప్రభుత్వమే వారిని విడిచిపెట్టాలి తప్ప వారు సాధారణ పరిస్థితులలో బయటికి రారు. ఈ నేరాలలో విచారణ, సాక్ష్యాలు, తీర్పు, అప్పీలు అనే తతంగమెప్పుడూ జరగదు. రిమాండు ఖైదీలుగానో డిటెన్యూలుగానో కొన్ని సంవత్సరాలు గడిపి ప్రభుత్వం వదిలి పెట్టాలనుకున్నప్పుడు మాత్రమే వాళ్ళు బయటకు రాగలరు. ఆ దయ కూడా చూపించడం అనవసరం అని ప్రభుత్వం భావించిన 'కరుడుగట్టిన' మిలిటెంట్లు అయితే ఎన్నటికీ బయటికి పోరు.

ఏ నేరమూ రుజువు కాకుండా ఏళ్ళ తరబడి బందీలుగా ఉంచడం ప్రాథమిక ప్రజాస్వామ్య సూత్రాలకూ భారత రాజ్యాంగానికీ వ్యతిరేకం. అయినా ఇది ఒక దశాబ్ద కాలంగా కశ్మీర్‌లో అమలవుతూనే ఉంది. ఆ బందీలలో మరీ 'కరుడుగట్టిన' వారైతే జీవిత ఖైదీలే. వాళ్ళను ఈ అక్రమమైన నిర్బంధం నుండి విడిపించుకోవడానికి కిడ్నాప్‌లూ, హైజాక్‌లూ తప్ప వేరే మార్గం లేదని వారి మిత్రులనుకున్నారంటే ఆశ్చర్యమేముంది?

ఈ మాటలు అనడంలో రెండురకాల ఇబ్బందులున్నాయి. ఏదో ఒక సమస్య పేరు చెప్పి దౌర్జన్యం చేసేవారిని వెనకేసుకొస్తున్నామని ఒకవైపు నిందించే వాళ్ళుంటారు. నిజానికి హక్కుల ఉద్యమం మీద ఈ నింద ఎప్పుడూ ఉండేదే. మన నిత్యజీవిత భద్రతను భగ్నంచేసే వారికి ఆ పనిచేయడానికి ఏవో కారణాలున్నాయని వివరించడం మనకు చాలా విసుగు, కోపం తెప్పిస్తాయి. 'నిత్యజీవిత భద్రత' అనే దాంట్లోనే అసమానత, అన్యాయం, వివక్ష ఉన్నప్పుడు అది అప్పుడప్పుడు భగ్నంకాక తప్పదనీ, ఆ ప్రయత్నాలను కొంచెం సానుభూతితో అర్థం చేసుకోవాలనీ చెప్తే రుచించకపోవచ్చును గానీ చెప్పక తప్పదు.

అవతలివైపు తమ పోరాటం న్యాయమైన సమస్యల నుండి పుట్టిందని గుర్తించిన తరువాత తాము ఏం చేసినా అది న్యాయమేనని గుర్తించాలని పోరాటకారులంటారు. కానీ నిజానికి విమానంలో వున్న 180 మంది ప్రాణాలు జైలులో ఉన్న 398 మంది స్వేచ్ఛకు సమానమా? ఎక్కువా? తక్కువా? వీళ్ళ నిర్బంధానికి వాళ్ళు ఏ రకంగానూ బాధ్యులు కారు కదా! వాళ్ళ మెడమీద తుపాకులు పెట్టి వీళ్ళను విడిపించుకోవడం, విడిచిపెట్టక పోతే వాళ్ళను చంపడానికి సిద్ధపడటం ఏ విధంగా న్యాయం? ఒకవేళ భారత ప్రభుత్వం లొంగకపోతే విమాన ప్రయాణీకులను చంపుతామన్న బెదిరింపును హైజాకర్లు నిలబెట్టుకోవడానికి ప్రయత్నం చేయక తప్పేది కాదు కదా? ఒక్క ప్రాణం పోయినా అది సమర్థనీయమై ఉండేదా? ఈ ప్రశ్నలు వేస్తున్నామంటేనే కశ్మీర్‌లో అమలవుతున్న నిర్బంధాన్ని చూడడానికి నిరాకరిస్తున్నామనీ, ప్రభుత్వ నిర్బంధాన్ని పరోక్షంగా సమర్థిస్తున్నామనీ హర్కత్-ఉల్-ముజాహిదీన్ మిలిటెంట్లు నిందించవచ్చును గానీ న్యాయాన్యాయాల వివేచన ప్రాతిపదికన చేసే ఆలోచనకు ఈ ప్రశ్నలు తోచక తప్పదు.

చాలా బాధాకరమైన విషయమేమిటంటే కశ్మీర్ ప్రజల సమస్య ఒకసారి కార్గిల్ యుద్ధం రూపంలోనూ, ఒకసారి ఖందహార్ హైజాక్ ఘటన రూపంలోనూ లేదా వేరే ఏదో ఘర్షణగానూ వార్తలకెక్కుతుంది గానీ కశ్మీర్ ప్రజల సమస్యగా అదెప్పుడూ చర్చకు రాదు. ఇప్పుడు విడుదలయిన మౌలానా మసూద్ అజహర్ హర్కత్-ఉల్-ముజాహిదీన్ నాయకుడు. అది హర్కత్-ఉల్-అన్సార్ కొత్త పేరు. పాత పేరుగల సంస్థను అమెరికా 'టెర్రరిస్టు సంస్థల' జాబితాలోకి చేర్చిన తరువాత ఆ సంస్థ తన పేరును హర్కత్-ఉల్-ముజాహిదీన్‌గా మార్చుకుంది. దాని లక్ష్యాలు మాత్రం మారలేదు. ముస్లింలు ఎక్కడున్నా ఇస్లామిక్ రాజ్యంలోనే ఉండాలన్నది వారి ప్రగాఢ నమ్మకం. ఆ నమ్మకాన్ని అమలు చేయడానికి చెచెన్యా నుండి కశ్మీర్ దాకా హర్కత్ మిలిటెంట్లు పోతుంటారు. దురదృష్టమేమిటంటే ఈ కారణంగా చాలా సున్నితమైన సాంఘిక, సాంస్కృతిక కారణాలున్న ఆ పోరాటాలకు ముస్లిం మతోన్మాదం రంగు అంటుకుంది. ఇస్లామిక్ మిలిటెంట్లను కశ్మీరీలూ, చెచెన్

ప్రజలూ ఆహ్వానించకపోలేదు గానీ దానికి ప్రధాన కారణం భావసారూప్యం కాదు. చెచెన్యా సంగతేమో గానీ కశ్మీరీలలో మతోన్మాదం ప్రభావం తక్కువే. అయినప్పటికీ భారత్ మీద వేయడానికి ఒక రాయిగా హర్కత్–ఉల్–అన్సార్‌నూ, హిజ్‌బుల్ ముజాహిదీన్‌నూ, లష్కర్–ఇ–తొయిబానూ కశ్మీరీలు ఆదరించడం పెద్దగా ఆశ్చర్యం కలిగించే విషయం కాదు.

కానీ ఆ సంస్థలలో ఉన్నది ఎక్కువగా పాకిస్తానీ, ఆఫ్ఘానీ జాతీయులయిన ముస్లిం మతోన్మాదులు. ఇప్పుడు 'కశ్మీర్ పోరాటం' ప్రధానంగా వారి చేతిలో ఉంది. కశ్మీరీలు తమ జాతి, జీవనవిధానం, సంస్కృతుల రక్షణ కోసం చెందే ఆరాటం ఎంతమాత్రం చల్లారలేదు. దాని కోసం ఏం చేయాలో పాలుపోక ముస్లిం మతవాదులు తమ సంకుచితమైన అజెండాలోకి దానిని ఇరికించే ప్రయత్నం చేస్తుంటే కశ్మీరీలు తెలిసీ వారిని ఆదరిస్తున్నారు. యాభై ఏళ్ళుగా కశ్మీరీలకు భారత్ చేసిన అన్యాయాన్ని దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఇది సానుభూతితో అర్థం చేసుకోగల వైఖరే. అయినప్పటికీ దాని పర్యవసానాలను చూసినప్పుడు ఇది చాలా దురదృష్టకరమైన వైఖరని అనిపించక తప్పదు.

ఎందుకంటే కశ్మీరీల న్యాయమైన జాతీయ ఆకాంక్షలను చాలా అన్యాయంగా అణచివేసిన రోజులలో భారత ప్రభుత్వానికీ దాని విధానాలకూ కొరవడిన నైతిక సాధికారత ఇప్పుడు దానికి అయాచితంగా లభించింది. భారత్ ఇప్పుడు 'ముస్లిం తీవ్రవాదాన్ని' ఎదుర్కొంటున్న లౌకిక రాజ్యంగా కనబడగలుగుతున్నది. ప్రపంచ దేశాల సానుభూతి పొందగలుగుతున్నది.

మొదట కార్గిల్ యుద్ధం, ఆ తరువాత ఖందహార్ హైజాక్ ఘటన కశ్మీర్ సమస్య నుండి కశ్మీరీలను మరింత వెనక్కి నెట్టేసి లౌకిక భారత రాజ్యానికీ, హర్కత్–ఉల్–అన్సార్ (ఉరఫ్ ముజాహిదీన్) మతోన్మాదానికీ మధ్యనున్న 'పోరాటాన్ని' మరింత ముందుకు తెచ్చింది. మొదటిదశలో భౌతిక విజయం భారత రాజ్యానిదే అయినా నైతిక విజయం కశ్మీరీలది అయినట్టే. రెండవ దశలో అంటే ఈ రోజు – ఇంకా రాబోయే రోజులలో – భారత రాజ్యానికి భౌతిక విజయం కష్టతరం కావచ్చును గానీ నైతిక విజయం సులభంగా లభించేసింది. అది కశ్మీరీల ఆరాటానికి చాలా చాలా నష్టకరం. అమాయకుల ప్రాణాలను పణంగా పెట్టి తమవారి విడుదల కోరుకునే హర్కత్–ఉల్–ముజాహిదీన్ మిలిటెంట్ల హైజాకింగ్ చర్య ఈ నష్టాన్ని మరింత ఎక్కువ చేసింది.

ఈ మాటలు అనడం పరోక్షంగా భారత రాజ్యం అనుసరిస్తున్న అణచివేత విధానాలను సమర్థించడమేననీ, ఈ హింస వెనక కశ్మీర్ సమస్య ఒకటి ఉందని చూడడానికి నిరాకరించడమేననీ హర్కత్ మిలిటెంట్లూ, మేధావులూ అంటే అనవచ్చును గాక, అయినా కశ్మీరీల మంచి కోసమే ఈ మాటలు అనక తప్పదు. 'గ్లోబలైజేషన్' వేలంవెర్రి ఫలితంగా రాబోయే రోజులలో సాయుధ మిలిటెన్సీ బాగా పెరిగే అవకాశం

ఉంది. కాబట్టి దానికి గల సామాజిక కారణాలను సమాజంలో చర్చకు పెట్టడం ఎంత ముఖ్యమో అది తీసుకునే అవాంఛనీయమైన రూపాలను విమర్శించడమూ ప్రజాతంత్రవాదులకు అంతే ముఖ్యమైన కర్తవ్యం అవుతుంది. మొదటి కర్తవ్యానికి రాజ్యం నుండి, రెండవ కర్తవ్యానికి మిలిటెంట్ల నుండీ వారి రాజకీయ సానుభూతిపరుల నుండీ ఎంత వ్యతిరేకత అయినా రావచ్చును గాని, ప్రజల శ్రేయస్సు దృష్ట్యా ఈ పని చేయడం అవసరం.

ప్రస్తుత విషయానికొస్తే, జమ్మూకశ్మీర్ జైళ్ళలో చాలాకాలంగా మగ్గుతున్న వారి పైన కనీసం ఇప్పటి నుండి 90 రోజుల వ్యవధిలోనయినా ఛార్జిషీట్లు పెట్టి వేగంగా విచారణ ముగించాలనీ, అభియోగం చాలనప్పుడు ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాలు ప్రయోగించే అక్రమ పద్ధతిని విడనాడాలనీ బారత రాజ్యాన్ని డిమాండ్ చేయవలసిన అవసరం ఉంది. మళ్ళీ హైజాక్‌లు జరగకుండా చూడాలని నిజంగా మన పాలకులు కోరుకుంటుంటే ఈ పనిచేయాలి.

# 'కశ్మీర్ సమస్య'కు పరిష్కారం వద్దా?

ఈ మధ్య భారత ప్రధాని వాజ్‌పేయి 'పాకిస్తాన్‌తో మాట్లాడేది లేదం'టూ భీష్మించుకు కూర్చోవడం ఆందోళనే కాక ఆశ్చర్యం కూడా కలిగించే విషయం. పాకిస్తానీ సైనిక పాలకులకు లెజిటిమెసీ కల్పించడం ఇష్టంలేక ఆ వైఖరి అవలంబిస్తున్నారని పత్రికలు వ్యాఖ్యానిస్తున్నాయి కాని ఆయన అంటున్నది అది కాదు. సైనిక పాలకులు ప్రజా ప్రతినిధులు కారు కాబట్టి వారితో మాట్లాడి ప్రయోజనం లేదంటే ఆ వాదన తప్పయినా ఒప్పయినా అందులో ఒక తర్కం ఉంది.

కానీ మన ప్రధాని అంటున్నది అది కాదు. పాకిస్తాన్ 'ఆక్రమిత కశ్మీర్' నుండి వైదొలగి దాన్ని మనకు అప్పగించే దాకా మాట్లాడేది లేదని అంటున్నారు. దీని అర్థం మాట్లాడడానికి నిరాకరించడం తప్ప వేరే ఏమీ కాదని ఆయనకీ తెలుసును, అందరికీ తెలుసును. ఇది నిజానికి యాభై ఏళ్ళుగా ఆర్.ఎస్.ఎస్. అనుసరిస్తున్న వాదన. బాల్ థాకరే దీనిని ఇంకొంచెం ముందుకు లాగి 'ఆక్రమిత కశ్మీర్'ను మనకు అప్పగించేదాకా పాకిస్తాన్‌తో క్రికెట్ ఆడొద్దనీ, సాంస్కృతిక సాహిత్య రంగాలలో ఇచ్చి పుచ్చుకోవడం బంద్ చేయాలనీ అంటున్నారు. ఇప్పుడు అటల్ బిహారీ వాజ్‌పేయి అదే పాట పాడుతున్నారు.

ఈ మహాభాగ్యానికి ఒక సంవత్సరం క్రితం లాహోర్ పోయిందెందుకు? 'ఆక్రమిత' కశ్మీర్‌ను పాకిస్తాన్ ఇవ్వదనీ, దానిని మనకు ఇవ్వడానికి పాకిస్తాన్ దానిని మనదిగా భావించడం లేదనీ అప్పుడు తెలీదా? నిజానికి పాకిస్తాన్‌లో ఉన్న కశ్మీర్‌ను మనం 'ఆక్రమిత కశ్మీర్' అని పిలిచినట్టే భారత్‌లో ఉన్న కశ్మీర్‌ను పాకిస్తాన్ 'హెల్డ్ కశ్మీర్' అంటుంది. అంటే మనం గుప్పిట్లో ఉంచుకున్న కశ్మీర్ అని అర్థం. దానిని విడిచిపెట్టే వరకూ భారత్‌తో మాట్లాడవద్దని పాకిస్తాన్ ప్రభుత్వాన్ని హెచ్చరించే సంస్థలు, ఉద్యమాలు ఆ దేశంలోనూ ఉన్నాయి.

సమస్యలున్నాయి కాబట్టే మాట్లాడుకోవలసి ఉంది. 'కశ్మీర్ సమస్యే లేదని నువ్వు గుర్తిస్తేనే నీతో మాట్లాడతాను' అనే వైఖరి బొత్తిగా అర్థంలేని వైఖరి. ఈ రెండు దేశాలలోనూ

---

ఆంధ్రప్రభ దినపత్రిక, 02-03-2000

ఉన్మాదులు ఏమన్నప్పటికీ ఈ వ్యావహారిక సత్యాన్ని ఎవరు అధికారంలో ఉన్నా గుర్తించడం జరుగుతున్నది. కాబట్టే ఏదో ఒక మేరకు ఈ రెండు దేశాల మధ్య సంభాషణ ఒకసారి కాకపోతే ఒకసారి జరుగుతున్నది. ఇప్పుడు బహుశా మొట్టమొదటిసారిగా భారత ప్రభుత్వ ప్రధానమంత్రి కశ్మీర్ విషయంలో పాకిస్తాన్ తన వైఖరిని మొత్తంగా విడిచిపెడితేనే వారితో మాట్లాడతామంటున్నారు. ఇంక అప్పుడు మాట్లాడుకోవడానికి ఏముంటుంది? ఎగుమతి దిగుమతి సుంకాల గురించి మాట్లాడుకుంటారా? నిజానికి పాకిస్తాన్ అయినా మనమైనా కశ్మీర్ విషయంలో మౌలిక వైఖరిని విడిచిపెట్టడానికి సిద్ధపడినట్టయితే ఇంక మాట్లాడలేకపోవడానికి కారణం మాత్రం ఏముంటుంది? నువ్వు సమస్యే లేదని ఒప్పుకుంటే నేను పరిష్కారం చెప్తానన్నది 'దేశభక్తి' కావచ్చును కానీ అది వట్టి తెలివితక్కువ వైఖరి.

మళ్ళీ మళ్ళీ చెప్పవలసిన విషయం ఏమిటంటే ఈ వైఖరి వల్ల నష్టపోయేది కశ్మీరీలు. ఆ లోయలోనూ, దానిని ఆనుకుని ఉన్న జమ్మూ ప్రాంతపు పీర్ పంజల్ కొండచరియలలోనూ నిత్యం సాగుతున్న మారణకాండ ఎప్పటికైనా ఆగాలంటే భారత పాకిస్తాన్‌లు పట్టుదల వీడి మాట్లాడుకోవడానికి సిద్ధపడాలి. ఇన్నాళ్ళూ కశ్మీరీలతో మాట్లాడడానికి కూడా సిద్ధపడాలి. ఇన్నాళ్ళూ కష్టసాధ్యంగా కనిపించిన ఈ ఆశ రాను రాను పగటికలగా కనిపిస్తున్నది. అది పగటికలేనని చెప్పడం కోసమే కాబోలు మన ప్రధాని ఈ ప్రకటన పదే పదే చేస్తున్నారు.

మన పాలకులు పాకిస్తాన్‌తో మాట్లాడరు. పోనీ కశ్మీరీల మాటయినా వింటారా? రాజ్యాంగాన్ని సమీక్షిస్తామని వాళ్ళు అంటున్నారంటే వారి దృష్టిలో ముఖ్యంగా ఉన్నది ఆర్టికల్ 370 అని వేరే ఎవ్వరికీ తెలియకున్నా కశ్మీరీలకు తెలుసును. కశ్మీరీలు ఎప్పటికయినా భారత్‌లో కొనసాగడానికి ఇష్టపడడం అంటూ జరిగితే అది ఆర్టికల్ 370 ప్రాతిపదికనే కాగలదని కశ్మీర్‌తో ఏ కొంచెం పరిచయం ఉన్న వారికైనా తెలుసును.

నిజానికి ఆర్టికల్ 370 ఇప్పటికే తన సారాన్ని కోల్పోయింది. నామమాత్రంగా అది రాజ్యాంగంలో ఉంది. అదెలా జరిగిందన్న విషయాన్ని వివరించి చెప్పడానికిది సందర్భం కాదు కాని జరిగిందనేది మాత్రం సత్యం. ఇప్పుడున్న డొల్లను కొనసాగించడమా లేదా అనేది సమస్య కాదు. ఆర్టికల్ 370 ని నిజమైన అర్థంలో పునరుద్ధరించడం 'కశ్మీర్ సమస్య' పరిష్కారానికి కనీస అవసరం. అందుకు పూర్తి విరుద్ధంగా ప్రకటనలిస్తూ మరొకవైపు పాకిస్తాన్‌తో కూడా మాట్లాడడానికి నిరాకరిస్తున్న మన బి.జె.పి. పాలకులు 'కశ్మీర్ సమస్య'కు ఏ పరిష్కారాన్ని ఆశిస్తున్నారో ఊహించడం కష్టం కాదు. ఇప్పటికే సైనిక బలగాల నిలయంగా ఉన్న కశ్మీర్‌ను మరింతగా సైన్యానికీ, కేంద్ర యుద్ధ మంత్రి జార్జి ఫెర్నాండెజ్‌కూ (ఇన్నాళ్ళూ మనకు రక్షణ మంత్రులున్నారు కానీ ఫెర్నాండెజ్ రాకతో ఒక యుద్ధ మంత్రిని పొందాము) విడిచిపెట్టడం వారి మనసులో ఉన్న పరిష్కారం. ఇది

పనిచేయకపోగా విపరీతమైన రక్తపాతానికి దారితీస్తుందని కశ్మీర్ పరిస్థితులతో ఏ కొంచెం పరిచయం ఉన్నవారయినా చెప్పగలరు. కానీ పారేది కశ్మీరీ ముసల్మాన్‌ల రక్తమైనప్పుడు మన వాళ్ళెందుకు బాధపడతారు? నిజమే, వారితోపాటు సైనిక జవాన్లు కూడా చాలామంది చనిపోతారు. కానీ వారికి అమరగీతాలు పాడొచ్చు. వారి బలిదానాన్ని శ్లాఘించవచ్చు. శౌర్య చక్ర వంటి బిరుదులియ్యవచ్చు.

వేరే ఎవరి సలహాలు వినడానికి సిద్ధంగా లేకున్నా బి.జె.పి. పాలకులు కనీసం తమకు సన్నిహితుడయిన ఫరూఖ్ అబ్దుల్లా సలహాలయినా వినవచ్చును కదా? అతనికి తన బాధ్యతల పట్ల కానీ, కశ్మీర్ ప్రజల భవితవ్యం పట్ల కానీ పెద్దగా పట్టింపు ఉన్న దాఖలాలేవీ లేవు. ఒక రోజు శ్రీనగర్‌లో ఉంటే రెండవ రోజు లండన్‌లోనో, ప్యారిస్‌లోనో ఉండే విలాసజీవి. తండ్రి వారసత్వంగా ఆయనకి రాజకీయ ప్రాముఖ్యం సంక్రమించిందే తప్ప సొంత అర్హత లేశమంతైనా లేదు.

అటువంటి వ్యక్తి సహితం స్వాంతంత్ర్యం కాకపోతే కనీసం స్వయంప్రతిపత్తి కశ్మీరీలకు అత్యంత ప్రీతిపాత్రమైనదని గ్రహించారు. 1952లో ఆయన తండ్రి షేక్ అబ్దుల్లా అప్పటి భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూతో చేసుకున్న 'ఢిల్లీ ఒప్పందం' ఈ కనీస స్వయంప్రతిపత్తిని నిర్వచించింది. దానిని పూర్తిగా పునరుద్ధరించినా కశ్మీరీలలో మెజారిటీ సంతృప్తి చెందుతారని – స్వాతంత్ర్య పోరాటం వదులుకుంటారని చెప్పగలమో లేదో కానీ – చెప్పొచ్చేమో! రక్తపాతం ద్వారా కాకుండా కొంచెమైనా నాగరికంగా కశ్మీరీలను గెలుచుకోదలచుకుంటే 1952 ఢిల్లీ ఒప్పందాన్ని సంపూర్ణంగానూ, చిత్తశుద్ధితోనూ పునరుద్ధరించి అమలు చేయడం ఒక్కటే మార్గమని అందరికీ తెలుసు. అందుకే ఫరూఖ్ అబ్దుల్లా దానిని తన ఎన్నికల హామీ చేసుకున్నారు. గెలిచిన తరువాత అందుకోసం ఒక కమిటీని కూడా వేశారు.

ఇప్పుడు ఆ కమిటీ నిర్దిష్టమైన ప్రతిపాదనలతో తన నివేదికను రాష్ట్ర ప్రభుత్వానికి ఇచ్చింది. రాష్ట్రం దానిని కేంద్రానికి పంపించింది. ఫరూఖ్ అబ్దుల్లా వంటి మిత్రుడు – కశ్మీర్ ఎప్పటికైనా భారత్‌లో భాగమేనని గట్టిగా నమ్మే 'దేశభక్తుడు' – సహితం కశ్మీర్‌ను 'కాపాడుకోవడానికి' ఇది తప్ప వేరే మార్గం లేదని గుర్తించడం నుంచయినా మన హిందూత్వవాద పాలకులు 'కశ్మీర్ సమస్య'కు సంబంధించిన ఒక ప్రాథమిక సత్యాన్ని గుర్తించగలిగితే అది అందరికీ శ్రేయస్కరం.

కానీ మన పాలకుల ఆలోచనలిప్పుడు ఆ దిశలో లేవు. ఎటువంటి 'బలహీనతలు' ప్రదర్శించని శక్తిమంతులుగా కనిపించడం వారికి ఇప్పుడు ముఖ్యం. ఎవరిని సంతృప్తిపరచడానికి? హిందూత్వవాదుల అధినేత ఖందహార్ ఘటన సందర్భంగా 'మనం పిరికివాళ్ళం' అన్నారు కదా – ఆయనను సంతృప్తిపరచడం కోసం. ఆయనను అంటే ఆ

వ్యక్తినని కాదు, ఆ ఆలోచనా సరళిని. చుట్టుపక్కల దేశాలు జడుసుకునే బలవత్తర దేశంగా భారత్‌ను భావించుకోవాలి. ఆ భావనను వాస్తవం చేయాలి. విమాన ప్రయాణీకుల ప్రాణాలు కాపాడాలనుకోవడం, కశ్మీరీల మనోభావాలను అర్థం చేసుకోవాలనుకోవడం, ప్రజలేదయినా కోరుకుంటే కనీసం కొంచెమైనా ఇచ్చి వారిని మంచి చేసుకోవాలనుకోవడం, సామరస్యం కోసం అవసరమయితే ఒక్కడుగు వెనక్కి వేయడం – ఈ 'పిరికి మందు' మన పాలకులకు గిట్టదు. అవి బలవంతులకు తగని ఆలోచనలు. చేతకాని వాళ్ళు అటువంటి ఆలోచనలు చేస్తారు కానీ అఖండ భారత్‌ను ప్రచండ శక్తిగా మార్చడం తమ దీర్ఘకాల ఆదర్శంగా కలవాళ్ళు చేయరు.

ఒక్కొక్క అడుగే యుద్ధం వైపు పోతున్నామంటే అది అనవసరమైన భయమనో అతిశయోక్తి అనో అనిపించవచ్చు. పూర్తి స్థాయిలో యుద్ధం చేయడానికి ఈ రెండు దేశాలూ ఈ రోజు వెనుకాడవచ్చు కానీ మన పాలకులు పాకిస్తాన్ విషయంలోనే కాక కశ్మీర్ విషయంలో కూడా అనుసరిస్తున్న వైఖరికి వేరే పర్యవసానం ఏదీ ఉండజాలదు. ఇక్కడ 'కశ్మీర్ విషయంలో' అనేది చాలా ముఖ్యం. కశ్మీర్ ప్రజల సహాయ సహకారాలు తనకు లభిస్తే భారత్ మీద యుద్ధం విజయవంతంగా చేయగలనన్న ధీమా పాకిస్తాన్‌కు మొదటి నుండి ఉంది. ఇప్పటిదాకా ఆ సహకారం పాకిస్తాన్‌కు పూర్తిగా అందలేదు. ఎందుకంటే సగటు కశ్మీరీలు భారత్‌లో కానీ, పాకిస్తాన్‌లో కానీ ఉండడానికి ఇష్టపడరు. కానీ ఆర్టికల్ 370 – ఇంకా సరిగ్గా చెప్పాలంటే 1952 ఒప్పందం విషయంలో ఇదే తిరస్కార వైఖరి మన పాలకులు కనబరుస్తూ ఉంటే వాళ్ళెంతగా పాకిస్తాన్‌తో యుద్ధానికి ఉబలాటపడుతున్నారో పాకిస్తాన్ కూడా అంతగా సై అనడానికి సిద్ధపడుతుంది. ఆ వాతావరణం 'కార్గిల్ యుద్ధ'మప్పటి నుండి కనిపిస్తున్నది. దానిని పెంచే దిశగానే తప్ప తగ్గించే దిశగా పాలకుల ధోరణి లేకపోవడం చాలా ఆందోళనకరం.

# కశ్మీరీలను విడిచి కశ్మీర్ పరిష్కారమా?

**క**శ్మీర్ విషయంలో యాభై ఏళ్ళ కిందట జరిగిన ఘోరమైన పొరపాటు మళ్ళీ జరగబోతున్నదా?

కశ్మీరీల మనోభావాలను పట్టించుకోకపోవడం గొప్ప రాజనీతి అనే అభిప్రాయం ఈ దేశంలో ఇంత బలంగా స్థిరపడడం చాలా ఆశ్చర్యం కలిగించే విషయం. యాభై ఏళ్ళ చరిత్ర నుంచి ఏ గుణపాఠమూ తీసుకోనక్కరలేదన్నట్టు వెంకయ్యనాయుళ్ళూ, జానా కృష్ణమూర్తులూ మాట్లాడడం ఆశ్చర్యమే కాదు, ఆగ్రహం కూడా కలిగించే విషయం. తాము తెలివి తక్కువగా ఉండదలచుకుంటే అది వారి సొంత విషయమే కావచ్చును గానీ దానిని దేశం మీద రుద్దే అధికారం వారికెవరిచ్చారు?

ఫరూఖ్ అబ్దుల్లా 1953 పూర్వపు స్థితిని తిరిగి తీసుకురావాలని పట్టుబట్టడంలో గల నిజాయితీ ఎంత అన్నది ఇక్కడ ప్రశ్న కాదు. భారత ప్రభుత్వం కశ్మీర్ సమస్య పరిష్కారం కోసం హురియత్ కాన్ఫరెన్స్‌తో చర్చలు మొదలుపెడితే తన ఉనికికే ప్రమాదం వస్తుందని భయపడి ఈ ఎత్తుగడ ఫరూఖ్ అబ్దుల్లా వేశాడని కొందరంటున్నారు. కావచ్చు. రాజకీయవేత్తగా ఫరూఖ్ అబ్దుల్లా సగటు భారతీయ రాజకీయ నాయకులకన్నా గొప్పవాడేం కాదు. అయినప్పటికీ, ఆ రాష్ట్ర స్వయంప్రతిపత్తిని పునరుద్ధరించే విషయమై పరిశీలన జరిపి నివేదిక రూపొందించడానికొక కమిటీని అతడు అధికారానికి వచ్చీరాగానే నియమించాడని మరచిపోకూడదు. అప్పటికి హురియత్ కాన్ఫరెన్స్‌తో భారత ప్రభుత్వం చర్చలు జరపబోతోందన్న ప్రతిపాదన సహితం లేదు.

ఆ మాటకొస్తే చర్చల విషయంలో భారత ప్రభుత్వం నిజాయితీ గానీ హురియత్ కాన్ఫరెన్స్ నిజాయితీ గానీ ఎంత? ఒకరంటే ఒకరికి ఏ మాత్రం గౌరవం లేని ఈ ఇద్దరూ కేవలం అమెరికా ఒత్తిడి వల్ల చర్చలకు అయిష్టంగా సిద్ధపడుతున్నారనేది అందరికీ తెలిసిన సంగతే. భారత పాలకుల అభిప్రాయంలో హురియత్ కాన్ఫరెన్స్ నాయకులు పాకిస్తాన్ ఏజెంట్లు. 'మీకిక్కడేం పని? పాకిస్తాన్‌కు పొండి' అని కశ్మీర్‌ను ఏలుతున్న సైనికాధినేతలు అనేక పర్యాయాలు హురియత్ నాయకులను ఎద్దేవా చేశారు. కార్గిల్ యుద్ధమప్పుడు

---

ఆంధ్రప్రభ దినపత్రిక, 07-07-2000

హురియత్ నాయకులు 'చొరబాటుదారుల'ను 'విముక్తికారులు'గా పేర్కొంటూ వారికి ఆహ్వానం పలుకుతూ శ్రీనగర్‌లో ఊరేగింపులు తీయడం భారత పాలకులకు మరీ కోపం తెప్పించింది. యుద్ధమయిపోయిన కొద్దికాలానికే, అప్పటి దాకా స్వేచ్ఛగా ఉండిన హురియత్ కాన్ఫరెన్స్ నాయకులందరినీ ప్రివెంటివ్ డిటెన్షన్ చట్టాల కింద అరెస్టు చేశారు. హురియత్ నాయకులు కశ్మీర్ జైళ్ళలో ఉంటే వారిని చూడడానికి వచ్చే పోయే వారితో జైళ్ళు మరీ కోలాహలంగా ఉంటాయని చెప్పి వారిని ఆ రాష్ట్రానికి వెలుపల బంధించారు. పనిలోపనిగా ఆ హిమాలయ వాసులను రాజస్థాన్ ఎడారిలోని జోద్‌పూర్ సెంట్రల్ జైలులో నిర్బంధించి తమ శాడిజం కూడా ప్రదర్శించుకున్నారు.

వాళ్ళిప్పట్లో బయటికి రారనుకుంటూ ఉండగా దేశానికి బిల్ క్లింటన్ వచ్చి వెళ్ళాడు. అతను వెళ్ళిపోయిన కొద్ది రోజులకే హురియత్ నాయకులందరినీ ఏ కారణం చెప్పకుండా విడిచిపెట్టారు. వాళ్ళ వల్ల జాతి భద్రతకు ఉందని చెప్పిన ప్రమాదం ఏమయిపోయిందో చెప్ప లేదు. పైగా అక్కడితో ఆగకుండా ఈ దేశద్రోహులతో, పాకిస్తాన్ మానసపుత్రులతో చర్చలకు సహితం ప్రభుత్వం సిద్ధమేనని అద్వానీ వంటి దేశభక్తుడు ప్రకటించారు. పలికెడిది అద్వానీయే గానీ పలికించెడు వాడు క్లింటన్ అనేది అందరూ ఎరిగిన విషయమే. దీనితో పోలిస్తే ఫరూఖ్ అబ్దుల్లా అవకాశవాదం ఏమంత నిందించవలసింది కాదు.

హురియత్ కాన్ఫరెన్స్ విషయం కూడా అంతే. 30కి పైగా సంస్థలు ఆ కూటమిలో ఉన్నాయంటారు. కానీ దానిని నడిపించేదీ పలికించేదీ జమాతే ఇస్లామియే. జమాతే నాయకుడు సయ్యద్ అలీషా గిలానీ అభిప్రాయాలే హురియత్ అభిప్రాయాలు. జమాతే ఇస్లామితో మౌలిక విభేదాలున్న యాసిన్ మాలిక్ వంటి వారు సహితం కశ్మీరీ పోరాటం గొంతు ఒకటిగా ఉండాలన్న ఆకాంక్ష వల్ల భిన్నమైన గొంతులతో మాట్లాడరు.

మరి జమాతే ఇస్లామి అభిప్రాయంలో చర్చలంటే త్రైపాక్షిక చర్చలే. భారత్, పాకిస్తాన్‌లు, కశ్మీరీ ప్రతినిధులు కూర్చొని మాట్లాడుకోవాలే తప్ప కశ్మీరీలూ, భారత ప్రభుత్వమూ మాట్లాడుకోవడం వృధా అనేది వారి అభిప్రాయం. అదే హురియత్ కాన్ఫరెన్స్ అభిప్రాయం కూడా. అయినప్పటికీ అమెరికా ఒత్తిడి ఫలితంగా వారిప్పుడు భారత ప్రభుత్వంతో ద్వైపాక్షిక చర్చలకు అయిష్టంగానయినా సిద్ధపడుతున్నారు. ఇప్పుడు ప్రపంచంలో అమెరికాయే ఏకైక న్యాయనిర్ణేత, ఏకైక న్యాయస్థానం. ఈ సత్యానికి అయిష్టంగా తల ఒగ్గి పంచాయతీకి కూర్చోవడానికి సిద్ధపడుతున్న భారత పాలకులతో, హురియత్ కాన్ఫరెన్స్‌తో పోలిస్తే ఫరూఖ్ అబ్దుల్లా అందరూ అంటున్నంతటి నీతిమాలిన అవకాశవాది కాదు.

దీని అర్థం భారత ప్రభుత్వం హురియత్ కాన్ఫరెన్స్‌తో మాట్లాడవద్దని కాదు. అమెరికా చెప్పేదాకా ఎందుకు జ్ఞానోదయం కాలేదు, అప్పుడు కూడా అమెరికా చెప్పిందన్న తప్పుడు కారణం వల్ల జ్ఞానోదయం కలిగిందన్న అభ్యంతరం తప్ప చర్చల

పట్ల అభ్యంతరమేమీ లేదు, ఉండనవసరం లేదు. హురియత్ కాన్ఫరెన్స్ కశ్మీర్‌లోని ప్రధాన మిలిటెంట్ శక్తుల రాజకీయ ప్రతినిధి. అటువంటి వారితో రాజకీయ సంవాదం పెట్టుకోవడానికి ఒకరి సలహా ఎందుకు? వారితో మాట్లాడకుండానే 'కశ్మీర్ సమస్య' పరిష్కారమైపోతుందని ఎందుకు అనుకుంటూ వచ్చారు? ఏ విధంగా అనుకోగలిగారు? హురియత్ కాన్ఫరెన్స్ ప్రధాన నాయకులు పాకిస్తాన్ అనుకూలురే కావచ్చు. కశ్మీర్ ప్రజలలోనే పాకిస్తాన్‌లో కలవాలన్న ఆకాంక్ష చెప్పుకోదగ్గ స్థాయిలో ఉన్నప్పుడు వారితో మాట్లాడకుండానే ఉండడం ఎట్లా సాధ్యమవుతుంది? ఎంత అప్రియమైన అభిప్రాయాన్నయినా కేవలం తుపాకులతో ఎట్లా ఎదుర్కొంటారు?

కాగా, ఇప్పుడు అమెరికా ఒత్తిడి ఫలితంగా చర్చలకు కూర్చోవడం వల్ల హురియత్ కాన్ఫరెన్స్ కశ్మీర్ ప్రజల ఏకైక ప్రతినిధి అయిపోయే ప్రమాదం ఉంది. అయితే అది నిజం కాదు. అమెరికా ఒత్తిడి అనే అండ దొరకక ముందు హురియత్ కాన్ఫరెన్స్ నాయకులు ఈ విషయంలో నిజాయితీగానే మాట్లాడేవారు. కశ్మీర్ ప్రతినిధులంటే తాము మాత్రమే కాదనీ, కశ్మీర్‌లోని భిన్న ఆలోచనా ధోరణులన్నిటికీ చర్చలలో చోటు ఉండాలనీ అనేవారు. ఇప్పుడు ప్రపంచ పోలీసు అండ దొరికాక ఆ విషయం ప్రదర్శించవలసిన అవసరం లేదని వారు కూడా అనుకోవచ్చు.

1953 నాటి స్థితి మాటకొస్తే కశ్మీర్ ఎప్పటికయినా భారతదేశంలో ఉండాలంటే ఆ స్థితిని పునరుద్ధరించడం తప్ప వేరే మార్గం లేదు. ఇది ఫరూఖ్ అబ్దుల్లా నిజాయితీతో గానీ రాజకీయ విజ్ఞతతో గానీ నిమిత్తం లేని వాస్తవం. కశ్మీర్ గురించి ఏ కొంచెమైనా తెలిసిన వారందరికీ ఈ సంగతి తెలుసును. 'జబ్‌తక్ సూరజ్ చాంద్ రహేగా కశ్మీర్ హిందూస్తాన్ రహేగా' అంటూ నినాదాలు ఇచ్చేవాళ్ళు మాత్రం దీనిని గుర్తించదలచుకోలేదు. వాళ్ళు నమ్ముకున్నది, ఆరాధించేది బలాన్ని, బలప్రయోగాన్ని. కావలసినన్ని తుపాకులు, క్షిపణులు, అణుబాంబులు సమకూర్చుకుంటే కశ్మీర్ ఇండియాలో ఉండక చస్తుందా అన్నది వాళ్ళ ధీమా. వాళ్ళ మాటే సాగితే మాత్రం కశ్మీర్ ఏదో ఒక రోజు భారత్ నుండి వేరయిపోక తప్పదు. ఎట్టి పరిస్థితుల్లోనూ జరగనివ్వం అంటూ ఏ 1953 పూర్వస్థితి పునరుద్ధరణ గురించి ఈ హిందూత్వవాద నాయకులంతా ఆలోచన లోపించిన ఆత్మవిశ్వాసంతో ప్రకటనలిస్తున్నారో ఆ 1953 స్థితిని తిరగి తీసుకొస్తేనే కశ్మీర్ ఇండియాలో కొనసాగే అవకాశం కొంతయినా ఉంది.

'స్వయంప్రతిపత్తిని ఎట్టి పరిస్థితిలోనూ పునరుద్ధరించం. పాకిస్తాన్ ఆక్రమణలోని కశ్మీర్‌ను కూడా విముక్తం చేసి మొత్తం కశ్మీర్‌ను భారత భూభాగంగా ఏలుతాం' అని హోంమంత్రి అంటున్నారు. ఆర్.ఎస్.ఎస్ శాఖలలో ఉపన్యాసాలిచ్చి చప్పట్లు కొట్టించుకున్నట్టు కాదు దేశ విధాన రచన చేయడమంటే. కేవలం 45 లక్షల జనాభా ఉన్న కశ్మీర్ లోయ

పదేళ్ళ కాలంలో దాదాపు 70 వేల మందిని పోగొట్టుకుని కూడా స్వాతంత్ర్యం, స్వయం ప్రతిపత్తి, స్వేచ్ఛ అనే మాటలకు స్పందిస్తున్నదంటే దాని వెనుక చాలా లోతయిన ఆకాంక్ష ఉందని అర్థం కాని వాళ్ళకు దేశాన్ని పరిపాలించే అర్హత గానీ యోగ్యత గానీ ఉందనుకోవాలా?

కొండ ప్రాంతాలలో బతికే వాళ్ళలో అమాయకత్వం పాలు కొంచెం ఎక్కువ ఉంటుందంటారు. కశ్మీర్ అనగానే ఈ రోజు మతోన్మాదం, హింస స్ఫురించే వాతావరణం నెలకొనింది గానీ సగటు కశ్మీరీలలో ఇవేవీ కనిపించవు. 'మేము వేరు, మా బతుకు వేరు. మమ్మల్ని మా పాటికి ఉండనివ్వండి అంటే మీకెందుకు అర్థం కాదు?' అని స్నేహంగానే విస్మయం వ్యక్తం చేస్తారు. వాళ్ళ భావాలతో నిమిత్తం లేని వేరే ఏవేవో విషయాలకు కశ్మీర్ ప్రతీక అయిపోవడం వల్ల ఈ ప్రశ్న ఎవరికీ వినిపించదు. నెహ్రూ బ్రాండు లౌకికవాదులకు కశ్మీర్ ఆధునిక భారత లౌకికతకు ప్రతీక. అద్వానీ బ్రాండు దేశభక్తులకు కశ్మీర్ అఖండ భారత్‌కు ప్రతీక. పాకిస్తానీ పాలకులకు అనంతమైన జిహాద్‌కు ప్రతీక.

కశ్మీర్ గురించి ఆలోచించడమంటే కశ్మీరీల కోసం ఆలోచించడమని మనమెప్పుడు అర్థం చేసుకుంటాం?

# కశ్మీరీ విషాదం

**క**శ్మీర్ పరిస్థితి చాలా బాధాకరంగా తయారయింది. తమతో సంబంధంలేని బలమైన బాహ్యాశక్తుల ఘర్షణలో నలిగిపోవడం మొదటినుండీ కశ్మీరీల దుర్గతి కాగా ఇప్పుడది మరీ వికృత రూపం తీసుకుంటున్నది.

ఒక దశాబ్దం కింద కశ్మీరీల పోరాటంగా మొదలయిన పోరాటం కాలక్రమంలో పాకిస్తానీ, ఆఫ్ఘానీ మిలిటెంట్ల చేతిలోకి పోయింది. హిజ్బుల్ ముజాహిదీన్ మొదటినుండి పాకిస్తాన్ అనుకూల సంస్థే (అంటే కశ్మీర్ ఇండియా నుండి బయటపడి పాకిస్తాన్‌లో కలవాలని నమ్మే సంస్థే) కానీ ఒకప్పుడు ఆ సంస్థ సభ్యులెక్కువగా కశ్మీరీ యువకులు కాగా ఇప్పుడు అత్యధికంగా బయటివారు.

అయినప్పటికీ సగటు కశ్మీరీలు హిజ్బుల్ ముజాహిదీన్‌ను ఆదరించారు. 'తమ కోసం' పోరాటం చేస్తున్న సోదరులుగా వారిని భావించి ఆదరించారు. ముక్కు మొహం తెలియని పాకిస్తానీ మిలిటెంట్లు ఏ కశ్మీరీ గ్రామంలోనో ఎన్‌కౌంటర్‌లో చనిపోతే స్థానిక జనం అతని మృతదేహాన్ని ఆవేశపూరితంగా ఊరేగించి ఘనంగా అంత్యక్రియలు జరిపిన ఘటనలనేకం కశ్మీర్‌లో నేటికీ జరుగుతున్నాయి.

'ఆజాదీ' కావాలని కోరుకునే సగటు కశ్మీరీకి పాకిస్తాన్‌లో కలవాలన్న కోరిక లేకపోయినప్పటికీ ఇండియా మీద పోరాటం చేస్తూ తమ కోసం ప్రాణాలర్పిస్తున్న హిజ్బుల్ ముజాహిదీన్ కార్యకర్తలంటే వారికి అభిమానం ఉంది.

అయితే కశ్మీరీ పోరాటం విదేశీ హస్తాలలోకి పోవడం వల్ల తమ ఇష్టాయిష్టాలతో ప్రమేయం లేని మార్పులకు కశ్మీరీలు తల ఒగ్గవలసి వస్తున్నది. ఇది నిజానికి యాభై ఏళ్ళుగా జరుగుతున్నదే. భారత పాకిస్తాన్‌ల వైరం, లౌకికవాదానికీ మతవాదానికీ మధ్య తలెత్తే ఘర్షణ, అమెరికా, సోవియట్ రష్యా ప్రచ్ఛన్న యుద్ధం, భారతదేశంలోనూ పాకిస్తాన్‌లోనూ ఆంతరంగిక మతవాద రాజకీయాల ఒత్తిడి – ఒకటేమిటి అరడజను అప్రస్తుతమైన శక్తులూ ఘర్షణలూ కశ్మీరీల గతిని నిర్ణయించాయి.

ఇప్పుడు మళ్ళీ అదే జరుగుతున్నది. ప్రస్తుతం ప్రపంచంలోని ఏకైక పెత్తందారీ కేంద్రమైన అమెరికా ఏ కారణంగానైతేనేం కశ్మీర్‌లో శాంతి కావాలని కోరుకుంటున్నది.

---

ప్రజాతంత్ర వారపత్రిక, 06-08-2000

మధ్యఆసియా దేశాలలోని అపారమైన పెట్రోలియం వనరులపైన అమెరికా కన్నేసిందనీ, ఆ వనరులను కరాచీ రేవు నుంచి తీసుకుపోవలసి ఉంటుందనీ, కశ్మీర్‌లో శాంతి లేనంతకాలం మధ్యఆసియా నుండి కరాచీకి వెళ్ళే మార్గం సాయుధ ఇస్లామిక్ మిలిటెంట్లమయంగా ఉంటుంది కాబట్టి కశ్మీర్‌లో శాంతి కావాలని అమెరికా కోరుకుంటున్నదనీ ఒక వ్యాఖ్యానం ఉంది. కావచ్చు.

కారణమేమయితేనేం, అమెరికా ఇప్పుడు కశ్మీర్ సమస్యకు పరిష్కారం కోరుకుంటున్నది. ఈ ఒత్తిడి భారత, పాకిస్తాన్ ప్రభుత్వాలపైన పడింది. దాని ఫలితంగానే మన హిందూత్వవాద పాలకులు తమ బద్ధశత్రువులైన హురియత్ కాన్ఫరెన్స్ నాయకులను జైలు నుండి విడిచిపెట్టి, వారితో చర్చలు పెట్టుకుంటామని ప్రకటించారు.

ఆ ఒత్తిడి ఫలితమే ఇప్పుడు హిజ్బుల్ ముజాహిదీన్ చేసిన కాల్పుల విరమణ ప్రకటన. కశ్మీర్‌లోని అన్ని పోరాట సంస్థలలోకి పాకిస్తాన్ ప్రభుత్వానికి అత్యంత సన్నిహితమైనది హిజ్బుల్ ముజాహిదీన్. అమెరికా ఒత్తిడి ఏ మేరకయితే పాకిస్తాన్ ప్రభుత్వం పైన పనిచేస్తుందో ఆ మేరకు పాకిస్తాన్ ఒత్తిడి హిజ్బుల్ ముజాహిదీన్ పైన పనిచేస్తుంది. దాని పర్యవసానమే కాల్పుల విరమణ ప్రకటన.

కానీ పాకిస్తాన్ దుర్గతి ఏమిటంటే ఆ గడ్డమీద స్థావరం ఏర్పరచుకున్న మతవాద మిలిటెంట్ సంస్థలలో అనేకమిప్పుడు ఆ దేశ ప్రభుత్వం అదుపులో లేవు. పాకిస్తాన్ ఇప్పుడు నిజానికి ఎవరి అదుపులోనూ లేని ఫ్రీలాన్స్ మిలిటెంట్లకు కేంద్రం. ఆఫ్ఘానిస్తాన్ నుండి సోవియట్ రష్యాను తరిమేయడానికి అమెరికా ఆవిష్కరించిన వ్యూహం ఇప్పుడు పాకిస్తాన్‌కు పీడగా పరిణమించింది. అమెరికా హాయిగానే ఉంది. మనవాళ్ళ ఒత్తిడివల్ల ఏదో ఒకరోజు అమెరికా పాకిస్తాన్‌ను టెర్రరిస్టుల దేశంగా ప్రకటించినా ప్రకటించవచ్చును కూడా. కానీ అమెరికా ప్రయోజనాల కోసం మొదలయిన వ్యూహం ఫలితమే ఈ పరిస్థితి అని అమెరికా ఒప్పుకోదు. ఆ వ్యూహం పాకిస్తాన్‌ను నాశనం చేసింది. ఆ దేశంలోని ప్రతీ ఇంట్లోనూ ఆయుధాలుండే దశ వచ్చింది. ఎవరికి వారు ప్రజలపై పెత్తనం చలాయించే మతవాద మిలిటెంట్ మూకల రాజ్యంగా మారింది పాకిస్తాన్.

వాటిలో ఒకటైన లష్కర్–ఇ–తొయిబా కశ్మీరీ పోరాటంలోనూ భాగమే. సకల కశ్మీరీ మిలిటెంట్ సంస్థల ఉమ్మడి వేదిక అయిన షౌరా–ఇ–జెహాద్‌లో లష్కర్‌దే బలమైన గొంతు. ఆ సంస్థకు అమెరికా ఆదేశాలు గానీ పాకిస్తాన్ ఒప్పుకోలు గానీ హిజ్బుల్ ముజాహిదీన్ దానిని శిరసావహించడం గానీ నచ్చలేదనేది స్పష్టమే. ఈ అసమ్మతి అతి క్రూరమైన హత్యాకాండకు దారితీసింది. ఏ మానవీయమైన లక్ష్యమూ లేని ఉన్మాదులు – ఉన్మాదమే లక్ష్యమైన వారు – తప్ప వేరే ఎవ్వరూ ఈ రకమైన హత్యాకాండకు పాల్పడలేరు. క్లింటన్ రాకకు కొద్దిరోజులు ముందు కశ్మీర్‌లో సిక్కులను ఊచకోత కోసిన

ఘటనకు ప్రేరణ కూడా ఇదేనని ఇప్పుడు మరింత స్పష్టంగా అర్థమవుతున్నది. క్లింటన్ దక్షిణాసియాలోని రెండు ప్రభుత్వాలకూ ఏం చెప్పబోతాడో, వారు ఏం చేయబోతారో ఈ హంతకులకు ఆనాడే తెలుసును.

చాలా బాధాకరమైన విషయమేమిటంటే అత్యంత మానవీయమైన లక్ష్యంగల కశ్మీరీల జాతీయ ఆకాంక్ష ఇటువంటి హంతకుల చేతిలో చిక్కుకోవడం. కశ్మీరీ అంటేనే క్రూరమైన ఉన్మాది అనే తమ ప్రచారాన్ని సమర్థించుకోవడానికి, కశ్మీర్ విషయంలో రాజకీయంగా వ్యవహరించి చేసేదేమీ లేదనే తమ అణచివేత వైఖరిని కొనసాగించడానికి మన సంఘ్ పరివార్ పాలకులకు ఇంతకంటే ఏం కావాలి? పరస్పరం శత్రువులుగా కనిపించే ఉన్మాదాలెప్పుడూ ఒకదానినొకటి పెంచుతాయి. ఈ రెండు రకాల ఉన్మాదమే తప్ప దక్షిణాసియాలో వేరే ఏమీ లేదన్న అభిప్రాయాన్ని వీరిద్దరూ కలిసి పెంచుతారు. చర్చల మీద, సంవాదం మీద తమకు నమ్మకం లేదని బహిరంగంగా ప్రకటిస్తారు. అయినప్పటికీ అమెరికా ఒత్తిడి వల్ల వీరిలో కొందరు, వారిలో కొందరు తమకు కనీస అవగాహన లేని కశ్మీర్ గురించి చర్చలు పెట్టుకుంటారు.

ఇంతకంటే వికృతమైన పరిస్థితిని ఊహించడం కష్టం.

# చర్చలు ఎందుకు మొదలైనట్టు? ఎందుకు ఆగినట్టు?

**భా**రత ప్రభుత్వంతో హిజ్బుల్ ముజాహిదీన్ 'చర్చలు' ఎందుకు మొదలయినట్టు, ఎందుకు ఆగిపోయినట్టు?

మొన్న జరపాలని తలపెట్టినవి 'కశ్మీర్ సమస్య' గురించి చర్చలు కావు. చర్చలు ఏ విధంగా ఏ రూపంలో జరగాలన్న విషయంలో అందరూ ఏకాభిప్రాయానికి వస్తే, అప్పుడు అసలు విషయం మీద చర్చలు మొదలయ్యేవి. ఇది సులభంగా జరిగే పని కాదని అందరికీ తెలుసు.

యాభై సంవత్సరాల మూర్ఖత్వం ఈ సమస్యను ఆవరించి ఉంది. రెండు వైపులా ఉంది. యాభై ఏళ్ళ నాటి కంటె ఇప్పుడు మతతత్వ రాజకీయాల ప్రాబల్యం రెండు దేశాలలోనూ ఎక్కువ కావడం మరొక సమస్య.

ఇంత క్లిష్టమైన పరిస్థితులలో చర్చలకు కూర్చునేటప్పుడు చాలా మెలకువగా వ్యవహరించడం అవసరం. చర్చలు ఏ పరిధిలో జరుగుతాయని మొదట అడిగినప్పుడు 'మానవత్వం పరిధి'లో అని మన ప్రధాని అన్నారు. ఆ వైఖరే అవసరం.

కానీ త్వరలోనే చర్చలు భారత రాజ్యాంగం పరిధిలోనే జరుగుతాయని మన పాలకులు అనసాగారు. భారత రాజ్యాంగం లోపలే 'కశ్మీర్ సమస్యకు' పరిష్కారం ఉందా అన్నదే వివాదం కాబట్టి ఆ పరిధిలోనే చర్చలు జరుపుతామనడంలో అర్థం లేదు.

అటువైపు హిజ్బుల్ ముజాహిదీన్ చర్చలలో పాకిస్తాన్ కూడా భాగమవుతుందని, భారతదేశం వారం రోజులలోగా ఒప్పుకోకపోతే చర్చలకు ముగింపు పలుకుతామని హెచ్చరించడంలోనూ అర్థం లేదు. ఏదో ఒకరోజు పాకిస్తాన్ కూడా చర్చలలో భాగంకాక తప్పదు.

కశ్మీరీలకు భారత్‌తోనూ పాకిస్తాన్‌తోనూ వచ్చిన సమస్యే కశ్మీర్ అయినప్పుడు యాభై ఏళ్ళుగా భారత్ ఒప్పుకోని విషయాన్ని వారం రోజులలో ఒప్పేసుకోకపోతే చర్చల ప్రతిపాదన విరమించుకుంటామనడం చాలా తొందరపాటు చర్య.

నిజానికి చాలా నాటకీయంగా నడిచిన మొన్నటి రెండు వారాల ఘట్టంలో ఎవరి నిర్ణయాలూ స్వచ్ఛందం కావు. కాల్పుల విరమణ ప్రకటించి చర్చలకు కూర్చోవాలన్న

---

ఆంధ్రప్రభ దినపత్రిక, 16-8-2000

నిర్ణయానికి హిజ్బుల్ ముజాహిదీన్ తానుగా రాలేదు. ఇరుపక్షాలూ అమెరికా ఒత్తిడి వల్లనే ఆ నిర్ణయానికి వచ్చారు. అయిష్టంగా వచ్చారు. అంత కృత్రిమంగా మొదలయిన ప్రక్రియ కాబట్టే అంత అర్ధాంతరంగా ముగిసింది.

నాగా మిలిటెంట్ గ్రూపులతో కేంద్ర ప్రభుత్వం జరుపుతున్న చర్చలతో పోలిస్తే ఈ తేడా స్పష్టంగా అర్థం అవుతుంది. ఆ చర్చలు దాదాపు రెండేళ్ళుగా సాగుతున్నాయి. ఇరుపక్షాలూ అనవసరంగా పత్రికలకు ఎక్కకుండా, ఒకరికొకరు సవాళ్ళు విసురుకోకుండా చర్చలలో పాల్గొంటున్నారు. అవి 'రాజ్యాంగం పరిధి' లోపల జరగాలని భారత ప్రభుత్వమూ అనడం లేదు, అనజాలదు. తాము భారత రాజ్యంలో భాగం కాదన్నదే నాగా మిలిటెంట్ల అభిప్రాయం – నాగా ప్రజలలో చాలామంది అభిప్రాయం – కాబట్టే 'నాగా సమస్య' ఉత్పన్నమయింది. కాబట్టి అది భారత రాజ్యాంగం పరిధి లోపలే పరిష్కారం అయి తీరాలనడంలో అర్థం లేదు. ఒక మత గ్రంథమేదీ లేని ఆధునిక లౌకిక రాజ్యాలకు రాజ్యాంగం 'పవిత్ర' గ్రంథం కాకూడదు. ఏ సమాజానికయినా ఒక సంవిధానం అవసరమే. అది నిలకడయిన జీవితానికి అవసరమైన భద్రతనిస్తుంది. మార్పుకు నిలకడయిన అవకాశాలిస్తుంది. ఒక దిశనిస్తుంది. అయితే దాని మూలాన్నే ప్రశ్నించే ఉద్యమాలు గానీ, సంక్షోభాలు గానీ ముందుకొచ్చినప్పుడు అవి కూడా 'రాజ్యాంగం పరిధి'లోనే పరిష్కారం కావాలనడంలో అర్థం లేదు. కాగలిగితే మంచిదే. అప్పుడు ఆ రాజ్యాంగానికి విశాల స్వభావం ఉందని రుజువవుతుంది.

ఇదంతా అట్లాగుంచి, నాగాలాండ్ విషయానికొచ్చేసరికి చర్చలు అవసరమని ఇరుపక్షాలూ – వారి వారి కారణాల వల్ల నమ్ముతున్నారు కాబట్టే ఏ భేషజాలకూ పోకుండా మాట్లాడుకుంటున్నారు. 'భారత రాజ్యాంగం పరిధిలోనే' జరగాలని ప్రభుత్వమూ అనడం లేదు. నాగా పోరాటకారులూ ఏ ముందస్తు షరతులూ పెట్టడం లేదు. వారి పోరాటానికి బయటి సహాయం లేకపోవడం వల్ల అది చాలా అసమాన పోరాటంగా ఉంది. అయినా 50 ఏళ్ళుగా వాళ్ళు అసాధారణమైన పట్టుదలతో పోరాడుతున్నారు. స్థానిక ప్రజలలో వారి లక్ష్యానికి చాలా మద్దతు ఉన్నా ఒక పెద్ద సైన్యాన్ని ఎల్లకాలం ఎదుర్కొనడానికది సరిపోదు.

తమతో ప్రమేయం లేని చారిత్రక కారణాలవల్ల కొందరు ఇండియాలో, కొందరు బర్మాలో చిక్కుకున్న నాగా తెగల ('నాగా' అనే తెగ ఏదీ లేదు. అది భిన్న తెగల సామాన్య 'ఐడెంటిటీ') స్వాతంత్ర ఆకాంక్ష ఎప్పటికైనా సిద్ధించాలంటే రాజకీయ మార్గాలు వెతుక్కోక తప్పదనీ, తుపాకీతోనే ఎప్పటికీ పోరాడుతూ ఉండలేమనీ వారు భావించడం ఆశ్చర్యం కలిగించే విషయం కాదు.

కాగా, పాకిస్తాన్‌ను కూడా చర్చలలో భాగం చేయడానికి భారత్ ఒప్పుకుంటేనే తిరిగి చర్చలకొస్తామని హిజ్బుల్ ముజాహిదీన్ ప్రకటించింది. పాకిస్తాన్‌ను చర్చలలో

భాగస్వామి చేయడం అటుంచి, మిలిటెంట్లు పాకిస్తాన్‌తో తెగతెంపులు చేసుకుంటేనే హిజ్బుల్‌తోనైనా మాటలు జరుగుతాయని భారత ప్రధాని ప్రకటించారు.

'చర్చించేది లేదు' అని ఇద్దరూ ప్రకటించేస్తే సరిపోయేదానికి ఈ సవాళ్ళు విసురుకోవడమెందుకు? 'మేము చర్చలకు సిద్ధమేగానీ ఎదుటివారే వాటిని అసాధ్యం చేస్తున్నారు' అని క్లింటన్‌కు చెప్పుకోవడమే దీని ఉద్దేశమా? చర్చలు క్లింటన్ కోసం జరుపుకుంటామా, మన కోసం జరుపుకుంటామా?

పాకిస్తాన్‌ను చర్చలలో మూడవ పక్షం చేయక తప్పదు గానీ తొలి దశలోనే భారత్ దానికి ఒప్పుకోవడానికి స్వయంకృతమైన అవరోధాలున్నాయి. దేశభక్తి పేరు మీద ఈ దేశంలో చలామణి అవుతున్న అవాస్తవికమైన అభిప్రాయాలకు ప్రధాన మూలం ప్రస్తుత పాలకులే కాబట్టి వారు ఆ పని నెమ్మది మీదనే చేయగలరని హిజ్బుల్ ముజాహిదీన్ గ్రహించాలి. ఇప్పుడు తలపెట్టిన చర్చలు అసలు చర్చల 'మోడాలిటీస్'కు సంబంధించినవే కాబట్టి, ఆ చర్చాచట్రాన్ని, నియమాలను ముందు షరతుల ద్వారా నిర్ణయించే ప్రయత్నం చేయడం తెలివితక్కువతనం.

కాగా 'త్రైపాక్షిక' చర్చలకు హిజ్బుల్ ముజాహిదీన్ ఇస్తున్న నిర్వచనం గురించి కూడా ఆలోచించాలి. 'ఇండియా, పాకిస్తాన్, కశ్మీర్ ప్రతినిధులు' అంటున్నారు. కశ్మీర్ ప్రతినిధులు అంటే ఎవరు? జమ్మూకశ్మీర్ భవితవ్యం గురించి ఆ రాష్ట్రంలో భిన్న అభిప్రాయాలున్నాయనీ, అన్ని గొంతులూ కలిసినప్పుడే రాష్ట్ర ప్రజల ఆకాంక్షలకు ప్రాతినిధ్యం వహించగలవనీ అందరూ ఒప్పుకుంటున్నారు. వాటిలో హిజ్బుల్ ముజాహిదీన్ ఒకటి అనడంలో సందేహమక్కరలేదు. ఎందుకంటే హిజ్బుల్ ముజాహిదీన్‌కు కశ్మీర్ లోయలో చాలా ప్రజాదరణ, గౌరవం ఉన్నమాట సత్యమే. అయినప్పటికీ ఆ సంస్థ ఒక్కటే కశ్మీర్ ప్రతినిధి కాదు, మొత్తం జమ్మూకశ్మీర్ ప్రతినిధి అసలే కాదు. కశ్మీర్ లోయలో కూడా, ఆ లోయ పాకిస్తాన్‌లో కలవాలని కోరుకునే హిజ్బుల్ ముజాహిదీన్ కన్నా, ఆ లోయలోని కశ్మీరీలు, పాకిస్తాన్‌లోని కశ్మీరీలు కలిసి ఒక స్వతంత్ర, సెక్యులర్, ప్రజాస్వామ్య రాజ్యాన్ని ఏర్పాటు చేయాలని నమ్మే జమ్మూకశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ ఆలోచనా రీతికే ఎక్కువ ఆదరణ ఉందన్న బలమైన అభిప్రాయం ఉంది.

జమ్మూకశ్మీర్ రాష్ట్ర జనాభాలో మెజారిటీ కశ్మీరీలే అయినప్పటికీ కశ్మీరీల ప్రతినిధులే మొత్తం రాష్ట్ర ప్రతినిధులు కారు. కశ్మీరీలలో అధిక భాగం భారత్ నుండి బయటికి పోవాలన్న లక్ష్యానికి అనుకూలమే అయినప్పటికీ పాకిస్తాన్ పట్ల వారందరి వైఖరీ ఒకటి కాదు. బహుశా పాకిస్తాన్‌లో కలవడం పట్ల అనుమానాలున్న వారే మెజారిటీ కావచ్చు.

కాబట్టి 'త్రైపాక్షిక' చర్చలలో జమ్మూకశ్మీర్ ప్రజల ప్రతినిధులను నిర్ణయంచడమంటే ఈ భిన్న అభిప్రాయాలకు ప్రాతినిధ్యం వహించే ఒప్పందాన్ని నిర్ణయించడం. ఇది కేవలం విధానపరమైన అవసరం కాదు. 'కశ్మీర్ సమస్య' ప్రాథమికంగా కశ్మీరీల సమస్య.

# హురియత్ కాన్ఫరెన్స్‌తో ఈ చెలగాటం ఎందుకు?

కశ్మీర్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించుకుంటామని భారత్ పాకిస్తాన్ పాలకులు చేస్తున్న ప్రకటనల వెనక మనసులో మార్పేమీ లేదనడానికి హురియత్ కాన్ఫరెన్స్ నాయకుల పాకిస్తాన్ పయనం ఒక ప్రహసనంగా మారడమే నిదర్శనం.

ఇది అచ్చయ్యేనాటికి వాళ్ళు పాకిస్తాన్‌కు పోవలసి ఉంది. కానీ వాళ్ళకు పాస్‌పోర్టులిచ్చే విషయంలో భారత ప్రభుత్వం ప్రదర్శిస్తున్న వైఖరి చూస్తే అనుకున్న ప్రకారం పోతారని కచ్చితంగా చెప్పలేని పరిస్థితి ఉంది.

లష్కర్–ఇ–తొయిబా విషయంలో ఏకపక్షంగా కాల్పుల విరమణ పాటించడానికి సహితం సిద్ధపడిన భారత్ హురియత్ నాయకులు ఏడుగురికి పాస్‌పోర్టులు ఇవ్వడానికెందుకు ఇంత వెనకాడుతున్నది? ఎవరినో మెప్పించడానికి మొదలుపెట్టిన శాంతి ప్రక్రియను నిజంగా కొనసాగించడం ఇష్టం లేకనా?

కావచ్చు. నిజానికి భారత – పాకిస్తాన్‌ల మధ్య ఇప్పుడున్నంత అనుకూల వాతావరణం ఎప్పుడూ లేదు. భారత్‌ను ఏలుతున్నది హరిసింగ్ మహారాజు ఏలిన జమ్మూకశ్మీర్‌ను ఒక్క అంగుళం విడిచిపెట్టకుండా భారత్‌లో కలుపుకుంటామని యాభై ఏళ్ళుగా పొద్దునా, సాయంత్రం కాషాయజెండాపై ప్రమాణం చేస్తూ చెపుతున్న ఖాకీ నిక్కరు యోధులు. పాకిస్తాన్‌ను ఏలుతున్న సైనిక పాలకులు ప్రాపంచిక దృక్పథంలో మన పాలకుల కంటె కొంచెం ఆధునికులే కావచ్చును గానీ వాళ్ళదీ అదే అభిప్రాయం. జమ్మూకశ్మీర్‌ను ఒక్క అంగుళం విడిచిపెట్టకుండా పాకిస్తాన్‌లో కలుపుకోవాలన్నది యాభై ఏళ్ళుగా – మనిషికున్నట్టు సైన్యానికి కూడా జీవిత లక్ష్యం ఉంటుందని చెప్పగలిగినట్టయితే – పాకిస్తాన్ సైన్యం జీవిత లక్ష్యం. అంతేగాక చెట్టుకొకడూ పుట్టకొకడూ మతవాద మిలిటెంట్లున్న పాకిస్తాన్‌లో 'ముస్లిం' కశ్మీర్ గురించి భారత్‌తో సామరస్యపూర్వక పరిష్కారం కోసం ప్రయత్నం చేస్తామని చెప్పడం సులభం కాదు.

తమ మనసులలో లేని సామరస్యం కోసం ఈ రెండు ప్రభుత్వాలు తోలుబొమ్మలు ఆడినట్టు ఆడుతున్నాయి. ప్రపంచంలోని అపరిష్కృత వైరాలన్నిటినీ తన పదవీకాలం

---

ప్రజాతంత్ర వారపత్రిక, 20-01-2001

ముగిసే లోపల పరిష్కారం చేసి చరిత్రలో నిలిచిపోదామని బిల్ క్లింటన్‌కు పుట్టిన కోరిక కంటే గొప్ప కారణమేదీ ఈ తోలుబొమ్మలాట వెనక లేదన్న సందేహం చాలా బలంగా కలుగుతున్నది. అయితే ఇంతకంటే కొంచెం గౌరవించదగ్గ కారణం ఉందేమోనని అనుమానించడానికి ఆస్కారం లేకపోలేదు. కశ్మీరీల జాతీయ ఆకాంక్ష ఎవరెవరి యుద్ధాలకో మందుగుండుగా మారడం ఇంక సహించలేమని భావించిన అమెరికాలో స్థిరపడిన కశ్మీరీలు అమెరికా పాలనా యంత్రాంగంపైన ఒత్తిడి పెట్టి ఆ ప్రపంచ పోలీసు చేత ఇండియా పాకిస్తాన్‌లపైన ఒత్తిడి పెట్టడానికి ప్రయత్నం చేస్తున్న దాఖలాలు కూడా ఉన్నాయి. అమెరికా ప్రభుత్వానికి సన్నిహితులయిన ప్రవాస కశ్మీరీ కోటీశ్వరులు ఒకరిద్దరు తరచుగా ఇటు శ్రీనగర్‌కూ అటు ముజఫరాబాద్‌కూ – మధ్య మధ్యలో ఢిల్లీకి, ఇస్లామాబాద్‌కు కూడా – మంతనాల నిమిత్తం వచ్చిపోతున్నట్టు కశ్మీరీ పత్రికలు రాస్తున్నాయి.

వేరొక కారణాన్ని కూడా ఊహించడానికి అవకాశం ఉంది. సోవియెట్ రష్యా పతనం తరువాత పాశ్చాత్య రాజ్యాలు ఇస్లామిక్ మతవాదాన్ని తమ ప్రధాన శత్రువుగా భావిస్తున్నాయి. దానిని అంతమొందించే విషయంలో వారందరికీ ఏకాభిప్రాయం ఉంది. మన దగ్గర మరీ కరడుగట్టిన హిందూత్వవాదులకు ఇస్లాం గురించి ఎటువంటి మూర్ఖమైన అవగాహన ఉంటుందో పాశ్చాత్య దేశాలలో సగటు వ్యక్తులకు అటువంటి అవగాహనే ఉంది. ఒక్క మాటలో చెప్పాలంటే వాళ్ళకు ముస్లిం అన్నా తాలిబన్ అన్నా ఒక్కటేనని చెప్పవచ్చు. కశ్మీర్ సమస్య వంటివి రగులుతున్నంత కాలం ఇస్లామిక్ మతవాదానికి ఊపిరి అందుతూనే ఉంటుంది. కాబట్టి దానిని త్వరగా ఏదో ఒక రకంగా 'పరిష్కరించేయడం' వారి ప్రయోజనాలకు అవసరం.

ఈ మూడింటిలో ఏది కారణమైనా, ప్రపంచ రాజకీయాలలో చురుకైన పాత్ర నిర్వహించాలని అమెరికా కోరుకున్నంత కాలమే మొదట్లో చెప్పుకున్న తోలుబొమ్మలాట సాగుతుంది. క్లింటన్ గద్దె దిగి బుష్ ఎక్కడం ఈ విషయంలో దిశ మార్పుకు దారి తీయగలదన్న ఆశతో మనవాళ్ళు ఆటను ప్రహసనంగా మార్చి కాలక్షేపం చేస్తున్నారా?

లేదా ఆట తప్పదనుకుంటే దాని ముగింపును 'భారత్ ప్రయోజనాలు' అని పిలవబడే వాటికి అనుకూలంగా మలుచుకోవడానికి మొదటి మెట్టు నుండి ఎత్తుగడలు వేస్తున్నారేమో. హురియత్ కాన్ఫరెన్స్‌లో మొత్తం 32 సంస్థలున్నాయి గానీ అందులో నిర్ణాయకపాత్ర వహించేది పిడికెడు మంది నాయకులే. అయితే వారి మధ్య తీవ్ర విభేదాలు వున్నాయి. 'అందరికీ పాస్‌పోర్టులివ్వం, కొందరికే ఇస్తాం, ఎవరికి కావాలో నిర్ణయించుకోండి' అంటే వాళ్ళలో వాళ్ళు కొట్టుకుని భారత పాలకులు మనసారా ద్వేషించే హురియత్ కాన్ఫరెన్స్ బలహీనపడుతుందని వారి ఆశ కావచ్చు.

హురియత్ కాన్ఫరెన్స్ నాయకులలో జమాతే ఇస్లామి నాయకుడు సయ్యద్ ఆలీషా గిలానీ పాకిస్తాన్ అనుకూలుడయిన మతవాది. ముస్లిం లీగ్ నాయకుడు ప్రొఫెసర్ అబ్దుల్

గనీ భట్ కూడా పాకిస్తాన్ అనుకూలుడైన మతవాదే కానీ గిలానీ కంటే కొంత సంయమనం తెలిసినవాడు. జె.కె.ఎల్.ఎఫ్ నాయకుడు యాసిన్ మాలిక్ స్వతంత్ర కశ్మీర్‌ను కోరుకునే లౌకికవాది. ఈ మధ్యనే తన కుమార్తెకు పాకిస్తాన్‌లో పెళ్ళి జరిపించిన అబ్దుల్‌గనీ లోన్ ఒకనాడు ప్రధాన స్రవంతి (మెయిన్ స్ట్రీం)కి చెందిన రాజకీయ నాయకుడు. ఆ తరువాత మిలిటెన్సీ మద్దతుదారుడయ్యాడు. పాకిస్తాన్‌కు అనుకూలంగానే మాట్లాడేవాడు కానీ ఈ మధ్యన పాకిస్తాన్‌ను తీవ్రంగా విమర్శించడం మొదలుపెట్టాడు. మొన్నటిదాకా హురియత్ ఛైర్మన్‌గా ఉన్న ఉమర్ ఫరూఖ్ కశ్మీరీ ముస్లింల ఆధ్యాత్మిక గురువు. మీర్వాయిజ్ పదవికి వారసుడు. కశ్మీర్ భవితవ్యం గురించి అతని అభిప్రాయం ఏమైనా, ఏ విషయంలోనూ మొండివైఖరి అవలంబించడు.

ఇంత వైవిధ్యం ఉన్న సంస్థలో 'కొందరికి మాత్రమే పాస్‌పోర్టులు ఇస్తాము, ఎవరు తీసుకుంటారో మీరే తేల్చండి' అనడం తాంబూలం ఇచ్చాను ఇక తన్నుకు చావండి అనే కుటిలనీతే. హురియత్ కాన్ఫరెన్స్ కశ్మీర్‌లోని మిలిటెంట్ గ్రూపుల రాజకీయ ప్రతినిధి. ఇది ఒకరి వ్యాఖ్యానం కాదు. వాళ్ళే ఆ విధంగా చెప్పుకుంటారు. మిలిటెంట్లలో కశ్మీరీ జాతీయవాదులున్నారు. పాకిస్తాన్ అనుకూల మతవాదులైన కశ్మీరీలున్నారు, కశ్మీరీలు కాని పాన్ ఇస్లామిక్ పోరాటకారులున్నారు. ఈ ఒక్కొక్క వర్గంలోనూ అంతర్గతంగా వేరే తేడాలున్నాయి. అయినప్పటికీ ఉమ్మడి రాజకీయ వేదిక ఒకటి అవసరమని చెప్పి అందరి సమ్మతితో హురియత్ కాన్ఫరెన్స్‌ను ఏర్పాటు చేసుకున్నారు. ఎన్ని ఒడిదుడుకులున్నా దాదాపు ఒక దశాబ్దకాలం చీలికలు లేకుండా నెట్టుకొస్తున్నారు.

అటువంటి ఐక్యవేదిక ఉండడం సమస్య పరిష్కారానికి ఉపయోగపడుతుందన్న ఇంగితం భారత్‌కు ఉండాలి. ఎప్పటికైనా మిలిటెంట్లతో రాజకీయ చర్చలు జరపడం ద్వారా సమస్యను పరిష్కరించే ఉద్దేశం నిజంగా ఉన్నట్టయితే, హురియత్ ద్వారానే ఆ చర్చలు జరగగలవు. అటువంటి సంస్థను గౌరవించవలసింది పోయి దాని పట్ల కౌటిల్యం ప్రదర్శించడం, దానిని సంక్షోభంలో పడేసి ఏదో లబ్ధి పొందుదామని చూడడం చాలా బాధాకరం. నిజంగానే చర్చల ద్వారా సమస్యను పరిష్కరించాలన్న కోరిక భారత్‌కు ఉందా అన్న సందేహానికిది బలం చేకూరుస్తున్నది.

# గమ్యం లేని రాయబారం

**భా**రత్ పాకిస్తాన్‌ల వైరంలో సాధారణంగా వీరిని గానీ వారిని గానీ మెచ్చుకోవడానికేమీ ఉండదు. 'ఇద్దరూ ఇద్దరే' అనేది యాభై ఏళ్ళ వైరాన్ని క్లుప్తంగా వివరించే వ్యాఖ్య.

కానీ ఈ మధ్య పాకిస్తాన్ ప్రభుత్వం మన పాలకులపైన చేసిన ఒక విమర్శలో మాత్రం చాలా న్యాయం ఉంది. నిజానికి ఆ విమర్శ మన దేశంలోనే ఎవరో ఒకరు చేయవలసి ఉండింది కానీ ఇతర విషయాలలో ప్రభుత్వాన్ని తూర్పారబట్టడానికి సంశయించని వారు సహితం భారత్ పాకిస్తాన్ సంబంధాల విషయానికి వచ్చేసరికి మన ప్రభుత్వాన్ని ఏమైనా అంటే అది 'శత్రువుకు' (పాకిస్తాన్ మనందరికీ శత్రువయినట్టు) ఉపయోగపడుతుందని తటపటాయిస్తారు కాబట్టి ఈ విమర్శ ముషార్రఫ్ ప్రభుత్వం నోటి నుండి వినవలసి వచ్చింది.

అనిశ్చితమైన అజెండాతో గమ్యం లేని రాయబారానికి కె.సి.పంత్‌ను కేంద్ర ప్రభుత్వం 'కశ్మీర్ విషయంలో మాట్లాడదలచుకున్న వాళ్ళతో మాట్లాడి' రమ్మని నియమించిన నేపథ్యంలో, పాకిస్తాన్ విదేశాంగ శాఖ మంత్రి అబ్దుల్ సత్తార్ 'గత సంవత్సరం డిసెంబర్ 2 నాడు చర్చల గురించి మీరు చేసిన ప్రకటన ఏమయింది?' అని అడిగాడు. మన దేశం లోని పత్రికలన్నీ పంత్ రాయబారం ఒక గొప్ప నిర్ణయమని కీర్తిస్తున్న తరుణంలో ఆయన ఈ ప్రశ్న వేశాడు.

డిసెంబర్ 2 నాడు కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది అర్థవంతమైన చర్చలు చేపడతామని. ఏ మిలిటెంట్లయితే 10 సంవత్సరాలుగా 'కశ్మీర్ సమస్య'ను సాయుధ పోరాటం ద్వారా పరిష్కరించే ప్రయత్నం చేస్తున్నారో, వారితోనే చర్చలు జరపడానికి భారత ప్రభుత్వం సంసిద్ధత ప్రకటించింది. ఈ మిలిటెంట్ గ్రూపులు – విడిగానైనా ఉమ్మడిగానైనా – కశ్మీరీలందరికీ ప్రాతినిధ్యం వహిస్తాయని ఎవ్వరూ అనరు గానీ వారితో చర్చలు చేపట్టడం ద్వారా సమస్య పరిష్కారానికి నాంది పలకాలన్న నిర్ణయం అర్థవంత మయినదే. అర్థవంతమే కాదు, అనివార్యమైనది కూడా.

---

ప్రజాతంత్ర వారపత్రిక, 28-04-2001

మరి ఆ నిర్ణయం సంగతి భారత్ మరిచిపోయిందా? అని అబ్దుల్ సత్తార్ అడుగుతున్నారు. అవును, మరిచిపోయిందా? అసలు ఈ అయిదు నెలల కాలంలో ఆ నిర్ణయం అమలు ఒక్క అంగుళమైనా ముందుకు కదిలిందా?

కదలలేదని అందరికీ తెలుసును. కదలకపోవడానికి భారత ప్రభుత్వానిదే తప్ప వేరే ఎవ్వరిదీ బాధ్యత కాదు. మిలిటెంట్లతో చర్చలు ఏ రూపంలో జరిపేదీ, ఏ పరిధిలో జరిపేదీ ఒక అంగీకారానికి రావడం కోసం, మిలిటెంట్ సంస్థల మనోగతం తెలుసుకోవడం కోసం వారికి సన్నిహితులయిన హురియత్ కాన్ఫరెన్స్ ప్రతినిధి బృందాన్ని పాకిస్తాన్‌కు పంపించడానికి భారత్ నిర్ణయించింది. కానీ ఈ అయిదు నెలల కాలంలో వారికి పాకిస్తాన్‌కు పోవడానికి పాస్‌పోర్టులు సహితం ఇవ్వలేదు. అంటే తానే ప్రతిపాదించిన చర్చల ప్రక్రియను తానే మొదటి మెట్టు దగ్గరే భారత్ తుంచేసింది.

అర్థవంతమైన చర్చల ప్రక్రియను గొంతునొక్కి చంపేసి ఇప్పుడు అర్థరహితమైన పంత్ రాయబారం చేపట్టింది భారత్ ప్రభుత్వం. చర్చలకు ఎవరు సిద్ధమయితే వారందరితోనూ మాట్లాడమని పంత్‌ను పురమాయించారంట. ఇంకా నయం, శ్రీనగర్ బస్‌స్టాండ్‌లో ఎవరు కనిపిస్తే వారందరితోనూ మాట్లాడి రమ్మనలేదు.

అర్థవంతమయిన చర్చలకెప్పుడూ ఒక నిర్దిష్టమైన అజెండా ఉంటుంది. అర్థవంతమైన రాయబారానికొక నిర్దిష్టమైన గమ్యం ఉంటుంది. నువ్వు ఎక్కడికయినా పోయి ఎవరు మాట్లాడితే వాళ్ళతో మాట్లాడి రమ్మనేది ఒక చర్చల ప్రక్రియే కాదు. మిలిటెంట్ సంస్థలతో చర్చలు పెట్టుకోవడం ఒక అర్థవంతమైన ప్రక్రియ. అదే తుది పరిష్కారాన్ని ఇవ్వక పోవచ్చును గానీ దానితో మొదలుపెట్టడంలో తప్పు లేదు. అట్లాగే చర్చల్ని మిలిటెంట్ సంస్థల రాజకీయ ప్రతినిధి అయిన హురియత్ కాన్ఫరెన్స్‌తో మొదలుపెట్టవచ్చు. హురియత్ కాన్ఫరెన్స్ కశ్మీరీ ఆకాంక్షలో ఒక పాయకు మాత్రమే ప్రతినిధి అయినప్పటికీ వారి ప్రభావం స్వల్పం కాదు కాబట్టి చర్చలు వారితో ప్రారంభించడంలో తప్పు లేదు. లేదా, కశ్మీర్ అసెంబ్లీలోనే చర్చను ప్రవేశపెట్టడం ద్వారా సమస్యను పరిష్కరించే ప్రక్రియను మొదలుపెట్టి ఉండవచ్చును. ఈ అసెంబ్లీని ఎన్నుకున్న ఎన్నికలలో ఎన్ని అక్రమాలయినా జరిగి ఉండనీయండిగాక, ఎన్నుకోబడ్డ వాళ్ళు ప్రజలలో అంతో ఇంతో పలుకుబడి, సపోర్టు ఉన్నవారే. అసెంబ్లీలో చర్చలు మొదలుపెట్టడం కూడా అర్థవంతమైన ప్రక్రియే.

వీటిలో ఒక మార్గాన్ని భారత్ ఎంచుకున్నట్టు ప్రకటించింది. తన అవగాహనలో మిలిటెంట్ల తుపాకులతోనే 'సమస్య' పుట్టింది కాబట్టి ఆ మిలిటెంట్ సంస్థలతోనే నేరుగా మాట్లాడతానని ప్రకటించింది. కానీ అందుకు మొదటి మెట్టుగా వారితో సంప్రదింపులు జరపడానికి పాకిస్తాన్‌కు పంపాలని నిర్ణయించిన హురియత్ కాన్ఫరెన్స్ ప్రతినిధి బృందానికి అయిదు నెలలు గడిచినా పాస్‌పోర్టులు ఇవ్వదు. పైగా మిలిటెంట్లతో సంప్రదింపులు

జరపడానికి వెళ్ళే హురియత్ కాన్ఫరెన్స్ ప్రతినిధి బృందంలో ఎవరుండాలో తాను నిర్ణయిస్తానంటుంది. హేతుబద్ధంగా ఆలోచించినట్టయితే, పాకిస్తాన్‌లో ఉన్న మిలిటెంట్ సంస్థలు హురియత్ కాన్ఫరెన్స్‌లో ఎవరిని ఎక్కువ విశ్వసిస్తాయో వారు ఆ ప్రతినిధి బృందంలో ఉండడం అవసరం. ఇండియా ఆ వ్యక్తులను ఇష్టపడనక్కరలేదు. అటువంటప్పుడు, పాకిస్తాన్‌లో స్థావరం ఏర్పరచుకున్న మతవాద మిలిటెంట్ సంస్థలకు అత్యంత సన్నిహితుడైన సయ్యద్ ఆలీషా గిలానీని పోవద్దనడం బొత్తిగా అర్థంలేని విషయం. లష్కర్–ఇ–తొయిబాను మతవాద మూర్ఖుల సంస్థ అని నిందించే యాసిన్ మాలిక్ ఆ బృందంలో ఉండి ప్రయోజనమేముంటుంది?

అయిదు నెలలు పాస్‌పోర్టు ప్రహసనాన్ని నడిపి, ఇప్పుడు ఒక కొత్త మార్గం దొరికినట్టు కె.సి. పంత్‌గారిని 'చర్చించడానికి సిద్ధంగా ఉన్న వారందరితోనూ చర్చించి రమ్మ'ని పంపించారు. 'పాత నిర్ణయం ఏమయింది?' అని పాకిస్తాన్ ప్రభుత్వం అడిగిందంటే అడగదా మరి! ఆ ప్రశ్న మనమే అడగవలసింది.

హురియత్ కాన్ఫరెన్స్ నేతలిప్పటికే పంత్ రాయబారం తమ దృష్టిలో ఒక అక్కరకు రాని ప్రయోగం అని ప్రకటించారు. అతనితో మాట్లాడబోమన్నారు. వాళ్ళు నిజానికి తమ రాజకీయ భావాలు చెప్పుకోవడానికి వెనకాడే బాపతు మనుషులు కారు. కశ్మీర్‌కు ఎవరు పోయినా గంటల తరబడి తమ దృక్పథాన్ని వివరించి చెప్తుంటారు. వారిలో వారికి అభిప్రాయభేదాలున్నాయి కాబట్టి ఎవరికి వారు విడిగా వివరంగా మాట్లాడతారు. అటు వంటి వారు కె.సి. పంత్‌తో మాట్లాడడానికి నిరాకరిస్తున్నారంటే, అయిదు నెలలుగా పాస్‌పోర్టులను అడ్డం పెట్టుకుని భారత్ ఆడుతున్న ప్రహసనం పట్ల తమ నిరసన తెలుపుతున్నారని అర్థం చేసుకోవడం సబబుగా ఉంటుంది.

మనం భారత పౌరులుగా అడగవలసిన ప్రశ్న ఏమిటంటే: భారత ప్రభుత్వానికి అసలు 'కశ్మీర్ సమస్య'ను రాజకీయంగా పరిష్కరించే ఉద్దేశం ఉందా? లేకపోతే 'అంతర్జాతీయ అభిప్రాయం' అని పిలువబడే అమెరికా ఒత్తిడికి లొంగి ఆచరించే ఉద్దేశం లేని రాజకీయ ప్రక్రియలను ఇప్పుడొకటీ అప్పుడొకటీ ప్రకటిస్తూ సైనికంగానే సమస్యను పరిష్కరించాలన్నది భారత్ మనోగతమా?

# కశ్మీర్ గురించి మనమైనా సత్యం మాట్లాడుదాం...

ఆగ్రా చర్చలు విఫలం కాగానే, వీళ్ళిప్పుడు తప్పు ఎవరిమీద పెడతారా అని కొంచెం ఉత్కంఠతో ఎదురు చూశామనే చెప్పాలి.

ఏవేవో ఊహించాము గానీ ముషార్రఫ్ ఉపహార ప్రెస్ మీట్‌ను టీవీ తెరమీదికి అప్పటికప్పుడు (లైవ్) ఎక్కించడమే అనర్థానికి దారి తీసిందని తేల్చబోతారని మాత్రం ఊహించలేదు.

దాని బదులు రాహుకాలంలో కూర్చున్నామని అని వుంటే మరీ అంత ఆశ్చర్యం కలిగి ఉండేది కాదు.

శిఖరాగ్ర చర్చలకు కూర్చునే ముందు ఆ చర్చలలో ప్రస్తావనకు రాగల విషయాల గురించి బయట మాట్లాడొద్దన్న నియమాన్ని మనమైనా, వారైనా ఒక్క రోజయినా పాటించడం జరిగిందా? మే 23న వాజ్‌పేయి ముషార్రఫ్‌కు ఆహ్వానం పంపిన నాటి నుండి ఇరుదేశాల ప్రముఖులూ ప్రతి నిత్యం ప్రపంచానికంతా వినిపించేటట్టు నోరు పారేసుకుంటూనే ఉన్నారు.

'కశ్మీర్ గురించి మాట్లాడడానికి పోతున్నాను తప్ప నాకు ఇండియాలో వేరే పనేముంది?' అని ముషార్రఫ్ ప్రకటించాడు. 'ఆజాద్ కశ్మీర్ మాకెప్పుడిచ్చేస్తావని అడగడం తప్ప కశ్మీర్ గురించి వేరే మాట్లాడేదేమీ లేదు' అని జస్వంత్‌సింగ్ అన్నాడు. 'అమెరికా ఒత్తిడి వల్ల ఇండియా నన్ను పిలిచింది' అని ముషార్రఫ్ అనగా అతని వ్యాఖ్య బాధ్యతారహితమని మనవాళ్ళు అన్నారు. 'కశ్మీర్‌ను ఒక వివాదంగా భారత్ ఒప్పుకున్నట్టే'నని ముషార్రఫ్ అనగా 'సీమాంతర ఉగ్రవాదం గురించి నీతో మాట్లాడాలని రమ్మన్నామే తప్ప మేము ఏ వివాదాన్నీ అంగీకరించనిదే!' అని మనవాళ్ళన్నారు. హోంమంత్రి అద్వానీ మధ్యలో ఈ వూరు ఆ వూరు తిరుగుతూ 'ఆగ్రా చర్చల నుండి మరీ ఎక్కువ ఆశించవద్దు' అని ఎవరినో హెచ్చరిస్తూ ఉన్నాడు.

ఇదంతా చిన్న తెరమీదికి నిత్యం ఎక్కింది. ఈ ప్రవచనాలను చిన్న తెరపైన దర్శనమిచ్చే విశ్లేషకులూ వ్యాఖ్యాతలూ ఒకటికి నాలుగుసార్లు ముందుకూ వెనక్కీ తిప్పి

---

ప్రజాతంత్ర వారపత్రిక, 05-08-2001

చూసి వ్యాఖ్యానించారు. ఆ వ్యాఖ్యానాల వెనక లోతయిన అర్థాలను, 'హిడెన్ అజెండా'లను చూశారు.

ఇంత జరిగిన తరువాత ఆగ్రాలో ముషార్రఫ్ మాట్లాడిన నాలుగు మాటలే నష్టం చేశాయా? చర్చలకు ముందు మాట్లాడి మాట్లాడి చర్చలు సాధ్యం కాకుండా చేసుకున్నారు. ఇప్పుడు మళ్ళీ మాట్లాడి మాట్లాడి ఈసారి చర్చలకు కూర్చోవడమే అసాధ్యం చేసుకుంటున్నారు. మధ్యలో ముషార్రఫ్ పత్రికా సంపాదకులతో చెప్పిన నాలుగు విషయాలు చర్చలకు ముందు ప్రసారం కావడమే నష్టం చేసిందా?

ముషార్రఫ్ మాట్లాడాడని కాదు, అతని మాటలకు మన వాళ్ళ దగ్గర జవాబు లేదని ఉక్రోషం. యాభై ఏళ్ళుగా భారత పాకిస్తాన్‌లది కశ్మీర్ విషయంలో తప్పుడు వైఖరే. అయితే తన తప్పుడు వైఖరిని సహేతుకమైన వ్యాఖ్యల ద్వారా వ్యక్తం చేయగల స్థితిలో పాకిస్తాన్ అధినేత ఉన్నాడు. మనవాళ్ళు ఆ స్థితిలో లేరని కడుపుమంట.

ముషార్రఫ్ మూడేమూడు విషయాలు చెప్తున్నాడు. భారతదేశంలో జమ్మూకశ్మీర్ విలీనం వివాదాంశం. ఆ వివాదం కశ్మీరీల మనోభీష్టం ప్రకారం పరిష్కారం కావాలి. ఇది పరిష్కారమైతే ఇక భారత్ పాకిస్తాన్‌ల మధ్య వేరే పెద్ద సమస్యలేవీ లేవు కాబట్టి దీని మీదనే చర్చలు ప్రధానంగా దృష్టిపెట్టాలి.

వీటికి మనవాళ్ళ దగ్గరున్న జవాబేమిటి? కశ్మీర్ విషయంలో వివాదమేదీ లేదనేది మొదటిది. వివాదం ఉంది మొర్రో అంటూ కశ్మీరీలే అంటున్నా, ఊరికే అనడమేకాక 45 లక్షల కశ్మీరీలలో 40 వేలమంది (అధికార లెక్కల ప్రకారమే) ఆ వివాదం పరిష్కారం కోసం గడచిన దశాబ్దం కాలంలో ప్రాణాలు అర్పించినా ఇంకా వివాదమేదీ లేదంటే ఎవరు నమ్మాలి?

వివాదమే లేదు కాబట్టి ఇంక కశ్మీరీల మనోభీష్టమెక్కడిది? కశ్మీరీలు 1956లోనే జమ్మూకశ్మీర్ శాశ్వతంగా భారత్‌లో భాగమని తమ రాష్ట్ర రాజ్యాంగంలోనే రాసేసుకోలేదా? ఆ తరువాత ప్రతీ ఎన్నికలోనూ పాల్గొని తమ అభీష్టాన్ని భారత్ వైపు వ్యక్తం చేయడం లేదా అనేది రెండవ విషయానికి మన పాలకుల జవాబు. జమ్మూకశ్మీర్ రాష్ట్ర రాజ్యాంగం భారత్‌కు అనుకూలంగా తయారుకావడం కోసమే షేక్ అబ్దుల్లాను 1953లో అరెస్ట్ చేసి ఏ నేర అభియోగమూ లేకుండా 15 సంవత్సరాలకు పైగా జైలులో పెట్టారనీ, ఆ తరువాత ఏ ఒక్క ఎన్నికా కశ్మీర్‌లో ప్రజాస్వామికంగా జరగలేదనీ జ్ఞాపకం చేసుకుంటే ఈ జవాబు విలువేమిటో అర్థమవుతుంది. అయినా వారి భూభాగం భవిష్యత్తు గురించి జరిగే చర్చకు ఆ ప్రజల మనోభీష్టమే ప్రమాణమనేది కనీస ప్రజాస్వామిక స్పృహ ఉన్న వారెవరయినా ఒప్పుకోక తప్పని విషయం.

మూడవ అభిప్రాయానికి మన దగ్గర ఏ జవాబూ లేదు. వర్తక వ్యాపారాల విషయంలో గానీ నదీ జలాల విషయంలో గానీ ఈ రెండు దేశాల మధ్య తీవ్రమైన వివాదాలేవీ లేవు. కశ్మీర్ ఒక్కటే తీవ్రమైనది. మిగిలిన చిన్న చిన్న విషయాలలో ఒప్పందం కుదరక పోవడానికి కశ్మీర్ కారణంగా నెలకొన్న ద్వేషభావమే కారణం. కాబట్టి దాని గురించి మాట్లాడుకోవడమే సబబు.

భారత ప్రజలకు ఈ సంగతి తెలియకుండ భారత ప్రభుత్వమూ ప్రసార సాధనాలూ జాగ్రత్తపడి ఉండవచ్చు గానీ మన పాలకులకు మాత్రం ఈ విషయాలు బాగానే తెలుసు. ముషార్రఫ్ అడిగిన ప్రశ్నలకు తమ దగ్గర జవాబులు లేవనీ తెలుసు. ఆ సంగతి అతని సంభాషణను టీవీలో చూసిన వారందరూ గ్రహించి ఉంటారని కూడా తెలుసు. అందుకే అంత ఉక్రోషం. వాజ్‌పేయి కూడా ముషార్రఫ్‌లాగ భారత్ వైఖరిని ప్రపంచం ముందు ఉంచకపోవడం 'మీడియా మేనేజ్‌మెంట్'లో మనవాళ్ళ వైఫల్యం అని అంటున్నారు. వైఫల్యం లేదు వల్లకాడూ లేదు. మనవాళ్ళ వైఖరి సహేతుకంగా వివరించగలిగినది కాదు కాబట్టి దానిని దాచిపెట్టుకున్నారు తప్ప వేరే కారణమేదీ లేదు.

దీని వల్ల జరుగుతున్న ఒక నష్టమేమిటంటే పైన చెప్పిన మేరకు పాకిస్తాన్ వైఖరి సహేతుకమే అయినప్పటికీ కొంచెం లోతుగా పోయి చూస్తే వారి వైఖరిలోనూ ప్రశ్నించవలసినవి చాలా ఉన్నాయని మనం అనలేకపోవడం. 'కశ్మీర్ వివాదం' స్వభావం ఏమిటి? ఆ రాష్ట్రం భారత్‌లో విలీనం కావడాన్ని పాకిస్తాన్ అంగీకరించకపోవడం వల్ల వివాదం వచ్చిందా, లేక కశ్మీరీ ప్రజల సమ్మతి పొందకపోవడం వల్ల వచ్చిందా? ఈ విషయాన్ని పాకిస్తాన్ స్పష్టం చేయదు.

కశ్మీరీ ప్రజల మనోభీష్టం ప్రకారం సమస్య పరిష్కారం కావాలన్నది పూర్తిగా సబబే కానీ ఆ మనోభీష్టానికి పాకిస్తాన్ అనుమతించే స్వేచ్ఛ ఏమిటి? ఇండియాలో చేరాలా లేక పాకిస్తాన్‌లో చేరాలా అని నిర్ణయించుకునే స్వేచ్ఛా లేక ఈ రెండు దేశాలనూ కాదని స్వతంత్ర దేశంగా ఉండాలని కోరుకునే స్వేచ్ఛా? ఈ 'మూడవ ప్రత్యామ్నాయాన్ని' పాకిస్తాన్ ఎప్పుడూ ఒప్పుకోలేదు. మనం రెండవ ప్రత్యామ్నాయాన్ని సహితం ఒప్పుకోము. కాబట్టి కశ్మీరీలలో మెజారిటీ మూడవ ప్రత్యామ్నాయాన్నే కోరుకుంటున్నారని చెప్పడానికి మనకు నోరు లేదు. కశ్మీరీల ప్రతినిధులెవ్వరినీ చర్చలలో పాల్గొననివ్వమని మనవాళ్ళు మూర్ఖంగా పట్టుబట్టడం వల్ల, పాకిస్తాన్ రెండవ ప్రత్యామ్నాయాన్ని కోరుకునే హురియత్ నేతలనే కశ్మీరీ ప్రజల ఏకైక ప్రతినిధులుగా చూస్తుంది తప్ప మూడవ ప్రత్యామ్నాయాన్ని కోరుకునే వారి ప్రాతినిధ్యాన్ని గురించి మాట్లాడదన్న విషయాన్ని ఎత్తి చూపడానికి కూడా మనవాళ్ళకు నోరు లేదు.

ఒకనాడు బంగ్లాదేశ్‌లో భారత్ ముక్తి బాహినికి సహాయం అందిచ్చినట్టే కశ్మీర్ పోరాటకారులకు తాము అందిస్తున్నామని పాకిస్తాన్ అనడం సబబేనని మనవాళ్ళు ఒప్పుకోరు కాబట్టి, ఆ పోరాటకారులు అదుపుతప్పి సాధారణ పౌరులనూ యాత్రికులనూ చంపినప్పుడు పాకిస్తాన్ ఏం చేస్తున్నదని నిలదీయలేరు. అంతా 'సీమాంతర ఉగ్రవాదమే' అయినప్పుడు సాధారణ పౌరులను చంపడానికీ, భారత సైనికులను చంపడానికీ మధ్య తేడా ఏముంటుంది? భారత ప్రభుత్వం ఎటూ వాస్తవిక ధోరణి అవలంబించలేదు. కానీ పౌరులమయిన మనమైనా అవలంబించలేమా? భారత్ పాకిస్తాన్‌ల గట్టు తగాదాగా కాక కశ్మీరీల జాతీయ ఆకాంక్షగా 'కశ్మీర్ వివాదాన్ని' చూడలేమా? దానిని భారత్ గుడ్డిగా చూడ నిరాకరిస్తున్న వైనాన్ని, పాకిస్తాన్ పాక్షికంగా వ్యాఖ్యానిస్తున్న వైనాన్ని విమర్శించలేమా?

# నిర్బంధం తగ్గనిదే పరిష్కారం సాధ్యమా?

'కశ్మీర్ సమస్య కశ్మీరీల మనోభీష్టాన్ని అనుసరించి పరిష్కారం కావాలి' అని పాకిస్తాన్ అంటుంది. ఈ అభిప్రాయాన్ని కాదనడం భారత్‌కు సాధ్యం కాదు కాబట్టి ఇష్టమున్నా లేకున్నా అవునంటుంది. అయితే ఆ మనోభీష్టం 1956లో జమ్మూకశ్మీర్ రాష్ట్ర రాజ్యాంగం రాసినప్పుడే వ్యక్తమయిందనీ ఆ తరువాత ఎన్నికలలో వోట్లు వేసినప్పుడు పునర్వ్యక్తమయిందనీ ఇప్పుడింక వ్యక్తం కావలసిందేమీ లేదనీ అంటుంది. అందువల్ల నిజానికి 'కశ్మీర్ సమస్య' అనేదేదీ లేదనీ 'సీమాంతర ఉగ్రవాదం' సమస్య మాత్రమే ఉందనీ కూడా అంటుంది.

నిజానికి ఆనాడయినా ఈనాడయినా కశ్మీరీల మనోభీష్టం వక్తమయ్యే పరిస్థితి అక్కడ లేదు. 1953లో షేక్ అబ్దుల్లాను మన పాలకులు మొదటిసారి అరెస్టు చేసినప్పటి నుండీ 'కశ్మీర్ భారత్‌లో అంతర్భాగమే'నన్న అభిప్రాయానికి తప్ప వేరే అభిప్రాయానికి కశ్మీర్‌లో స్వేచ్ఛ లేదు. షేక్ అబ్దుల్లానూ అతనితో ఏకీభవించే వారినీ జైలులోపెట్టి 1956లో బక్షీగులాం మహమ్మద్ నాయకత్వంలోని కశ్మీర్ రాజ్యాంగ సభ చేత 'జమ్మూకశ్మీర్ రాష్ట్రం ఇండియాలో విడదీయరాని భాగం' అని భారత పాలకులు రాయించారు. షేక్ అబ్దుల్లా ఆ అభిప్రాయానికి తల ఒగ్గేదాకా అతనికి స్వేచ్ఛ ఇవ్వలేదు. ఆ అభిప్రాయానికి తలవొగ్గని వారికి కశ్మీర్‌లో ఎన్నికలలో పోటీచేసే అవకాశమెప్పుడూ ఉండలేదు. 'ఆజాద్ కశ్మీర్'కూ, 'ఇండియాలో విడదీయరాని భాగమైన కశ్మీర్'కూ తేడా ఏమిటంటే కశ్మీర్ పాకిస్తాన్‌లో విడదీయరాని భాగం అని ఒప్పుకునే వారికి మాత్రమే ఆజాద్ కశ్మీర్‌లో ఎన్నికలలో పోటీచేసే హక్కు ఉందని వారి రాజ్యాంగమే అంటుంది. మన వాళ్ళు రాజ్యాంగంలో అట్లా రాయలేదు గానీ కశ్మీర్ ఇండియాలో శాశ్వతంగా అంతర్భాగమని ఒప్పుకోని వారి నామినేషన్లు ఏదో ఒక సాకు చూపించి తిరస్కరించడం కశ్మీర్‌లో మొదటి ఎన్నిక నుండి 1987లో జరిగిన చివరి (ఇప్పటిదాకా) ఎన్నికల దాకా నడిచిన ప్రహసనమే.

---

ఉద్యమం మాసపత్రిక, ఏప్రిల్ – సెప్టెంబర్ 2001

కాబట్టి ఒకప్పుడు కశ్మీరీలు తమ మనోభీష్టాన్ని వ్యక్తం చేశారనడానికి ఆస్కారం లేదు.

ఇప్పుడు వారి అభీష్టాన్ని వారు వ్యక్తం చేయాలని అనుకున్నా దానికి అనుకూలమైన పరిస్థితి అసలే లేదు. కశ్మీర్ ఒక బహిరంగ జైలు అంటే అతిశయోక్తి కాదు. కశ్మీర్‌లో నలుమూలలా సైన్యం ఉంది. కంటోన్మెంట్లలో మాత్రమే కాదు, గ్రామాలలో ఆపిల్ తోటలలోనూ, డ్రైఫ్రూట్స్ తోటలలోనూ సైన్యం క్యాంపులు నెలకొల్పింది. వాళ్ళ కన్నుగప్పి బతకడం కశ్మీరీలకు ఒక్క క్షణం కూడా సాధ్యం కాదు.

ఆ కన్ను చూసి ఊరుకోదు, చూస్తూ ఊరుకోదు. కశ్మీర్‌లో సైన్యం ప్రతి క్షణం కదులుతూ ఉంటుంది. పెట్రోలింగ్ చేస్తూ ఉంటుంది. సైన్యం ట్రక్కులు విపరీతమైన వేగంతో ప్రధాన రహదార్ల మీద తిరుగుతుంటాయి. గ్రామీణ రహదార్ల మీద ఆటోమేటిక్ తుపాకులు పట్టుకున్న జవాన్లు కాలినడకన గుంపులుగా తిరుగుతుంటారు.

ఏ రోజయినా ఏ గ్రామంలోనైనా సోదా జరగవచ్చు. సోదాకు వచ్చే సైనికులు చిన్న సంఖ్యలో ఎప్పుడూ రారు. పెద్ద సంఖ్యలో వచ్చి గ్రామాన్ని చుట్టుముడతారు. మగ వాళ్ళందరినీ ఇళ్ళ నుండి బయటకు రమ్మంటారు. మొదట్లో మగవాళ్ళు బయటికొచ్చి స్త్రీలు ఇళ్ళలో ఉండేవారు. అప్పుడు సైనికులు ఇళ్ళలోకి ప్రవేశించి మిలిటెంట్ల కోసం, ఆయుధాల కోసం, పేలుడు పదార్థాల కోసం సోదా చేసే క్రమంలో స్త్రీలను బలాత్కారం చేయడం, అవమానపరచడం తరచుగా జరిగేది. అందువల్ల ఇప్పుడు మగవాళ్ళను బయటికి రమ్మంటే వారితోపాటు స్త్రీలు కూడా బయటికొచ్చేస్తున్నారు. బయటకు రావడం అంటే ఊరికే ఇంటి బయట నిలబడటం కాదు. అందరూ ఒకచోట గుమిగూడి దొడ్డికి కూర్చున్నట్టు కూర్చొని తల మోకాళ్ళ మధ్య పెట్టుకొని కళ్ళు దించుకొని సోదా ముగింపు కోసం నిరీక్షించాలి.

ఏదైనా ఇంట్లో మిలిటెంట్లున్నారని తెలిస్తే ఇంక వారిని చంపడం కోసం సైన్యం ఆ యింటిని తగలబెట్టడానికైనా, పేల్చివేయడానికైనా వెనుకాడదు. ఆ విధంగా కాలిపోయిన, పేలిపోయిన ఇళ్ళు కశ్మీర్‌లో ఎటుపోయినా కనిపిస్తాయి.

సోదా చేసే క్రమంలో ఎవరిమీదైనా అనుమానం వస్తే సైన్యం వారిని అదుపులోకి తీసుకొని తన క్యాంపుకు తీసుకుపోతుంది. పోలీసు లాకప్పులు మాత్రమే తెలిసిన వారికి సైనిక క్యాంపులోని పరిస్థితి ఊహకు అందడం కూడా కష్టం. నాలుగైదు రోజుల అక్రమ నిర్బంధం పోలీసు కస్టడీలో ఎంత మామూలు విషయమో, నాలుగైదు వారాల నిర్బంధం సైన్యం క్యాంపులలో అంత మామూలు విషయం. అక్కడి నుండి శవాలుగా మారి 'ఎన్‌కౌంటర్' మృతులుగా బయటికొచ్చేవారు కొందరైతే, అసలే కనబడకుండా పోయేవారు చాలామంది ఉన్నారు. 9 సంవత్సరాల పసిబాలుర నుండి 70 సంవత్సరాల వృద్ధుల దాకా మొత్తం 4000 మంది సైన్యం కస్టడీ నుండి 'అదృశ్యం' అయ్యారని అసోసియేషన్

ఆఫ్ పేరెంట్స్ ఆఫ్ డిసపియర్డ్ పర్సన్స్ (ఎ.పి.డి.పి) అధ్యక్షురాలు పర్వీనా అహంగర్ అంటారు. అందులో 500 మంది గురించి ఆమె దగ్గర పూర్తి వివరాలు ఉన్నాయి.

చిత్రహింసల మోతాదు కూడా పోలీసు లాకప్పులతో పోలిస్తే అక్కడ చాలా ఎక్కువ. పోలీసులు ప్రయోగించే అణచివేత దేశభక్తితో ముడిపడిన 'ధర్మం' కాదు. శాంతిభద్రతలతో ముడిపడినది మాత్రమే. అందువల్ల పోలీసులు ప్రయోగించే హింసను సమర్థించేవాళ్ళూ ఉంటారు, వ్యతిరేకించేవాళ్ళూ ఉంటారు. సైన్యం చర్యలను ఆవరించినంత బలంగా పోలీసుల చర్యలను ఆ భావజాలం ఆవరించి ఉండదు.

పైగా, కశ్మీర్‌లో సైన్యానికిచ్చే తర్ఫీదు వారిలో క్రూరత్వాన్ని పెంచే స్వభావం గలది. కశ్మీరీలందరూ దేశద్రోహులు, పాకిస్తాన్ ఏజెంట్లు, ముస్లిం మతోన్మాదులు అనేది వారికిచ్చే తర్ఫీదు. దానితో వారు మరింత క్రూరంగా ప్రవర్తిస్తారు. 'నీ కొడుకు మిలిటెంటా? అయితే నువ్విక్కడ ఎందుకున్నావు? పాకిస్తాన్‌కు పో' అని మిలిటెంట్ల తల్లిదండ్రులను తిడుతుంటారు. వాళ్ళు పాకిస్తాన్‌కు ఎందుకు పోవాలి? వాళ్ళ కొడుకు మిలిటెంటయింది పాకిస్తాన్ కోసం కాదు. కశ్మీర్ కోసం. కశ్మీర్‌లో ఉండకుండా వాళ్ళు పాకిస్తాన్‌కు ఎందుకు పోవాలి? ఈ మాత్రం ఆలోచన సైన్యానికి రావడం లేదంటే వారికిచ్చే ట్రైనింగ్ అట్లాంటిది.

అక్కడి ప్రజలంటే సైన్యానికి ఏ మాత్రం సానుభూతి లేకపోవడం వల్ల వాళ్ళపట్ల మరింత క్రూరంగా ఉండగలుగుతోంది. మిలిటెంట్లు ఒక పేలుడు పదార్థాన్ని ఆర్మీ క్యాంపు సమీపంలో వదిలిపెట్టి పోతే, దానిని తన సైనిక నిపుణుల చేత 'డిఫ్యూజ్' చేయించే బదులు స్థానిక ప్రజలను పిలిచి వారిచేత దానిని తీసేయించే ప్రయత్నం చేయడం, అది పేలి వారు చావడం కశ్మీర్‌లో చాలాసార్లు జరిగింది.

ఈ రకమైన వాతావరణంలో, కశ్మీరీల అభీష్టం ప్రకారమే 'కాశ్మీరు సమస్య' పరిష్కారం కావాలి అని ఒకవేళ భారత్ ఒప్పుకున్నా ఆ అభీష్టం ఒక రూపం తీసుకునేదెట్లా? నిర్భయంగా ప్రజలు చర్చించుకునే వాతావరణం, సంవాదం పెట్టుకునే వాతావరణం లేనప్పుడు 'ప్రజాభీష్టం' ఏమిటో ఎవరు చెప్పగలరు? కశ్మీర్ పాకిస్తాన్‌లో కలవాలని నమ్మేవాళ్ళూ ఉన్నారు. స్వతంత్రంగా ఉండాలని నమ్మేవాళ్ళూ ఉన్నారు. ఇండియాలోనే ఉండిపోవాలనే వాళ్ళూ ఉన్నారు. అలాగే ఒకప్పటి జమ్మూకశ్మీర్ రాష్ట్రమంతా ఒకటిగా ఉండాలని కోరుకునే వాళ్ళున్నారు. ఇటు కశ్మీర్ లోయ, అటు ఆజాద్ కశ్మీర్‌లోని ముజఫరాబాద్ డివిజన్ కలిసి ఒకటిగా ఉన్నట్టయితే తక్కిన భూభాగం ఏమయినా ఫరవా లేదనుకునే వారున్నారు. కేవలం భారత్‌లోని కశ్మీర్ లోయ గురించి ఆలోచించే వారున్నారు. కశ్మీర్ అనే భావనలో కశ్మీరీ హిందువులూ సిక్కులూ కూడా భాగమేనని నమ్మేవారున్నారు. ఆ పట్టింపు లేనివారున్నారు. ఇన్నిరకాల దృష్టికోణాలున్నప్పుడు వాటి మధ్య చర్చ, సంవాదం జరిగే అవకాశం లేనట్లయితే 'ప్రజాభీష్టం' అనేదొక రూపం తీసుకునే అవకాశం ఉంటుందా?

అందుకే గత సంవత్సరం నవంబర్ నెలలో భారత్ ప్రకటించిన కాల్పుల విరమణ పట్ల కశ్మీరీలు హర్షం వ్యక్తం చేశారు. మిలిటెంట్ సంస్థలలో ముఖ్యమైనదయిన లష్కర్– ఇ–తొయిబా కాల్పుల విరమణను వెంటనే తిరస్కరించింది గానీ సగటు కశ్మీరీలు – 'ఆజాదీ' కోరుకునేవారు కూడా – దానిని ఆహ్వానించారు. లష్కర్ తన తిరస్కరణ వల్ల భారత ప్రభుత్వంలోని సంఘ్ పరివార్ తీవ్రవాదులకు కాల్పుల విరమణను వెనక్కి తీసుకునే అవకాశం కల్పించిందని బాధపడే వారు చాలామంది కశ్మీర్‌లో ఉన్నారు.

లష్కర్ ఏ పరిస్థితిలోనైనా తిరస్కరించేదేమో – ఎందుకంటే వారి అజెండా కశ్మీరీ జాతీయవాద అజెండా కాదు, ఇస్లామిక్ 'జిహాదీ' అజెండా. అయితే నవంబర్ నాటి కాల్పుల విరమణను తిరస్కరించడానికి కశ్మీరీ జాతీయవాదులకు సహితం సహేతుక మయిన కారణం ఒకటి లేకపోలేదు. కాల్పుల విరమణ ఒక రాజకీయ పరిష్కారంలో అంతర్భాగమయినట్టయితే దానికి అర్థం ఉంటుంది గానీ రాజకీయ పరిష్కారంతో నిమిత్తం లేని కాల్పుల విరమణతో కశ్మీరీలు సహకరించడమంటే తమ పోరాటాన్ని వదులుకొని కశ్మీర్‌పైన భారత్ తన పాలనాధికారాన్ని పటిష్టం చేసుకోవడానికి అవకాశం ఇవ్వడమే అవుతుంది. అది కశ్మీరీలెవ్వరికీ ఇష్టంలేదు.

అందువల్లనే లష్కర్–ఇ–తోయిబా వైఖరిపట్ల కశ్మీరీలలో కొంత అసంతృప్తి ఉన్నా, తప్పు ప్రధానంగా భారత్‌దేనని వాళ్ళు సహేతుకంగానే భావిస్తారు. భారత్ ఇప్పటి దాకా కశ్మీర్ ఒక 'వివాదం' అని ఒప్పుకోదు. ఆ వివాదం పరిష్కారం కశ్మీరీల అభీష్టం ప్రకారం జరగాలని ఒప్పుకోదు. ఇవన్నీ ఒప్పుకోకుండా 'నేనూ కాల్పులు విరమిస్తాను, మీరూ విరమించండి' అంటే అర్థం ఏమిటి? శాంతి నెలకొల్పి భారత్ పాలనాధికారాన్ని కశ్మీర్‌పైన స్థిరపరచుకోవడమే దాని లక్ష్యమని కశ్మీరీలు ఎందుకు అనుమానించకూడదు?

అందువల్ల కశ్మీర్ వివాదాన్ని భారత్ ఒక చారిత్రక వివాదంగా ముందు గుర్తించాలి. అది ప్రజల అభీష్టం ప్రకారం పరిష్కారం కావాలని గుర్తించాలి. ఆ అభీష్టం ఇప్పటికే వ్యక్తమయిందని అనడం అబద్ధమని ఒప్పుకోవాలి. ఇప్పుడు ఈ గుర్తింపు ప్రాతిపదిక పైన నిజమైన రాజకీయ పరిష్కారం కోసం ప్రయత్నాలు మొదలుపెట్టి అందులో అంతర్భాగంగా శాంతి నెలకొల్పే కృషిచేయాలి. ఆ రకమైన కాల్పుల విరమణకు కశ్మీరీలు స్పందించడమే కాక లష్కర్–ఇ–తోయిబా వంటి సంస్థల పైన ఒత్తిడి తెచ్చి వారి సహకారం పొందడానికి కూడా ప్రయత్నం చేస్తారు. ఎందుకంటే అది అందరి కంటే ఎక్కువగా వారి అవసరమే కాబట్టి.

# గుజరాత్‌ను కశ్మీర్‌తో పోల్చడం సబబేనా?

**క**శ్మీర్‌కు చెందిన కొన్ని లక్షల మంది హిందువులు శరణార్థుల శిబిరాలలో ఉండగా ఎన్నికలు జరపడానికి సిద్ధపడిన ఎన్నికల కమిషన్, అది సబబేనంటున్న సెక్యులర్ పార్టీలు గుజరాత్ విషయానికొచ్చేసరికి అక్కడ ముస్లింలు చాలామంది ఇంకా శరణార్థులుగా ఉండగానే ఎన్నికలు జరపడమేమిటని ప్రశ్నించడం ద్వంద్వ ప్రమాణాలకు పరాకాష్ఠ అంటూ వెంకయ్యనాయుడు, అరుణ్ జైట్లీ వంటివారు దబాయించడం కొన్ని రోజులుగా చూస్తున్నాం.

పైకి చూడడానికి అది న్యాయమైన అభ్యంతరంగానే కనిపిస్తుంది. లౌకికవాదుల ఈ ద్వంద్వ ప్రమాణం కుహనా లౌకిక వాదానికి తాజా ఉదాహరణగా కూడా కనిపిస్తుంది.

కానీ కొంచెం జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ రెండు సందర్భాలకూ పోలికే లేదని అర్థం అవుతుంది.

కశ్మీర్‌లో హిందువులు శరణార్థులు కావడానికి ప్రభుత్వం కారణం కాదు. గుజరాత్‌లో ప్రభుత్వమే హంతకులతో చేతులు కలిపి ముస్లింలను క్యాంపులపాలు చేసింది.

కశ్మీర్‌లో ఎన్నికలు జరపాలన్న నిర్ణయం మత విద్వేషాన్ని వాడుకొని ప్రయోజనం పొందాలనే ఉద్దేశంతో తీసుకున్న నిర్ణయం కాదు. కశ్మీర్ అసెంబ్లీ గడువు తీరిపోయింది కాబట్టి అక్కడ ఎన్నికలు జరుపుతున్నారు. గుజరాత్‌లో ఎన్నికలు సహజంగా వచ్చినవి కావు. ముస్లింల ఊచకోత వల్ల గుజరాతీ సమాజంలో హిందూత్వ వాదానికి పెరిగిన గిరాకీ కరువు కారణంగానో, వేరే ఏ కారణంగానో చల్లారిపోయే లోపల దానిని వోట్లుగా మారకం చేసుకోవాలన్న దుర్మార్గమైన ఆరాటం అక్కడ ఎన్నికలు గడువు కంటే ముందే రావడానికి కారణం.

కశ్మీర్‌లోని హిందూ శరణార్థులను తిరిగి తమ గ్రామాలకు పంపించడం ఆ రాష్ట్ర ప్రభుత్వం తలచుకున్నంత మాత్రాన జరిగిపోయేది కాదు. బహుశా 'కశ్మీర్ సమస్య'

---

ప్రజాతంత్ర వారపత్రిక, 18-08-2002

పూర్తిగా పరిష్కారం అయ్యేంతవరకు వాళ్ళు వెనక్కి పోలేరు. అప్పటిదాకా ఆ రాష్ట్రంలో ఎన్నికలు జరపొద్దనడంలో అర్థం లేదు.

గుజరాత్ పరిస్థితి అది కాదు. హిందూత్వవాద గూండాయిజాన్ని రాష్ట్ర ప్రభుత్వం తలచుకుంటే అదుపు చేయగలదు. ముస్లింలకు భద్రత కల్పించగలదు, వారు తిరిగి గ్రామాలకు పోయేలా చేయగలదు. అయితే ఆ పని చేయడానికి ఆ రాష్ట్ర ప్రభుత్వం సిద్ధంగా ఉంటే రాష్ట్రంలో ఎన్నికలు నిర్వహించాలన్న ఆలోచనే చేసేది కాదనుకోండి! కానీ దీనికి కారణం దుర్మార్గమైన రాజకీయ దురాలోచనే తప్ప కశ్మీర్ లాగా రాష్ట్ర ప్రభుత్వం అదుపులో లేని భౌతిక పరిస్థితి కాదు.

పైగా, శరణార్థులుగా కశ్మీర్ పండిట్‌లకూ గుజరాత్ ముస్లింలకూ పోలికే లేదు. మన దేశంలో కశ్మీర్ పండిట్‌లతో సమానంగా ప్రభుత్వం ఆదరించిన శరణార్థులు వేరే ఎవరూ ఈ యాభై అయిదేళ్ళలోనూ కనిపించరు. అయినప్పటికీ వాళ్ళు అసంతృప్తిగానే ఉన్నారంటే అది 'శరణార్థి' కావడంలో ఉన్న అసంతృప్తే తప్ప గుజరాత్‌లోని ముస్లింల శిబిరాలకు, జమ్మూలోని కశ్మీర్ పండిట్‌ల శిబిరాలకు పోలికే లేదు.

కశ్మీర్‌లోని హిందువులందరూ పండిట్‌లే – అంటే బ్రాహ్మణులే. వారికి కశ్మీర్‌లో భూములున్నాయి. తోటలున్నాయి. చదువు ఉంది. ఉద్యోగాలున్నాయి. కశ్మీర్‌లోయ జనాభాలో 3 శాతం మాత్రమే ఉన్న పండిట్‌లు అక్కడి రాజకీయ ఆర్థిక జీవితంలో దానికి కనీసం అయిదు రెట్లు ప్రాముఖ్యాన్ని కలిగి ఉన్నారు. ఆ చల్లటి జీవితాన్ని విడిచి పెట్టి జమ్మూనగరం శివార్లలో వెలివేసిన వారిలాగ ప్రభుత్వం కట్టిచ్చిన రెండు గదుల ఇళ్ళలో బతకడం, వేసవిలో ఢిల్లీని తలపించే జమ్మూ ఎండలు భరించడం, ఉద్యోగాల వేటలో స్థానికులతో పోటీ పడలేక వెనుక పడడం ఇవన్నీ పండిట్‌లకు కష్టం కలిగిస్తుండవచ్చు. చారిత్రక స్పృహతో ఈ పరిస్థితిని అర్థం చేసుకోవడానికి వారు సిద్ధంగా ఉన్నట్టయితే వారి కష్టాలను అర్థం చేసుకోవడానికి మనమూ సిద్ధం కావచ్చును.

అయితే వేరే ఏ శరణార్థులకు లేని విధంగా ఆ రాష్ట్ర ప్రభుత్వం వారికి కాలనీలు– ఎల్.ఐ.జి స్థాయివే కానివ్వండి – కట్టిచ్చింది. కశ్మీర్‌లో ఉన్నప్పుడు ప్రభుత్వ ఉద్యోగులుగా ఉన్న వారికి జమ్మూలో ఊరికే కూర్చోబెట్టి జీతాలు – ఇంక్రిమెంట్లతో సహా ఇస్తున్నది. ఉద్యోగులు కానివారికి కూడా నిత్య జీవిత అవసరాలు – బియ్యం, పప్పు, చక్కెర వగైరాలు ఉచితంగా ఇవ్వడమే కాక నెలకు కుటుంబానికి వెయ్యి లేక పదిహేనువందలకు తక్కువ కాకుండా భత్యం ఇస్తున్నది. వాళ్ళు జమ్మూలో భయపడుతూ బతకడం లేదు. స్వేచ్ఛగా, సగౌరవంగా బతుకుతున్నారు. ప్రభుత్వాన్నీ పాకిస్తాన్‌నూ ఆడిపోసుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు. ఏమయినా, స్వంత గడ్డ నుండి బలవంతంగా పారిపోయి రావడం బాధాకరమైన పరిస్థితి అంటే ఒప్పుకోవలసిందే గానీ వారికీ గుజరాత్‌లోని ముస్లిం శరణార్థులకూ పోలికే లేదు.

గుజరాత్ శరణార్థులకు ప్రభుత్వం ఒక్క శిబిరం కూడా నెలకొల్పలేదు. రేషన్ తప్ప వేరే ఏ సహాయమూ చేయలేదు. శిబిరాలలో కనీస సదుపాయాలు లేవు. దేశంలోని ప్రతీ నాయకుడూ నాయకురాలూ సందర్శించిన షా ఆలం క్యాంపు వంటి శిబిరాలలో సహితం వెయ్యి మందికి ఒక మరుగుదొడ్డి ఉందంటే ఆ శిబిరాల పరిస్థితి ఊహించుకోవచ్చు.

సరే, ఇప్పుడు శిబిరాలు చాలావరకు మూతపడ్డాయి. అక్కడ బతుకుతున్న జనాభా తగ్గింది. అయితే శిబిరాలు ఖాళీ చేసిపోయిన వారు తమ స్వగ్రామాలలో సగౌరవంగా బతకడం లేదు. చాలామంది స్వస్థలాలకు తిరిగి పోనే లేదు. ఎక్కడో తమ బంధువుల ఊర్లలోనో ముస్లింలు మెజారిటీగా ఉన్న జనావాసాలలోనో తలదాచుకున్నారు. తిరిగి స్వస్థలాలకు పోయినవారు కూడా అనేక విషయాలలో రాజీపడి భయపడుతూ బతుకు తున్నారు.

అన్నిటికంటే ముఖ్యమైన విషయమేమిటంటే ఈ అభద్రతనూ, దానికి దారితీసిన పరిస్థితులనూ పావులుగా వాడుకొని మరొక అయిదేళ్ళు అధికారంలో ఉందామన్న బిజెపి దుర్బుద్ధే గుజరాత్‌లో ఎన్నికల ప్రతిపాదనకు దారితీసింది. అందుకే ప్రధాన ఎన్నికల కమిషనర్ నుండి జాతీయ మానవ హక్కుల కమిషన్ ఛైర్మన్ దాకా అందరికీ ఈ ఎన్నికల ప్రతిపాదన అంత కోపం తెప్పించింది. కశ్మీర్ పరిస్థితి దీనితో ఏ రకంగానూ పోల్చదగ్గది కాదు. ఫరూఖ్ అబ్దుల్లాలో పొగడదగ్గ గుణాలేవీ లేకపోవచ్చును గానీ ఆ రాష్ట్రంలోని మిలిటెన్సీ అతని సృష్టి కాదు, అతను ఎదుర్కొనగలిగి ఉండీ ఎదుర్కొనకపోవడం వల్ల సాగుతున్నదీ కాదు.

ఈ విషయం గుర్తించడంలో ద్వంద్వ ప్రమాణాలేమున్నాయి?

# కశ్మీర్...ఎన్ని 'కలలో?'

మొరార్జీ దేశాయిని దేశంలో ఎక్కడా పెద్దగా గౌరవంగా తలచుకోరు. ప్రకృతి చికిత్స గురించి ఆయనకు ఉన్న అసాధారణమైన అభిప్రాయాలు వినా వేరే ఏదీ ఆయన గురించి మనకు జ్ఞాపకం ఉండకపోవచ్చు. కాని మొరార్జీ పేరును గౌరవపూర్వకంగా జ్ఞాపకం చేసుకునే ఒకే ఒక ప్రాంతం కశ్మీరం.

1977లో ఆయన దేశ ప్రధానమంత్రి అయిన తరువాత కశ్మీర్‌లో జరిగిన అసెంబ్లీ ఎన్నిక ఒక్కటే ఈ 55 సంవత్సరాల స్వతంత్ర భారత చరిత్రలో కశ్మీర్‌లో స్వేచ్ఛగా, న్యాయంగా జరిగిన ఎన్నిక అని కాశ్మీరీలు అంటారు. ఈ సంవత్సరం జరిగిన ఎన్నికను రెండవ స్వేచ్ఛాయుతమైన ఎన్నికగా కశ్మీరీలు చాలా వరకు గుర్తిస్తున్నారు. అయితే దీనికి వాజ్‌పేయిని కాక ప్రధాన ఎన్నికల కమిషనర్ లింగ్‌డో గారిని వారు అభినందిస్తున్నారు.

తప్పుడు పనులు ఎట్టి పరిస్థితిలోనూ చేయకూడదన్న గాంధేయవాద 'చాదస్తం' వల్ల ఆనాడు మొరార్జీ అప్పటిదాకా నెహ్రూ కుటుంబం నెలకొల్పిన ఆనవాయితీని తప్పించి ఆ రాష్ట్ర ప్రజలకు తమ ఇష్టం వచ్చిన ప్రభుత్వాన్ని ఎన్నుకునే స్వేచ్ఛ ఉండాలని భావించాడు. లింగ్‌డో గారి మాటకొస్తే తన వృత్తి నిర్వహణ నిష్పాక్షికంగా చేయాలని ఆయన గట్టిగా సంకల్పించిన విషయం గుజరాత్‌లోనే గమనించాము.

ఈ రెండు గుణాలనూ గౌరవించవలసిందే గానీ వాటిని ఆచరణలో పెట్టే అవకాశం ఆనాడు మొరార్జీకీ, ఈనాడు లింగ్‌డోకూ కలగడానికి వేరే కారణాలు కూడా ఉన్నాయని గుర్తించడం అవసరం. 1977 నాటికి 'కశ్మీర్ సింహం' షేక్ అబ్దుల్లా బాగా మెత్తపడ్డాడు. 1953 నుండి 1975 మధ్యకాలంలో మొత్తం 15 సంవత్సరాలు షేక్ అబ్దుల్లా జైలులో ఉన్నాడు. అతని మీద నేరస్మృతి గుర్తించే ఏ నేరారోపణా లేదు. స్వేచ్ఛ ఇస్తే కశ్మీర్ స్వయంప్రతిపత్తి గురించి మాట్లాడతాడనే నెహ్రూ అతన్ని జైలులో పెట్టాడు. మధ్య మధ్యలో అతనిని బయటకు రానిచ్చినప్పుడు కూడా కశ్మీర్‌లో అడుగుపెట్టనివ్వలేదు. 1975 దాకా ఈ పరిస్థితే నడిచింది. చివరికి ఎమర్జెన్సీ చీకటి రోజులలో, అప్పటికే బాగా మెత్తబడిన షేక్ అబ్దుల్లాతో నెహ్రూ కుమార్తె ఒక ఒడంబడిక చేసుకుంది. అబ్దుల్లా ఇకమీదట కశ్మీర్

---

ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం, 27-10-2002

స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడకూడదనీ, ఆ షరతు మీద అతని పౌర స్వేచ్ఛలు అతనికి తిరిగి ఇవ్వడం జరుగుతుందనీ ఆ ఒడంబడిక సారాంశం.

దానిమీద షేక్ అబ్దుల్లా సంతకం చేసి ఇంటికి తిరిగి వెళ్ళిన తరువాత జరిగిన మొదటి ఎన్నిక మొరార్జీ ప్రభుత్వం ఆధ్వర్యంలో జరిగింది. అబ్దుల్లా లొంగిపోయాడు కాబట్టే అది స్వేచ్ఛగా జరగగలిగింది. అయినప్పటికీ మొరార్జీ ప్రభుత్వం కాక ఇందిరా ప్రభుత్వం అయివుంటే ఢిల్లీ పాలకులకు అనుకూలంగా మారిపోయిన షేక్ అబ్దుల్లాను ఎట్లాగైనా గెలిపించుకోవాలని చూద్దురేమో. అటువంటి బలహీనతకు లోనుకానందుకు మొరార్జీని అభినందించడంలో తప్పు లేదు.

చెప్పుకోదగ్గ కొసమెరుపు ఏమిటంటే, మొట్టమొదటిసారిగా స్వేచ్ఛగా జరగనిచ్చిన ఆ ఎన్నికలలో షేక్ అబ్దుల్లా తిరుగులేని విజయం సాధించాడు. ఎన్నికైన రెండవ రోజు నుండి తన ఒప్పందం సంగతి మరిచిపోయి కశ్మీరీల స్వయం నిర్ణయాధికారం గురించి మాట్లాడసాగాడు. అసలే కశ్మీరీలంటే చాలా అనుమానాలున్న మన పాలకులకు పాపం వారంటే పూర్తిగా విశ్వాసం పోయి ఉండాలి. ఆ తరువాత మళ్ళీ ఎప్పుడూ ఢిల్లీ విశ్వాసం సంపూర్ణంగా పొందిన వారిని తప్ప మరొకరిని ఆ రాష్ట్రంలో గెలవనీయలేదు. 1987లో అబ్దుల్లా కొడుకు ఫరూక్ అబ్దుల్లా నాయకత్వంలోని నేషనల్ కాన్ఫరెన్స్‌ను కచ్చితమైన మెజారిటీతో ఓడించిన ముస్లిం యునైటెడ్ ఫ్రంట్ అభ్యర్థులకు ఎం.ఎల్.ఏలుగా గెలిచినట్టు ప్రకటించడానికీ, సర్టిఫికెట్ ఇవ్వడానికీ కూడా అధికారులు నిరాకరించారు. అంటే 'పోస్ట్–పోలింగ్' రిగ్గింగ్‌కు పాల్పడ్డారు. ఆ ఎన్నికలో గెలిచీ ఓడిపోయిన అమీరాకడల్ ఎం.ఎల్.ఎ సయ్యద్ సలాహుద్దీన్ పాకిస్తాన్‌కు పోయి తుపాకులు తెచ్చుకొని హిజ్బుల్ ముజాహిదీన్‌ను ప్రారంభించాడు. 1987లో అధికారికంగా జరిగిన రిగ్గింగే అప్పటి వరకు శాంతియుతంగా వ్యక్తమైన కశ్మీరీల జాతీయ ఆకాంక్షను మిలిటెంట్ బాటలోకి తీసుకుపోయిందని మినహాయింపు లేకుండా అందరూ ఒప్పుకుంటారు భారత ప్రభుత్వం తప్ప.

కశ్మీరీలకొక జాతీయ ఆకాంక్ష ఉందని గానీ దానిని ఢిల్లీ పాలకులు పదే పదే అగౌరవపరిచారని గానీ మన వాళ్ళెప్పుడూ ఒప్పుకోలేదు. మిలిటెన్సీ అంతా 'పాక్ ప్రేరేపితం' అంటూ వచ్చారు. 1990 తరువాత అమెరికా ప్రపంచ ప్రభుత్వంగా అవతరించడంతో పరిస్థితి మారింది. అప్పటివరకు అమెరికా ఏది తలపెట్టినా రష్యా అడ్డుపడేది. మనవాళ్ళు రష్యా గొడుగు కింద, పాకిస్తాన్ అమెరికా గొడుగు కింద చేరి కశ్మీర్ సమస్యను పరిష్కరించకుండా కాలక్షేపం చేయగలిగారు. అయితే అమెరికా ప్రపంచాధిపత్యాన్ని చేజిక్కించుకున్న తరువాత, తనకు శాంతి కావాల్సిన అన్ని ప్రాంతాల లోనూ శాంతిని న్యాయంగానో, అన్యాయంగానో నెలకొల్పే పనిని భుజాన వేసుకుంది. ఏ కారణంగానైతేనేం కశ్మీర్ అటువంటి ప్రాంతాలలో ఒకటి.

రష్యా బలం పోయిందే అని ఢిల్లీ పాలకులు పెద్దగా బాధపడలేదు. రెండు కారణాలుగా పాకిస్తాన్ కంటే ఇండియాయే అమెరికాకు దగ్గర కాగలదనుకున్నారు. ఒకటి అమెరికా ఆర్థిక ప్రయోజనాలకు పాకిస్తాన్ కంటే భారత్ ఎక్కువ తోడ్పడగలుగుతుంది. రెండు, అన్ని పాశ్చాత్య దేశాలలాగే అమెరికాకు కూడా 'ముస్లిం తీవ్రవాదం' అంటే చచ్చే భయం.

ఈ రెండు కారణాలనూ ఆసరా చేసుకుని కశ్మీర్‌లో శాంతి భారత్ ప్రయోజనాల ప్రాతిపదికన నెలకొల్పడమే అమెరికాకు మంచిదని మనవాళ్ళు అమెరికాకు అనేక విధాల నచ్చజెప్ప బూనుకున్నారు. అమెరికా చేత పాకిస్తాన్‌పైన ఒత్తిడి పెట్టించి కశ్మీరీ మిలిటెన్సీకి పాకిస్తాన్ సహాయం అందియ్యడం ఆపించగలిగితే, ఇక శాశ్వతంగా కశ్మీర్‌ను భారత్‌లోనే ఉంచేసుకోవచ్చునని ఆశించారు. సెప్టెంబర్ 11 తరువాత 'ముస్లిం తీవ్రవాదం' పట్ల అమెరికన్ల భయం విపరీతంగా పెరగడం తమ వ్యూహానికి చాలా అనుకూల విషయంగా మన పాలకులు భావించారు.

ఆ తరువాత మన వాళ్ళు పాకిస్తాన్‌పైన ఒత్తిడి విపరీతంగా పెంచారు. సమయం, సందర్భం లేకుండా పాకిస్తాన్‌ను ఎద్దేవా చేయడం, పాకిస్తాన్‌ను ఏకాకిని చేస్తామని ప్రకటించడం మొదలుపెట్టారు. సైన్యాన్ని సరిహద్దు దగ్గర మోహరించి, 'సీమాంతర ఉగ్ర వాదాన్ని' పాకిస్తాన్ ఆపకపోతే యుద్ధం తప్పదన్న బెదిరింపులు జారీ చేశారు. ఈ రెండు దేశాల మధ్య యుద్ధం ప్రస్తుత పరిస్థితులలో అమెరికాకు ఇష్టం ఉండదు కాబట్టి అమెరికా పాకిస్తాన్‌పైన ఒత్తిడి పెంచుతుందనీ, కశ్మీర్‌లో మిలిటెంట్లకు పాకిస్తాన్ ఇచ్చే సహాయ సహకారాలు (అదే 'సీమాంతర ఉగ్రవాదం') తగ్గుతాయనీ, అల్‌ఖైదా సందడి సద్దుమణిగే లోపల కశ్మీర్ సమస్యను ఢిల్లీ ప్రయోజనాలకు అనుకూలంగా పరిష్కరించేసుకోవచ్చుననీ ఆశించారు.

అయితే ఇక్కడొక ట్రాప్ ఉందని మన వాళ్ళకు అర్థం కానట్టుంది. లేకపోతే దానికి కూడా ఒక ఎత్తుగడ ఆలోచించి పెట్టుకున్నారో! దీన్ని కాస్త వివరించాలి. 'పాకిస్తాన్‌ను మీరు ఆపకపోతే మేము యుద్ధానికి దిగుతాం' అన్న బెదిరింపు పని చేయక తప్పదు. పని చేసింది కూడా. అమెరికా ఒత్తిడి మేరకు సరిహద్దు దగ్గర మిలిటెంట్ల చొరబాటు నిజంగానే తగ్గింది. దానిని పూర్తిగా ఆపడానికి కావలసినంత పటిష్టమైన పాలనాధికారం పాకిస్తాన్‌లో లేదని అందరికీ తెలుసును. కాబట్టి ఒక స్థాయి దాటి ముషార్రఫ్ ఆ చొరబాటును నిలువరించలేకపోయి నందుకు అతనిని ఇండియా తప్ప వేరే ఎవరూ తప్పుపట్టడం లేదు. నిజానికి ముషార్రఫ్‌కు రాజకీయంగా సాధ్యం అయి ఉంటే అతను ఇంకా తెలివిగా తప్పించుకొని ఉండవచ్చును. కశ్మీరీలు కాని పాకిస్తాన్ మిలిటెంట్లను బుజ్జగించో బుదగరించో ఇండియాలోని కశ్మీర్‌లోకి చొరబడకుండా ఆపి, కశ్మీరీ

పాకిస్తానీలను మాత్రం యథేచ్ఛగా పోనిచ్చి, 'కశ్మీర్ పోరాటంలో పాల్గొనడానికి పోతున్న కశ్మీరీలను నేనెట్లా ఆపగలను?' అని ఉంటే మనం తప్ప ప్రపంచమంతా అవుననేది. ఎందుకంటే – మన పత్రికలు ఈ విషయాన్ని ఎంత జాగ్రత్తగా దాచిపెట్టినా – ఒక్క భారత్ తప్ప తక్కిన ప్రపంచమంతా కశ్మీర్‌లో జరుగుతున్న దాన్ని కశ్మీరీల జాతి పోరాటంగానే భావిస్తున్నది. అయితే ముషార్రఫ్‌కు ఈ విషయంలో స్వేచ్ఛ లేదు. కశ్మీరీల జాతి పోరాటం కశ్మీరీల స్వంత విషయం అని ప్రకటించడం పాకిస్తాన్ రాజకీయాలలో సాధ్యం కాదు. దానిని 1947 నాటి దేశ విభజన యొక్క ఆఖరి ఘట్టంగానే పాకిస్తాన్ రాజకీయాలలో చూపుతూ వచ్చారు. కాబట్టి ముషార్రఫ్ (ఎంతటి సైనిక నియంత అయినా) ఈ రోజు అది కశ్మీరీల స్వంతపోరాటం కాబట్టి దానిలో పాల్గొనడానికి కశ్మీరీలు పోతేపొండి, కానీ పంజాబీలూ, సింధీలూ, బలూచీలూ, పష్తూలూ పోవద్దు' అనలేడు. అయితే బిగ్గరగా అనలేకపోయినా అతను అదే 'హింట్' పాశ్చాత్య దేశాలకు ఇచ్చాడు. వాళ్ళు అర్థం చేసుకున్నారు.

కాబట్టి పాకిస్తాన్ నుండి 'చొరబాట్లు' పూర్తిగా ఆగవనీ, అయినప్పటికీ ముషార్రఫ్ బాగా తగ్గించాడనీ అమెరికా వంటి దేశాలు నమ్ముతున్నాయి. కాబట్టి వాళ్ళిప్పుడు ముషార్రఫ్ మాట వినడానికి సిద్ధంగా ఉన్నారు. ముషార్రఫ్ ఒకటే మాట పదే పదే అంటున్నాడు. 'మీరంతా చొరబాట్లు తగ్గించమంటే తగ్గించాను. కానీ కశ్మీరీల స్వాతంత్ర్య పోరాటం మాటేమిటి? దానిని భారత్ అణచివేస్తుంటే మీరంతా చూస్తూ ఊరుకుంటారా? కశ్మీరీల ఆకాంక్షలకు జవాబు చెప్పమని భారత్‌ను నిలదీయరా?' అని అమెరికానూ ఇరత దేశాలనూ అడుగుతున్నాడు.

ఈ ప్రశ్న మనకు తప్ప ప్రపంచంలో అందరికీ న్యాయమైనదిగానే తోస్తుంది. అమెరికా ఇండియాను ఇదే ప్రశ్న ప్రత్యక్షంగా, పరోక్షంగా అడుగుతున్నది. ఇప్పుడు మన పాలకులకు దాక్కోడానికి 'పాకిస్తాన్ ప్రేరేపిత ఉగ్రవాదం' అనే ఆచ్ఛాదన లేదు. ఒక దశాబ్దకాలంగా దాని వెనకే దాక్కున్నాం. ఆ పేరు మీద పాకిస్తాన్‌పైన, అమెరికా పైన విపరీతంగా ఒత్తిడి పెట్టి, యుద్ధమైనా చేయడానికి సిద్ధమేనని బెదిరించి అమెరికా సంతృప్తి చెందే మేరకు పాకిస్తాన్ చొరబాట్లను తగ్గించేటట్టు చేయగలిగాం.

ఇప్పుడింక కశ్మీరీల ఆకాంక్షలను ముఖాముఖి ఎదుర్కొనక తప్పేదేముంది? ఆ సంగతి మన పాలకులకు బాగా తెలుసు. పాకిస్తాన్ మీద విపరీతంగా ఒత్తిడిపెట్టి తాము తవ్వుకున్న గోతిలో తామే పడ్డామని తెలుసు. అందుకని అసెంబ్లీ ఎన్నికల పేరుమీద కొంత సమయం సమస్యను వాయిదా వేయగలిగారు. కశ్మీర్‌లో ఎన్నికలు ఈసారి స్వేచ్ఛగా, స్వతంత్రంగా జరుపుతామనీ ఆ రకంగా కొత్త ప్రభుత్వం ఏర్పడిన తరువాత కశ్మీర్ సమస్య పరిష్కారం గురించి ప్రయత్నం చేస్తామనీ కొన్ని నెలల కింద వాజ్‌పేయి ప్రకటించాడు.

భారత్‌లో కశ్మీర్ చరిత్ర గురించి తెలియనివారు ఆ ప్రకటన చూసి ఆశ్చర్యపోయి ఉంటారు. ఒక దేశ ప్రధానమంత్రి 'ఫలానా రాష్ట్రంలో ఈసారి ఎన్నికలు స్వేచ్ఛగా, స్వతంత్రంగా జరుపుతాం' అనడం ఏమిటి? ఎన్నికలు స్వేచ్ఛగా స్వతంత్రంగా కాకపోతే ఇంకే విధంగా జరుపుతారు? నిజానికి యాభై ఏళ్ళుగా కశ్మీరీలు ఆ మాటే అంటున్నారు. ఇక్కడ ఎన్నికలు స్వేచ్ఛగా, స్వతంత్రంగా జరగడం లేదని. వాళ్ళు అన్నప్పుడది 'పాకిస్తాన్ ప్రేరేపిత వేర్పాటువాద దుష్ప్రచారం' అయింది. మనం ఒప్పుకుంటే సత్యం అయింది. మరి ఇన్నాళ్ళూ మనం చెప్పిన అసత్యానికి ఏం పేరు పెడదాం? దేశభక్తి అందామా?

ఏమయితేనేం, ఇన్ని కారణాలున్నాయి గనకనే ఈసారి ఎన్నికలు భిన్నంగా జరిగాయి. లింగ్‌డో గారి కార్యదీక్షనూ, కార్యదక్షతనూ తక్కువ చేయనక్కరలేదు గానీ ఈ పరిస్థితే లేకపోతే అది 'దేశభక్తి'తో తలపడగలిగి ఉండేదా అంటే అనుమానమే.

ఎన్నికలు స్వేచ్ఛగా, స్వతంత్రంగా జరిగాయంటే అర్థం సైన్యం ఒత్తిడీ, మిలిటెంట్ల ఒత్తిడీ, సర్కారీ మిలిటెంట్ల ఒత్తిడీ లేనేలేవని అర్థం కాదు. అన్నీ కూడా 1996తో పోలిస్తే తక్కువస్థాయిలో ఉన్నాయిగానీ పూర్తిగా లేకపోలేదు. ఓటర్లకు డబ్బులివ్వడం, బెదిరించడం, దొంగవోట్లు వేసుకోవడం జరగనే లేదనీ కాదు. ఇక్కడా, అక్కడా జరిగే ఉంటాయి. పాలక పార్టీ లేక ఢిల్లీ ఆమోదముద్ర పొందిన పార్టీ తన ఇష్టానుసారం ఎన్నికల ప్రక్రియను గతంలోలాగా మలచుకోలేకపోయిందన్న అర్థంలోనే స్వేచ్ఛ, స్వతంత్రం అన్న మాటలు వాడుతున్నారు. ఆ అర్థంలో ఈసారి ఎన్నికలు భిన్నంగా జరిగాయని కశ్మీరీలంతా ఒప్పుకుంటున్నారు.

ఈ సంగతి ముందే అర్థమయింది కాబట్టి అనేక స్థానిక సమస్యలు ఎన్నికల ప్రక్రియలో భాగమయ్యాయి. విద్యావంతులలో నిరుద్యోగం కశ్మీర్‌లో ఎక్కడకు పోయినా ప్రజలు ప్రస్తావించే ముఖ్యమైన సమస్య. అభివృద్ధి కోసమని చెప్పి ఆ రాష్ట్రంలో కేంద్ర ప్రభుత్వం కుమ్మరిస్తున్న డబ్బంతా కేంద్రానికి అనుకూలంగా ఉండే రాజకీయ నాయకుల, పౌర ప్రముఖుల బ్యాంక్ ఖాతాలలోకి పోయింది. నిరుద్యోగంతోపాటు విద్య, వైద్యం, తాగునీరు, రహదార్లు మొదలైన కనీస వసతుల లేమి కశ్మీర్‌లో చాలా బాధాకరమైన పరిమాణంలో ఉన్న సమస్య. ఈ రోజు ముఖ్యమంత్రి పదవికి పోటీపడుతున్న గులాం నబీ ఆజాద్ స్వస్థలం దోడా జిల్లాలోని మారుమూల ప్రాంతం. పీర్ పంజల్ కొండ చరియల వెంబడి ఉన్న ఈ ప్రాంతంలో అనేక గ్రామాల ప్రజలు బస్సు ప్రయాణించగల రోడ్డు చేరుకోవాలంటే కొండల వెంబడి అయిదారు గంటలు నడవాలి. స్కూలు పిల్లలు అట్లాగే స్కూలుకు పోయి రావాలి. కూలికిపోయే స్త్రీలూ, పురుషులూ అట్లాగే పోయి రావాలి.

ఈ విషయాలలో ఫరూఖ్ అబ్దుల్లా ప్రభుత్వం ఏమీ చేయలేదన్న నిరసన చాలా విస్తృతంగా ఉంది. మిలిటెన్సీ మీద పోరాటం చేయడానికే తన సమయమంతా సరిపోతున్నదన్న సాకుతో ఫరూఖ్ అబ్దుల్లా సాధారణ పరిపాలన కూడా ప్రజలకు అందియ్యక

పోవడం పట్ల ఉన్న నిరసన, ఎన్నికలలో నేషనల్ కాన్ఫరెన్స్ ఆటలు సాగవని అర్థం కాగానే, పాలక పార్టీ పట్ల బలమైన వ్యతిరేకతగా ముందుకు వచ్చింది.

అయితే ప్రాంతీయ అసమానతల సమస్య కూడా ఎన్నికలలో ప్రతిధ్వనించింది. జమ్మూకశ్మీర్ రాష్ట్రంలో స్థూలంగా మూడు ప్రాంతాలున్నాయి. అవి జమ్మూ, కశ్మీర్, లదాఖ్. స్వయం నిర్ణయాధికారం లేక స్వాతంత్ర్యం కావాలన్న ఆకాంక్ష కశ్మీర్‌కు, జమ్మూ లోని కశ్మీరీలు నివసించే దోడా జిల్లాకు పరిమితం అయినది. అదే ప్రధానంగా దేశం దృష్టిని ఆకర్షిస్తుందనీ, ఇతర ప్రాంతాల సమస్యలు ఎవరూ పట్టించుకోరనే నిరసన జమ్మూ, లదాఖ్ ప్రాంతాలలో చాలా ఉంది. మూడు ప్రాంతాలలోకీ కశ్మీర్ జనాభా రీత్యా పెద్దది. రాజకీయంగా ప్రముఖమైనది. ఆ రాష్ట్ర ముఖ్యమంత్రీ, కేబినెట్‌లో మెజారిటీ ఎప్పుడూ కశ్మీరీలే. కేంద్రం నుండి వచ్చిన నిధులు ఎక్కువగా కశ్మీర్‌లోనే ఖర్చుపెట్టారనీ, అభివృద్ధి మొత్తం అక్కడే జరిగిందనీ జమ్మూవాసుల అభియోగం. దీనిలోని నిజానిజాల విషయంలో జమ్మూవాసులలోనే ఏకాభిప్రాయం లేకపోయినప్పటికీ ఈ నిరసన ఉన్న మాట వాస్తవం. ఈ నిరసనను సొమ్ము చేసుకోవడానికి, జమ్మూకు వేరే రాష్ట్ర ప్రతిపత్తి కల్పించాలన్న డిమాండ్‌తో ఆర్.ఎస్.ఎస్ జమ్మూ రాష్ట్ర మోర్చా అనే సంస్థను ఈ మధ్యనే ప్రారంభించి ఎన్నికల బరిలో దింపింది. కశ్మీరీలు అత్యధిక భాగం ముస్లింలు, జమ్మూలో మెజారిటీ హిందువులు కావడంతో ఈ 'ప్రాంతీయ వివక్ష' అన్న నిందకు మతం రంగు పూయడం సులభం అయింది. కేంద్రంలో అధికారంలో ఉన్న భారతీయ జనతా పార్టీ ప్రత్యేక జమ్మూ రాష్ట్రం డిమాండ్‌ను తిరస్కరించింది గానీ జమ్మూలోని బిజెపి లోపాయికారీగా ఆర్.ఎస్.ఎస్ వారి జమ్మూ రాష్ట్ర మోర్చాతో పొత్తు పెట్టుకుంది. దాని ఫలితమేమిటంటే అంతకుముందు జమ్మూ ప్రాంతంలో 8 సీట్లు గెలిచిన బిజెపి ఈసారి ఒక్క సీటు మాత్రమే గెలిచింది! మరి జమ్మూలోని హిందువులకు సహితం ఈ సంకుచిత మతతత్వ రాజకీయాలు నచ్చలేదనుకోవాలో, లేకపోతే గతంలో ముస్లింలు సహితం జమ్మూ ప్రాంతంలో బిజెపికి ఓటు వేశారనీ, ఇప్పుడు ప్రత్యక్షంగా మతతత్వ రాజకీయాల రంగు పూసుకునేసరికి వేయలేదనీ అనుకోవాలో చెప్పలేము.

జమ్మూలో మతతత్వం రంగు పూసుకున్న ప్రాంతీయ రాజకీయాలు ఓడిపోగా, లదాఖ్‌లో ప్రాంతీయ రాజకీయాలు అన్ని మతాల వారినీ కలుపుకొని అన్ని సీట్లూ గెలుచుకోవడంలో కృతకృత్యమయ్యాయి. నిజానికి లదాఖ్ వాసులది చాలా బాధాకరమైన పరిస్థితి. లదాఖ్ ఎత్తయిన శీతల ఎడారి. అక్కడి ప్రజల భాషా సంస్కృతులకు కశ్మీరీలతోగానీ, జమ్మూ ప్రాంతవాసులైన డోగ్రీ ప్రజలతో గానీ ఏమీ సంబంధం లేదు. వారికి సాన్నిహిత్యం టిబెట్‌తో. అయితే ఇక్కడి నేలలు సారవిహీనమైనవి, వాతావరణం అత్యంత శీతలమైనది కావడంతో జనాభా చాలా తక్కువ. పైగా లదాఖీలలో దాదాపు సగభాగం బౌద్ధులు కాగా సగభాగం షియా ముస్లింలు. ఇవి రెండూ దేశ రాజకీయాలలో బలంలేని మతాలే.

ఈ కారణాలన్నిటివల్లా లదాఖీల గొంతు జమ్మూకశ్మీర్ రాజకీయాలలో అసలే వినబడదు. కొన్ని ఏళ్ళ కింద లదాఖ్ ప్రాంతంలో స్వయంప్రతిపత్తి గల స్థానిక హిల్ కౌన్సిల్ ఏర్పాటుచేసే ప్రక్రియ మొదలయింది. అయితే లదాఖ్‌లోని రెండు జిల్లాలలో దక్షిణ జిల్లా అయిన 'లే'లో హిల్ కౌన్సిల్ మొదట ఏర్పడింది. 'లే' బౌద్ధులు అధికంగా నివసించే ప్రాంతం. షియా ముస్లింలు అధికంగా నివసించే కార్గిల్ జిల్లాలో హిల్ కౌన్సిల్ ఇప్పటికీ ఏర్పడలేదు. ఇది భాషా సంస్కృతులలో ఒకవర్గం ప్రజలను మతం ప్రాతిపదికన చీల్చే ప్రక్రియ అన్న విమర్శ బలంగా వచ్చింది. అదెట్లాగున్నా, ఈసారి ఎన్నికల ప్రక్రియ మొదలయ్యేసరికి మొత్తంగానే లదాఖ్‌ను జమ్మూకశ్మీర్ నుండి వేరు చేసి కేంద్ర పాలిత ప్రాంతంగా పునర్వ్యవస్థీకరించాలన్న డిమాండ్‌తో ఒక వేదిక ఏర్పడింది. అది 'లే' ప్రాంతంలో అన్ని మతాలవారి మద్దతూ పొందింది. కార్గిల్ ప్రాంతంలో అన్ని మతాల వారి డిమాండ్‌తో హిల్ కౌన్సిల్ ఏర్పాటును కేంద్రంగా చేసుకున్న వేదిక ఏర్పడింది. ఈ రెండు వేదికల తరఫున పోటీచేసిన స్వతంత్ర అభ్యర్థులు లదాఖ్‌లో నేషనల్ కాన్ఫరెన్స్‌ను నామరూపాలు లేకుండా చేశారు.

ఇంక కశ్మీర్ లోయ విషయానికి వచ్చేసరికి, ఈసారి ఎన్నికల్లో నేషనల్ కాన్ఫరెన్స్ అక్రమాలకు పాల్పడే అవకాశాలు లేవని అర్థమయ్యేసరికి ఎట్లాగైనా నేషనల్ కాన్ఫరెన్స్‌ను ఓడించాలన్న సంకల్పం ఎన్నికల ప్రచారం సమయంలోనే బలంగా వ్యక్తం అయింది. ఈ సంకల్పాన్ని ప్రకటించిన వారందరూ ఒక విషయాన్ని స్పష్టం చేశారు. కశ్మీర్‌కు 'ఆజాదీ' కావాలన్న ఆకాంక్షను తాము వదులుకోలేదనీ, అయితే ఈ ఎన్నికలలో పాల్గొనడానికీ, దానికీ ఏమీ వైరుధ్యం లేదనీ శ్రీనగర్‌లో గద్దెను శాశ్వతంగా ఆక్రమించుకొని ఇష్టారాజ్యంగా పరిపాలిస్తున్న అబ్దుల్లా కుటుంబానికి బుద్ధి చెప్పడం తక్షణ లక్ష్యం అనీ అన్నారు. మరి కొందరు ఆజాదీ తమ అంతిమ లక్ష్యమైనప్పటికీ ప్రస్తుతానికి కూడు, గుడ్డ ఇవ్వగల ప్రభుత్వం కోసం ఓటు వేస్తున్నామనీ దీనిని వేరే విధంగా వ్యాఖ్యానించకూడదనీ అన్నారు. ఈ వ్యాఖ్యలు వాళ్ళు చేయడానికొక కారణం ఉంది. కశ్మీరీలు ఎన్నికలలో పాల్గొంటున్నారంటే భారత రాజ్యాంగాన్ని ఆమోదించినట్టేనని భారత ప్రభుత్వం మొదటినుంచీ వ్యాఖ్యానిస్తున్నది.

మొన్నటి ఎన్నికల తరువాత కూడా అదే వ్యాఖ్య చేసింది. అటువంటి వ్యాఖ్యలు ఢిల్లీ నుండి వస్తాయని కశ్మీరీలకు తెలుసును కాబట్టే తాము ఎన్నికలలో పాల్గొనడానికి గల అర్థం అది కాదని స్పష్టం చేశారు. కాంగ్రెస్, పిడిపి నాయకులు కూడా అదే హెచ్చరిక ఢిల్లీ ప్రభుత్వానికి చేశారు. ఎన్నికలు జయప్రదంగా జరపడంతో ఏమీ అయిపోలేదనీ, అసలు సమస్య పరిష్కారం ముందుందనీ ముఫ్తీ మహమ్మద్ సయీద్, గులాంనబీ ఆజాద్‌లు ఇద్దరూ అన్నారు.

ఎన్నికలలో చాలామంది స్వతంత్ర అభ్యర్థులు గెలిచారు. వారిలో ఒకరిద్దరు 'తిరుగుబాటు' అభ్యర్థులను మినహాయిస్తే తక్కినవారందరూ 'ఆజాదీ' కాముకులే. ఏదో ఒక మిలిటెంట్ సంస్థ సపోర్టు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఉన్నవారే. ఎన్నికలను బహిష్కరించడం కంటే పాల్గొని ఫరూఖ్ అబ్దుల్లా కుటుంబానికి బుద్ధిచెప్పడం సరైన వైఖరి అని నమ్మేవారు కశ్మీర్‌లో చాలామందే ఉన్నారనడానికి వీరి ఎన్నిక ఒక సూచిక.

అయితే మిలిటెన్సీకి ప్రధాన కేంద్రాలైన శ్రీనగర్, బారాముల్లా, సోపోర్, అనంత్‌నాగ్ పట్టణాలలో పోలింగ్ చాలా తక్కువ ఉండడాన్ని బట్టి చూస్తే ఎన్నికలలో పాల్గొని నేషనల్ కాన్ఫరెన్స్‌ను ఓడించడం అన్న ఆలోచన కంటే బాయ్‌కాట్ చేయాలన్న ఆలోచనే మిలిటెన్సీ ప్రభావం ఎక్కువ ఉన్న ప్రాంతాలలో బలంగా ఉందని అర్థం అవుతుంది. కశ్మీర్‌లో వేర్పాటువాదం ప్రభావం గ్రామాలలో కంటే పట్టణాలలో బాగా ఎక్కువ. అందులోనూ శ్రీనగర్ 'డౌన్ టౌన్' (పాతబస్తీ) వేర్పాటువాదానికి ప్రధాన కేంద్రం. ఆ ప్రాంతాలలో నూటికి పదిమంది కూడా ఓటు వేయలేదంటే 'సమస్య' ఎన్నికలు జరపడంతో తీరిపోయిందనుకోవడం భ్రమ.

ఎన్నికలు దండగ అనుకోని వారినందరినీ ఆకర్షించిన విషయం కశ్మీర్ లోయలో పి.డి.పి విజయం. దీనికి ప్రధాన కారణం ఆ పార్టీ సిట్టింగ్ ఎంఎల్ఏ మెహబూబా ముఫ్తీ రాజకీయ కార్యాచరణ అనడంలో సందేహం లేదు. భయంకరమైన అణచివేత కింద నలుగుతున్న కశ్మీరీల మానవ హక్కులను 'ప్రధాన స్రవంతి' రాజకీయ అజెండా మీదికి తీసుకొచ్చిన ఘనత ఈమెకే దక్కుతుంది. 'నేను ఇండియన్‌నే. కశ్మీర్ భారత్‌లో ఉండాలనే కోరుకుంటాను. కానీ ఈ అభిప్రాయంతో విభేదించే వారిని నేరస్తులుగా, దేశద్రోహులుగా చూసి అణచివేయాలని ప్రయత్నించడం అన్యాయం. వాళ్ళతో మాట్లాడాలి. మాట్లాడి సమస్యను పరిష్కరించాలి' అంటుందామె. కశ్మీర్‌లో ఏ మూలనైనా సైన్యం చేతిలో అత్యాచారాలకూ, హింసకూ గురైన ప్రజలను 'మిమ్మల్ని పలకరించడానికి ఎవరైనా వచ్చారా' అని అడిగితే హురియత్ కాన్ఫరెన్స్ పేరు చెప్తారు, మెహబూబా ముఫ్తీ పేరు చెప్తారు. ఆ కృషి ఫలితం పి.డి.పికి వచ్చిన సీట్లు.

అధికారం ఇప్పుడు ఎవరు చలాయించినా, చలాయించి ఏం చేసినా కశ్మీరీల భావాలను గౌరవించి వారితో మాట్లాడడానికీ, అవసరమైతే పాకిస్తాన్‌తోనూ మాట్లాడడానికి ఢిల్లీ పాలకులు సిద్ధపడితే కశ్మీరీల పీడకల ముగింపుకు వస్తుంది. ఎన్నికల విజయవంతమైన నిర్వహణను అడ్డంపెట్టుకుని సమస్య పరిష్కారాన్ని ఇంకొంత కాలం వాయిదా వేయడానికి ఏ ఎత్తుగడలు వేద్దామా అని ఢిల్లీ పాలకులు ఆలోచించేటట్టయితే మాత్రం ఏమీ మారదు. పన్నెండేళ్ళలో దాదాపు 40 వేలమందిని పోగొట్టుకొని కూడా కశ్మీరీలు తమ స్వాతంత్ర్య కాంక్షను వదులుకోలేదు. ఇంకింతమందిని చంపితే వదులుకుంటారనుకోవడం భ్రమ.

# భారత-పాకిస్తాన్ మైత్రి : స్పష్టతలేని వైఖరి

రాజకీయాలలో అబద్ధాలు మామూలే గానీ అంతర్జాతీయ రాజకీయాలు ఈ విషయంలో ఆంతరంగిక రాజకీయాల కన్నా మరీ అధ్వాన్నం. ఎందుకంటే పదవి కోసమో పార్టీ శ్రేయస్సు కోసమో అబద్ధం చెప్పటం తప్పనుకునే వారు సహితం దేశం కోసం అబద్ధం చెప్పటంలో తప్పేమీ లేదని భావిస్తారు. దానిని అబద్ధంగా గుర్తించడానికి సహితం చాలామంది సిద్ధపడరు. తెలుగుదేశం – కాంగ్రెస్ పార్టీల సంవాదాన్ని అబద్ధాల పంచాంగం అనినంత సులభంగా భారత–పాకిస్తాన్‌ల సంవాదం గురించి అనగలమా?

అనలేము గానీ వాస్తవానికది అబద్ధాల పంచాంగమే. మన పాలకులు ఒకేసారి పాకిస్తాన్ గురించి ఎన్ని నోళ్ళతో మాట్లాడుతున్నారో గమనించండి. అద్వానీ మన దేశం ఎదుర్కొంటున్న అన్ని సమస్యలకు – ఒక్క కరువు సమస్యను మినహాయించి – పాకిస్తాన్ మీద నింద వేసి తిడుతుంటాడు. ఆయన అభిప్రాయాన్నే భారత ప్రభుత్వం అభిప్రాయమని భావించినట్లయితే భారత్ దృష్టిలో పాకిస్తాన్ ఒక భయంకరమైన కుట్రదారు, రాక్షసి అని భావించవలసి ఉంటుంది. నిన్నటికి నిన్న నకిలీ స్టాంపుల కుంభకోణంలో కూడా పాకిస్తాన్ హస్తం చూసేదాకా పోయాడాయన.

ఇక దేశ ప్రధాని మాటకొస్తే అన్ని విషయాల లాగే ఈ విషయంలోనూ ఆయనకు ఒక నిలకడయిన వైఖరి లేదు. 'సీమాంతర ఉగ్రవాదాన్ని' రెచ్చగొడుతున్న టెర్రరిస్టు దేశంగా ప్రపంచం చేత పాకిస్తాన్‌ను గుర్తింపజేయాలన్న ఆరాటం ఒక చివర, స్నేహ హస్తం మరొక చివర, మధ్యలో అప్పటి శ్రోతలను బట్టి రకరకాల అభిప్రాయాలు ఆయన నోటి నుండి వింటుంటాం. పాకిస్తాన్‌తో కశ్మీర్ సమస్యతో సహా అన్నీ చర్చించడానికి సిద్ధమేనని ఇవ్వాళ అనగలడు, ఆ సంగతి మనం రేపు పత్రికలలో చదివి హర్షించే లోపల పాక్ ఆక్రమిత కాశ్మీరును మనకు వెనక్కి ఇచ్చే విషయం తప్ప పాకిస్తాన్‌తో కశ్మీర్ గురించి మాట్లాడేది ఏమీ లేదని అనగలడు.

రక్షణ మంత్రి జార్జి ఫెర్నాండెజ్‌కు భారత పాకిస్తాన్‌లు రెండు దేశాలుగా, రెండు సమాజాలుగా కాక రెండు సైన్యాలుగా కనిపిస్తున్నాయి. ఆయన దానికి ఉచితమైన భాషే

వీక్షణం మాసపత్రిక, 16–11–2003

మాట్లాడతాడు. విదేశాంగ మంత్రి యశ్వంత్ సిన్హా కొంచెం అద్వానీలాగా, కొంచెం జార్జి ఫెర్నాండెజ్‌లాగా మాట్లాడుతుంటాడు.

వీటిలో దేనిని పాకిస్తాన్ పట్ల భారత్ వైఖరిగా భావించాలి? అసలు భారత్‌కు పాకిస్తాన్ పట్ల ఒక నిర్దిష్టమైన వైఖరి ఉందని భావించాలా?

నిజం చెప్పాలంటే మన దేశనాయకులెవ్వరికీ పాకిస్తాన్‌తో సంబంధాలు మెరుగుపరచుకోవడం పట్ల చిత్తశుద్ధి లేదు. కశ్మీర్ విషయంలో పాకిస్తాన్ మనల్ని ఇబ్బంది పెట్టకుండా చూసుకోవడమొక్కటే మన నాయకులకు కావలసింది. అమెరికాను మంచి చేసుకొని కశ్మీర్ విషయంలో పాకిస్తాన్ చేతులూ, నోరు కట్టేస్తే ఇక ఆ పైన పాకిస్తాన్ అనే దేశమొకటి ఉందనే మరచిపోయి బతకొచ్చని వారి అభిప్రాయం. 'సెప్టెంబర్ 11' తరువాత ఈ అవకాశం పెరిగిందని గట్టిగా నమ్ముతున్న వారిలో అద్వానీ ముఖ్యుడు. ఆ గాలి ఇటు మళ్ళించి పాకిస్తాన్ బెడదను ఒక్కసారిగా వదిలించేసుకుందామని అతని ఉబలాటం. అద్వానీ బయటపడి మాట్లాడుతున్నాడు గానీ వారి ఖాకీ నిక్కరు వ్యాయామశాలల లోపలే కాక దానికి వెలుపల కూడా చాలామంది భారతీయుల వైఖరి ఇదే. పాకిస్తాన్‌తో స్నేహ సంబంధాలు వాటంతటవి విలువయినవంటే ఈ వైఖరి ఒప్పుకోదు. పోనీ శాంతి కోసం స్నేహ సంబంధాలు అవసరమంటే, బెదిరించి శాంతి నెలకొల్పడం అంతకంటే సులభమైన మార్గం కాదా అంటుంది. అణుబాంబు అందుకోసమే తయారు చేసుకున్నారు – దానిని చూసి పాకిస్తాన్ కూడా భయపడి కశ్మీర్ సంగతి మరిచిపోయి మనతో రాజీ కొస్తుందని. మన అణు విస్ఫోటనానికి ప్రతిగా పాకిస్తాన్ కూడా అణు విస్ఫోటనం చేపట్టే సరికి ఈ ఆశ కుప్పకూలిపోయింది. ఇప్పుడు అణుబాంబు బదులు అమెరికాను చేతిలో పెట్టుకొని పాకిస్తాన్‌ను భయపెట్టాలని చూస్తున్నారు. అంతే తప్ప పాకిస్తాన్‌తో స్నేహ సంబంధాలు నెలకొనాలన్న చిత్తశుద్ధి ఎవరిలోనూ లేదు. నిన్న మొన్న మన వాళ్ళు అమలు చేయడానికి ఒప్పుకున్న కాల్పుల విరమణ కూడా అమెరికాను మెప్పించే ఎత్తుగడలో భాగమే తప్ప వేరే ఏమీ కాదు.

వాజ్‌పేయి లాహోర్‌కు పోలేదా, ముషార్రఫ్‌ను ఆగ్రాకు పిలవలేదా అంటారేమో. పోయాడు, పిలిచాడు. అది వాజ్‌పేయి పాకిస్తాన్ పట్ల అనుసరిస్తున్న రెండు నాల్కల వైఖరిలో భాగం. తన పదవి ముగిసేలోగా పాకిస్తాన్‌తో సంబంధాలు మెరుగుపరచి 'చరిత్రలో నిలిచిపోవాలన్న' కాంక్ష వాజ్‌పేయిలో బలంగా ఉందన్న అభిప్రాయమొకటి విశ్లేషకులలో ఉంది. అందులో భాగంగా ఆ ప్రయత్నాన్ని అర్థం చేసుకున్నా తప్పు లేదు. అయితే దానిని అద్వానీ పనిగట్టుకొని చెడగొట్టాడనేది ఇప్పుడు బహిరంగ రహస్యం. కొంత సామరస్య పూరితమైన ఉమ్మడి ప్రకటన ఆగ్రాలో తయారయ్యే స్థితి వచ్చింది గానీ అద్వానీ అడ్డుపడడం వల్ల అది సాధ్యం కాలేదు. వాజ్‌పేయికి చరిత్రలో ఒకరకంగా 'నిలిచిపోవాలని' ఉన్నట్లే అద్వానీకి ఇంకొక రకంగా 'నిలిచిపోవాలని' ఉంది మరి!

అయితే లాహోర్, ఆగ్రా ప్రయత్నాలను పాకిస్తాన్ విశ్లేషకులు చూసిన తీరును పరిశీలిస్తే ఇది కూడా నిజానికి భారత్ పాకిస్తాన్ పట్ల ఎప్పుడూ అనుసరిస్తున్న వైఖరికి భిన్నం కాదని అర్థం అవుతుంది. మనవాళ్ళు అప్పట్లో పాకిస్తాన్ నుండి రాబట్టాలని చూసిన ప్రకటన ఏమిటి? కశ్మీర్‌ను పక్కనపెట్టి ఇతర సమస్యలు పరిష్కరించుకొనడానికి పాకిస్తాన్ సిద్ధమనే ప్రకటన రాబట్టాలని చూశారు. అయితే ముషార్రఫ్ పదే పదే అంటున్నట్లు కశ్మీర్ కాక వేరే ఏ సమస్యలున్నాయి భారత్–పాకిస్తాన్‌ల మధ్య? నదీజలాలు, వర్తక వాణిజ్యాలు మొదలైనవి ఎప్పుడైనా ఉండే, మోతాదులోని సమస్యలే తప్ప అంత ఆర్భాటంగా శిఖరాగ్ర సమావేశం నిర్వహించుకోనిదే పరిష్కారం కానివేవీ కావు.

ఒకవేళ ఉన్నాయనే అనుకున్నా కశ్మీర్‌ను పక్కనపెట్టి వాటి గురించి మాట్లాడు కుందామన్న ప్రతిపాదన వెనుక కశ్మీర్ విషయంలో పాకిస్తాన్ బెడద వదిలి వేసుకుందామన్న ఆరాటమే తప్ప వేరే సదుద్దేశమేమీ లేదన్న పాకిస్తాన్ విశ్లేషకుల వ్యాఖ్యను కొట్టిపారేయలేము. సులభంగా పరిష్కారం కాగల సమస్యలతో మొదలుపెట్టి చర్చలు ప్రారంభిస్తే, కష్టతరమైన కశ్మీర్ సమస్య పరిష్కారానికి కావలసిన స్నేహ వాతావరణం ఏర్పడుతుందని మన వాళ్ళు చాలా తెలివిగా సూచిస్తున్నారు గానీ అవన్నీ పరిష్కారం అయిపోయిన తరువాత భారత్ కశ్మీర్ విషయం మరచిపోయి ఇంటికి వెళ్ళిపోదన్న నమ్మకం ఏమిటని వారి వాదన.

కశ్మీర్ విషయం పాకిస్తాన్‌తో మాట్లాడడానికి భారత్ సిద్ధంగా లేదంటున్నారు సరే, పాకిస్తాన్ మాత్రం సిద్ధంగా ఉందా అంటారేమో. చాలా కాలంపాటు పాకిస్తాన్ పాలకుల వైఖరీ ఇదే. అమెరికా చేయూతనిస్తే యుద్ధం చేసి కశ్మీర్ వివాదాన్ని పరిష్కరించుకోవాలని పాకిస్తాన్ చూసింది. అయితే 1971 'బంగ్లాదేశ్ యుద్ధం' తరవాత, బంగ్లాదేశ్ ఏర్పాటు తరవాత ఆ ఆలోచన బలహీనపడింది. 1989లో కశ్మీర్‌లో స్వయం నిర్ణయాధికార పోరాటం మొదలైన తరవాత పాకిస్తాన్‌కు మరొకసారి కశ్మీర్ వివాదాన్ని తనకు అనుకూలంగా పరిష్కరించుకునే అవకాశం లభించింది. ఒక పాకిస్తానీ మానవ హక్కుల ఉద్యమకారుడు వ్యాఖ్యానించినట్టు, కశ్మీరీల స్వయం నిర్ణయాధికారం విషయంలో పాకిస్తాన్‌ది విచిత్రమైన వైఖరి. కశ్మీరీలకు పాకిస్తాన్‌ను కోరుకునే మేరకు మాత్రమే స్వయం నిర్ణయాధికారం ఉంటుంది. స్వతంత్రంగా బతకాలని కోరుకునే అధికారాన్ని పాకిస్తాన్ ఒప్పుకోదు.

ఏమయితేనేం కశ్మీరీల స్వయం నిర్ణయాధికార పోరాటానికి పాకిస్తాన్ చాలా సహాయం చేసింది. చేస్తున్నది. ఆ సహాయం లేకపోతే కశ్మీరీలు ఇప్పటిదాకా పోరాటం చేయగలిగేవారు కాదు. పాకిస్తాన్ ఉద్దేశాలు ఏవయినా కశ్మీరీల ఆరాటం న్యాయమైనది కాబట్టి ఈ విషయంలో పాకిస్తాన్ ఒక చారిత్రక కర్తవ్యాన్ని నిర్వర్తిస్తున్నదని ప్రపంచంలోని

అత్యధిక దేశాల అభిప్రాయం. (మన పత్రికలు మనకు వినపడకుండా దాచిపెడుతున్న ప్రపంచ సత్యాలలో ఇదొకటి.)

అయితే ఈ సహాయాన్ని కశ్మీరీలకు చేసే సహాయంగా చూసినా, పాకిస్తాన్ తన తొలినాటి ఆకాంక్షను పరిపూర్తి చేసుకోవడానికి జరుపుతున్న కృషిగా చూసినా, ఈ బరువు, ఈ ఖర్చు పాకిస్తాన్ సమాజం ఇంకెంత కాలం మోయాలన్న ప్రశ్న ఒకటి పాకిస్తాన్‌లో మొలకెత్తింది. పాకిస్తాన్ ఒక ఆధునిక పారిశ్రామిక దేశంగా అభివృద్ధి చెందాలని కాంక్షించే మధ్యతరగతి ఆ దేశంలో కొంత బలపడింది. వారు ఈ ప్రశ్న బలంగా లేవదీస్తున్నారు. ఇది పాకిస్తానీ పాలకులను ప్రభావితం చేస్తున్నదని భావించడానికి ఈమధ్యనే ఇండియాలో పర్యటించిన పాకిస్తానీ జమాతే ఇస్లామి నాయకుడి ప్రకటన ఒక నిదర్శనం.

దీనికి ఒక నేపథ్యం ఉంది. అది అమెరికా సామ్రాజ్య విస్తరణ వ్యూహంలోని దుర్మార్గపు ఎత్తుగడల పర్యవసానం. ఆఫ్ఘానిస్తాన్ నుండి రష్యాను తరిమివేయడానికి అమెరికా 'ఇస్లామిక్ ముజాహిద్దీన్'ల సైన్యాన్ని తయారుచేసిన సంగతి తెలిసిందే. ఇస్లాంను వ్యాపింపచేయడానికీ, ముస్లింలు ఎక్కడున్నా అక్కడ సనాతన ఇస్లామిక్ రాజ్యాలు స్థాపించడానికీ ఆయుధాలు పట్టుకొని బయలుదేరడానికి తయారుగా ఉన్న సాయుధ జిహాదీలు అప్పటిదాకా ఒకటి రెండు పశ్చిమాసియా దేశాలలో చిన్న చిన్న గుంపులుగా ఉండేవారు. వారంతటవారు అంతకంటే ఎప్పటికీ ఎదగక పోదురేమో. కానీ అమెరికా తన ఆఫ్ఘానిస్తాన్ ప్రతి వ్యూహం కోసం వారందరినీ ఒకచోట చేర్చి మిలిటెంట్ల ఫ్యాక్టరీ నెలకొల్పింది.

ఆ 'చోటు' పాకిస్తాన్. అప్పటి నుంచి పాకిస్తాన్‌లో వీధివీధికీ ముజాహిద్దీన్‌లు తయారయ్యారు. అమెరికా వ్యూహం ఫలించింది. రష్యా ఆఫ్ఘానిస్తాన్ నుండి వెళ్ళిపోయింది. కానీ ఆఫ్ఘానిస్తాన్, పాకిస్తాన్ చాలా నష్టపోయాయి. మతహింసకు స్థావరాలయ్యాయి. దాని నుండి ఆఫ్ఘానిస్తాన్‌ను 'కాపాడడానికి' అమెరికాయే ఆ దేశం మీద మరొకసారి యుద్ధం చేయడం వేరే కథ.

పాకిస్తాన్‌లో అమెరికా విత్తనం నాటిపోయిన పాన్ ఇస్లామిక్ మిలిటెన్సీ పట్ల ఆ దేశంలోని ఆలోచనాపరులలో వ్యతిరేకత బాగా పెరిగింది. వారంతా హేతువాదులు, నాస్తికులు, కమ్యూనిస్టులు ఏమీ కారు. పాకిస్తాన్ ఒక ఆధునిక దేశంగా ఎదగాలని కోరుకుంటున్న వారందరూ ఈ సాయుధ జిహాదీలు పెద్ద ఆటంకం అని గుర్తిస్తున్నారు. వాళ్ళు ఇతర ప్రాంతాలలో కశ్మీర్ నుండి చెచెన్యా దాకా పోరాటాలు చేయడమేకాక పాకిస్తానీ సమాజాన్ని సాయుధంగా శాసించే ప్రయత్నం కూడా చేస్తున్నారు.

ఇండియాతో కశ్మీర్ వివాదాన్ని ఏదో ఒక రకంగా తెంపుకోనంతకాలం ఈ మిలిటెంట్ల బెడద పాకిస్తాన్‌కు పోదని పాకిస్తాన్‌లో చాలామంది ఈ రోజు భావిస్తున్నారు.

ఆ ఒత్తిడి పాకిస్తాన్ పాలకుల మీద ఉంది. అందుకు భిన్నమైన దిశగా ఒత్తిడి పెట్టే ప్రభావాలు లేవా అంటే ఉన్నాయి. అయితే ఈ కారణంగా పాకిస్తాన్ పాలకులు ఇండియాతో చర్చలు జరిపే విషయంలో మనవాళ్ళ కంటే కొంచెం సిన్సియర్‌గానే ఉన్నారు.

మన సమస్య ఏమిటంటే పాకిస్తాన్‌ను ఒక ఇస్లామిక్ భూతంగానే తప్ప ఇంకొక రకంగా మనం చూడలేం. ఆ దేశంలోనూ భిన్న ఆరాటాలూ, ఆకాంక్షలూ ఉన్నాయన్న ప్రాథమిక సత్యాన్ని సహితం మనం గుర్తించం. మన రాజకీయాలు, మన పత్రికలు, ఈ మధ్య కాలంలో సినిమాలు పాకిస్తాన్ గురించి ఒక మూస అభిప్రాయాన్నే కలిగిస్తున్నాయి, పెంచి పోషిస్తున్నాయి.

మనం మారనిదే మన పాలకులు ఎందుకు మారుతారు? వాళ్ళ వైఖరి మార్చుకోవాలన్న ఒత్తిడి మన నుండి రానిదే అదెందుకు మారుతుంది? కానీ దీనికి కావలసిన కృషి చేయడానికి ఎవరు సిద్ధంగా ఉన్నారు? జాతీయవాద ఆవేశంలో ఉన్న సుఖం హేతుబద్ధమైన వివేచనలో ఉండదు. దానిని బలంగా చేపట్టకపోతే మాత్రం భారత–పాకిస్తాన్ చర్చల పేరుతో ఈ అబద్ధపు ప్రహసనం సాగుతూనే ఉంటుంది. మొన్న ప్రకటించినట్టుగా కాల్పుల విరమణ అప్పుడప్పుడు ప్రకటించడమూ జరుగుతుంటుంది. మరొకపక్క ఆయుధాల తయారీ, కొనుగోలు, దిగుమతి, సైన్యాల మోహరింపు సాగుతూనే ఉంటాయి.

# హురియత్‌తో భారత్ చర్చలు : పూర్వాపరాలు

కశ్మీర్ విషయంలో భారత ప్రభుత్వ వ్యవహారశైలిని చూసినప్పుడు తోలుబొమ్మలాట చూసిన అనుభూతి కలుగుతుంది. మామూలుగా ఒక మనిషి మరుక్షణం ఏం చేయబోతున్నదీ ఈ క్షణం తన ముఖంలో, హావభావాలలో గోచరిస్తుంది. తోలుబొమ్మతో అది సాధ్యం కాదు. అది నడిపించే వాడిని బట్టి నడచుకుంటుంది.

భారత ప్రభుత్వం 'కశ్మీర్ పాలసీ'ని అమెరికా నడిపిస్తున్నదనేది తెలిసిందే. అందుకే కశ్మీర్ విషయంలో భారత ప్రభుత్వం ఎప్పుడు ఏది చేస్తుందో ఊహించడం సాధ్యం కాదు. ఈ రోజు ప్రకటనను బట్టి రేపటి నిర్ణయాన్ని ఊహించలేము. హోంమంత్రి మాటలను బట్టి ప్రధానమంత్రి ఏమనబోతాడో ఊహించలేము.

హురియత్ కాన్ఫరెన్స్‌తో భారత ప్రభుత్వం చర్చలకు సిద్ధమనీ, చర్చలలో భారత్ తరపున హోంమంత్రి స్వయంగా పాల్గొంటాడనీ కొంత కాలం క్రింద కేంద్ర ప్రభుత్వం చేసిన ప్రకటన అందుకే ఆశ్చర్యం కలిగించవలసి ఉండి కూడ కలిగించలేదు. అయినా, మనమొక వేళ మర్యాద కోసం ఆశ్చర్యపోయినా దాని నుండి తేరుకునే లోపల అందుకు విరుద్ధమైన ప్రకటన ఢిల్లీ నుండి వెలువడగలదు కాబట్టి అది అనవసరమైన ప్రయాస కాగలదు కూడ. (ఆశ్చర్యం అనే స్థితిలోకి పోవడం, దానినుండి తేరుకోవడం ప్రయాసే కదా మరి!)

అయితే అబద్ధపు విధాన ప్రకటనల వల్ల ఫలితమేమీ ఉండదనుకునే సౌలభ్యం చరిత్ర మనకివ్వలేదు. కాబట్టి ఈ నిర్ణయాన్ని విశ్లేషించుకోవడం అవసరం.

ఆల్ పార్టీ హురియత్ కాన్ఫరెన్స్ అనేది 33 కశ్మీరీ సంస్థల ఉమ్మడి వేదిక. వాటికి ఉన్న సామాన్య గుణం ఒక్కటే. అవన్నీ కూడా జమ్మూకశ్మీర్ భారతదేశంలో శాశ్వతంగా విలీనం కాలేదనీ, విలీనమయిపోయిందన్న భారత్ వైఖరి వివాదాస్పదమయిందనీ నమ్ముతాయి. ఆపైన అందరి దృక్పథమూ ఒకటి కాదు. కొన్ని సంస్థలు (జమాతే ఇస్లామి వంటివి) స్వాతంత్ర్య పోరాట కాలంలో ముస్లింలీగ్ ప్రతిపాదించిన రెండు జాతుల సిద్ధాంతాన్ని

ఉద్యమం మాసపత్రిక, నవంబర్ – డిసెంబర్ 2003

అనుసరించి ముస్లింలు మెజారిటీగా ఉన్న కశ్మీర్ లోయ, జమ్మూలోని మెజారిటీ జిల్లాలు పాకిస్తాన్‌కు చెందాలని నమ్ముతాయి. కొన్ని సంస్థలు ఆ చరిత్రతో నిమిత్తం లేకుండా, ముస్లింలు ఎక్కడ మెజారిటీగా ఉన్నా అక్కడ ఇస్లామిక్ రాజ్యం ఉండాలి కాబట్టి ఆ ప్రాంతాలన్నీ ఇండియా నుండి వేరుపడిపోయి ఇస్లామిక్ రాజ్యమైన పాకిస్తాన్‌లో చేరాలని నమ్ముతాయి. కొన్ని కశ్మీరీ జాతీయవాద సంస్థలు జమ్మూకశ్మీర్‌ను భారత్‌లోకి తీసుకొచ్చిన విలీనం ఒడంబడికలో అక్కడి ప్రజలకు స్వయం నిర్ణయాధికారం ఇయ్యబడింది కాబట్టి (ఇచ్చినా ఇయ్యకున్నా అది వారి ప్రజాస్వామ్య హక్కు కాబట్టి), తమ భవితవ్యాన్ని నిర్ణయించుకునే స్వేచ్ఛ ఆ ప్రజలకు ఇవ్వాలని కోరుతాయి. ప్రజలు ఏ నిర్ణయం తీసుకున్నా తమకు సమ్మతమేనని ఈ సంస్థలు అంటాయి గానీ, వీరిలో ఎక్కువభాగం ఇటు భారత్‌లో గానీ అటు పాకిస్తాన్‌లో గానీ కలవకుండా జమ్మూకశ్మీర్ స్వతంత్రంగా ఉండాలని కాంక్షించేవారే. ఈ సంస్థలలో ప్రముఖమయిన జమ్మూకశ్మీర్ లిబరేషన్ ఫ్రంట్ (జె.కె.ఎల్.ఎఫ్) తన అభిప్రాయాన్ని స్పష్టంగానే చెప్పుకుంటుంది. జమ్మూకశ్మీర్ ఒక స్వతంత్రమైన లౌకిక, ఫెడరల్, ప్రజాతంత్ర రాజ్యంగా ఉండాలనేది వారి లక్ష్యం. చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే, జె.కె.ఎల్.ఎఫ్ అనుయాయులేకాక కశ్మీరీ జాతీయవాదులందరూ లౌకిక ప్రజాతంత్ర భావాలకు అనుకూలురే.

భారత్‌లో విలీనాన్ని వివాదాస్పదమైన విషయంగా భావించే అన్ని సంస్థలకు హురియత్ కాన్ఫరెన్స్ ఉమ్మడి వేదిక అన్నది సత్యమే అయినప్పటికీ ఆ భావనలోని భిన్న కోణాలను హురియత్ కాన్ఫరెన్స్ తగుపాళ్ళలో ప్రతిబింబించదు. కశ్మీర్‌లోని సామాన్య ప్రజలలో పాకిస్తాన్ అనుకూల మతవాదం కన్నా లౌకిక కశ్మీరీ జాతీయవాదం ప్రభావమే ఎక్కువ అయినప్పటికీ హురియత్ కాన్ఫరెన్స్‌లో మొదటి కోవకు చెందిన సంస్థలే ఎక్కువ. హురియత్ కాన్ఫరెన్స్ నాయకత్వంలో యాసిన్ మాలిక్ (ఈ మధ్యనే మతవాదులు చంపేసిన), అబ్దుల్‌గనీ లోన్ తప్ప తక్కిన వారందరూ ఏదో ఒక మేరకు మతవాదులే.

ఈ వైరుధ్యానికి కారణం లేకపోలేదు. పాకిస్తాన్ సహాయం లేనిదే భారత్ మీద పోరాటం చేయడం కశ్మీరీలకు సాధ్యం కాదు కాబట్టి, ఆ సహాయం పొందడం సాధ్యం కాని కాశ్మీరీ జాతీయవాదులు అధికభాగం ఆర్గనైజ్ కాకుండా మౌనంగా ఉండిపోయారు. అందుకే పాకిస్తాన్ సహాయం దొరకగల మతవాద సంస్థలు మాత్రమే చురుకుగా పనిచేస్తుంటాయి. రెండవ కారణమూ దీనితోనే ముడిపడి ఉంది. హురియత్ కాన్ఫరెన్స్‌లో సాయుధ పోరాట సంస్థలేవీ లేవు. అన్నీ శాంతియుత మార్గాల ద్వారా ఆందోళన చేసే సంస్థలే. అయితే ఏ సంస్థకయితే వెనకాల తుపాకీ ఉంటుందో ఆ సంస్థకే హురియత్ కాన్ఫరెన్స్‌లో నోరు ఉంటుంది. జమాతే ఇస్లామి వెనక హిజ్బుల్ ముజాహిదీన్ ఉంది. కాబట్టి హురియత్‌లో జమాతే ఇస్లామి మాటకు విలువ ఎక్కువ. జె.కె.ఎల్.ఎఫ్‌కు ఇప్పుడు

లేకున్నా ఒకప్పుడు సాయుధ పోరాట విభాగం ఉండేది కాబట్టి ఆ సంస్థకు హురియత్‌లో గుర్తింపు ఉంది. ఏ దళమూ లేకపోతే గుర్తింపు ఉండదని గ్రహించిన అబ్దుల్‌గనీ లోన్ కొంత కాలం అల్‌బర్క్ అనే ఒక చిన్న సాయుధ గ్రూపును నడిపాడు. కుప్వారా జిల్లాలో రెండు తాలూకాలకు పరిమితమైన ఈ బృందం త్వరలోనే ఒక రౌడీ మూకగా మారి చెల్లాచెదరయి పోయింది. కానీ లోన్ ప్రయోజనం నెరవేరింది. అతను చనిపోయేదాకా హురియత్ కాన్ఫరెన్స్‌లో ఒక ప్రముఖ నాయకుడిగానే ఉన్నాడు.

అయితే వీరిద్దరినీ మినహాయించి వేరే ఏ కశ్మీరీ జాతీయవాద సంస్థా తన వీపు వెనక తుపాకులను సమకూర్చుకోలేక పోయింది కాబట్టి వేరే సంస్థలేవీ హురియత్ కాన్ఫరెన్స్‌లో బలం సంపాదించుకోలేక పోయాయి. చాలావరకు అసలు అందులో చేరే ప్రయత్నమే చేయలేదు. పాకిస్తాన్ నుండి సహాయం పొందే మతవాద సంస్థలు మాత్రం తుపాకులు తెచ్చుకున్నాయి, వనరులు తెచ్చుకున్నాయి, సమాజంలో పెద్ద గొంతు కాకున్నా హురియత్ కాన్ఫరెన్స్‌లో ఆధిక్యత సంపాదించుకున్నాయి.

ఇంకొక విషయం కూడా చెప్పుకుంటే కశ్మీరీ సమాజం గురించి మన అవగాహన పెరుగుతుంది. లష్కర్–ఇ–తోయిబా, జైష్–ఇ–మహమ్మద్‌ల పేర్లు మనం తరచుగా వింటుంటాం. ఇవి పాన్–ఇస్లామిక్ సంస్థలు. ఇస్లాంను బలప్రయోగం ద్వారా ప్రపంచ మంతటా వ్యాపింపజేసే కర్తవ్యంగా 'జిహాద్'ను అర్థం చేసుకుని ఆచరిస్తున్న సంస్థలు. అందులో భాగంగానే ఇవి కశ్మీర్ పోరాటంలో వచ్చి చేరాయి. ఈ సంస్థల పోరాటశీలాన్ని హురియత్ కాన్ఫరెన్స్ అభినందిస్తుంది గానీ వీరి ప్రతినిధి ఒక్కరూ హురియత్‌లో లేరు. మతం ప్రాతిపదికన కశ్మీర్ పాకిస్తాన్‌లో కలవాలని నమ్మేవారు కశ్మీర్‌లో ఉన్నారు గానీ ఈ పాన్ ఇస్లామిక్ జిహాదీ సంస్థల దృక్పథం కలిగిన మేధావులు గానీ, రాజకీయ సంస్థలు గానీ లేవు.

కశ్మీరీ సమాజానికీ, వారి స్వయం నిర్ణయాధికారం కోసం జరుగుతున్న పోరాటానికీ, దాని రాజకీయ ప్రతినిధి అయిన హురియత్ కాన్ఫరెన్స్‌కూ మధ్య ఇన్ని వైరుధ్యాలున్నప్పటికీ సగటు కశ్మీరీ జాతీయవాదులు ఆ పోరాటాన్ని మొత్తంగా తమదిగా ఆహ్వానిస్తారు. హురియత్ కాన్ఫరెన్స్‌ను దాని రాజకీయ ప్రతినిధిగా గుర్తిస్తారు. 'మా మధ్య తేడాలు మా స్వంత విషయం. దాని ఊసు మీకెందుకు? మీరు పోరాటకారులతోనూ హురియత్ కాన్ఫరెన్స్‌తోనూ చర్చలు జరపండి' అని అంటారు.

అయితే భారత ప్రభుత్వం హురియత్ కాన్ఫరెన్స్‌ను ఏ అర్థంలోనూ కశ్మీరీ ప్రజల రాజకీయ ప్రతినిధిగా గుర్తించడానికి సిద్ధంగా లేదు. "జమ్మూకశ్మీర్‌లో ఎన్నికయిన ప్రజాప్రభుత్వం ఉంది. ఏదైనా మాట్లాడేది ఉంటే వారితో మాట్లాడుతాం. వేరే ఎవరితోనయినా ఎందుకు మాట్లాడుతాం?" అనేది భారత్ వైఖరి. వేరొక సందర్భంలో ఇది సహేతుకమైన వైఖరే అయివుండేదేమో గానీ కశ్మీర్ విషయంలో కాదు. ఎన్నికలలో పాల్గొనే పార్టీలు

జమ్మూకశ్మీర్ భారత్‌లో శాశ్వతంగా విలీనమయిపోయిందని నమ్మే పార్టీలు. వేర్పాటు కాంక్ష గురించి వారితో మాట్లాడేది ఏం ఉంటుంది? దాని గురించి వేర్పాటు కాంక్షకు ప్రాతినిధ్యం వహించే సంస్థలతో మాట్లాడాలి. అంటే ఆ సంస్థల ఐక్యవేదిక అయిన హురియత్ కాన్ఫరెన్స్‌తో మాట్లాడాలి. ఇది హురియత్ జవాబు. కానీ వేర్పాటును కాంక్షించే వారే తప్ప విలీనాన్ని అంగీకరించేవాళ్ళు కశ్మీరీలు కారా అని ప్రభుత్వం అనేటట్టయితే రాజకీయ ప్రతినిధులందరితోనూ (తగు రూపంలో) చర్చలు జరపవలసి ఉంటుందే తప్ప అననుకూల వర్గాన్ని చూడనే చూడమని అంటే ఎట్లా?

అయితే మొన్నటి వరకు హురియత్ కాన్ఫరెన్స్ కూడా భారత్‌తో ద్వైపాక్షిక చర్చలకు సుముఖంగా లేదు. ఇండియా, పాకిస్తాన్, కశ్మీర్ ప్రతినిధులు త్రైపాక్షికంగా కూర్చొని మాట్లాడుకోవాలని వారి డిమాండు. దీనికి వారు రెండు కారణాలు చెప్పేవారు. పాకిస్తాన్ కూడా 'కశ్మీర్ వివాదం'లో భాగమే కాబట్టి వారు కూడా చర్చలలో భాగం కావాలన్నది ఒక కారణం. పాత జమ్మూకశ్మీర్ భూభాగం ఇండియాలోనే కాక పాకిస్తాన్‌లోనూ ఉంది కాబట్టి కశ్మీరీలు ఇద్దరితోనూ మాట్లాడక తప్పదనేది రెండవ కారణం. ఇందులో మొదటి కారణాన్ని హురియత్ కాన్ఫరెన్స్‌లోని మతవాద సంస్థలు నొక్కి చెప్పగా, రెండవది కశ్మీరీ జాతీయవాదులు ప్రధానంగా చెప్పే కారణం.

ఇప్పుడు భారత్ వైఖరీ, హురియత్ కాన్ఫరెన్స్ వైఖరీ కూడా మారినట్టు అనిపిస్తుంది. హురియత్‌తో నేరుగా మాట్లాడడానికి భారత ప్రభుత్వం సిద్ధపడగా, భారత్‌తో ద్వైపాక్షిక చర్చలకు హురియత్ సిద్ధపడింది. ఈ మార్పును అర్థం చేసుకోవాలంటే ఈ మధ్యకాలంలో జరిగిన కొన్ని పరిణామాలను అర్థం చేసుకోవాలి.

ఒకటి, హురియత్ కాన్ఫరెన్స్ ఇప్పుడు చీలింది. కశ్మీర్‌లో ఇప్పుడు రెండు హురియత్ కాన్ఫరెన్స్‌లు ఉన్నాయి. ఒక దానిని పాకిస్తాన్ అధికారికంగా 'అసలయిన హురియత్ కాన్ఫరెన్స్'గా గుర్తించింది. రెండవ దానితో భారత్ మాట్లాడడానికి సిద్ధపడింది. ఎన్నికలలో దొంగచాటుగా పాల్గొంటున్న సంస్థలను బహిష్కరించాలా, అక్కరలేదా అనేది ఈ చీలికకు కారణమైన వివాదంగా కనిపించినప్పటికీ, దాని వెనక అంతకంటే బలమైన తేడాలున్నాయనేది స్పష్టమే. సాయుధ పోరాటానికిచ్చే ప్రాముఖ్యాన్ని తగ్గించి రాజకీయ చర్చల ద్వారా వివాదాన్ని పరిష్కరించుకునే ప్రయత్నాన్ని మొదలుపెట్టాలనీ, కశ్మీరీల పోరాటాన్ని పాకిస్తాన్ తన స్వప్రయోజనాల కోసం వాడుకుంటున్నదని గుర్తించి కశ్మీరీల ప్రయోజనాలనే ప్రధానం చేయాలనీ ఒక వర్గం భావించగా, ఇది పోరాటాన్ని నీరుగార్చి భారత్‌తో రాజీపడటానికి నాంది అని వైరివర్గం అభియోగం. వారితో మాట్లాడడానికి భారత్ సిద్ధపడడం, భారత్‌తో ద్వైపాక్షికంగా మాట్లాడడానికి వారు సిద్ధపడడం – వీరి అభియోగానికి బలం చేకూర్చినట్టయింది. అబ్దుల్‌గనీ లోన్ బతికి ఉన్నట్టయితే మొదటి

వర్గానికి అతనే బహుశా ప్రధాన ప్రతినిధి అయి వుండేవాడు. అందుకే మిలిటెంట్లు అతనిని కాల్చి చంపారు. అయినప్పటికీ హురియత్‌లో అత్యంత ప్రతిష్ఠగల నాయకులయిన మౌల్వీ ఫరూఖ్, అబ్దుల్‌గనీ భట్ ఆ వర్గాన్ని నడిపించారు. ఉద్దేశ్యపూర్వకంగానే మైనారిటీ షియాల ప్రతినిధి అయిన మౌల్వీ అబ్బాస్ అన్సారీని దానికి ఛైర్మన్ చేశారు. చీలికవర్గానికి ముందు నుండి మిలిటెంట్‌ల ప్రధాన ప్రతినిధిగా ఉన్న సయ్యద్ ఆలీషా గిలానీ నాయకత్వం వహించాడు.

భారత్‌తో చర్చలకు సిద్ధపడిన అన్సారీ వర్గం కూడా తాము త్రైపాక్షిక చర్చలు జరగాలన్న అభిప్రాయాన్ని గానీ, పాకిస్తాన్ కూడా కశ్మీర్ వివాదంలో భాగమేనన్న అభిప్రాయాన్ని గానీ విడిచిపెట్టలేదనీ, దానికొక తొలిమెట్టుగా మాత్రమే భారత్‌తో ద్వైపాక్షిక చర్చలకు ఒప్పుకున్నామనీ అంటున్నది. పోరాట ఆవశ్యకతను తిరస్కరించడం లేదు గానీ రాజకీయ పరిష్కార మార్గాలు అన్వేషించడం అవసరం అని భావిస్తున్నామని అంటున్నది. ఇదంతా లొంగుబాటుకు ఒక సాకేనా అనేది రాబోయే దినాలలో తేలగలదు. కానీ కశ్మీరీ సమస్యలో వీరి అభిప్రాయానికి మద్దతు లేకపోలేదని గుర్తించడం అవసరం. మిలిటెంట్లు హతమార్చిన అబ్దుల్‌గనీ లోన్ మొదటి వర్ధంతి రోజున ఆంధ్రప్రదేశ్, పంజాబుల నుండి వెళ్ళిన ఒక హక్కుల బృందం కశ్మీర్‌లోని కుప్వారా జిల్లాలో పర్యటిస్తూ ఉంది. మిలిటెంట్లకు ప్రధాన స్థావరమైన ఆ జిల్లా నుండి లోన్ ప్రథమ వర్ధంతి సభకు శ్రీనగర్‌కు వందలాది వాహనాలలో తరలి వెళ్తున్న జనాన్ని చూస్తే లోన్ అభిప్రాయాలకు ప్రజా పునాది లేకపోలేదని స్పష్టంగా అర్థం అయింది. కశ్మీరీలు ఈ 13 సంవత్సరాలలో దాదాపు 50 వేల ప్రాణాలు పోగొట్టు కున్నారు. అంతకు పదిరెట్ల ప్రజలు చిత్రహింసలు, ఇళ్ళ విధ్వంసం, లూటీ అనుభవించారు. తుపాకీ ద్వారా కాకుండ అన్య మార్గాల ద్వారా కశ్మీరీ జాతీయవాద లక్ష్యాన్ని సాధించుకునే ప్రయత్నం వారికి ఆకర్షణీయంగా కనిపించడం సహజం. వారిని గానీ దానికి స్పందిస్తున్న సంస్థలను గానీ దూరం నుండి తప్పుపట్టడం ఉచితం కాకపోవచ్చు. ఈ ప్రయత్నం నాయకుల అవకాశవాదానికీ భారత్ ఎత్తుగడలకూ అందరి నెత్తినా కూర్చున్న అమెరికా స్వార్థానికీ బలయ్యే ప్రమాదం లేదా అంటే ఉంది. కానీ అనంతంగా రక్తం ఓడుతూ ఉండమని కశ్మీరీలను శాసించడానికి మనమెవరం?

# కశ్మీర్ సరిహద్దు వెతలు

'దేశభక్తి' గల వాళ్ళంతా దేశ సరిహద్దుల గురించి చాలా ఆవేశపడుతుంటారు. వాటిని పొరుగు దేశాలు దురాక్రమించకుండా చూడడం ప్రభుత్వానికి వుండే ముఖ్య కర్తవ్యాలలో ఒకటని నమ్ముతారు. అందుకోసం ప్రభుత్వం ఏం చేసినా తప్పులేదని విశ్వసిస్తారు.

ఇది సరిహద్దుకు దూరంగా, దేశం లోపల వుండే దేశభక్తుల సంగతి. సరిహద్దు దగ్గర బతికే వాళ్ళకు కూడా దేశభక్తి వుంటుంది, అయితే దేశభక్తికీ దేశ సరిహద్దుకూ మధ్యనున్న సంబంధం వారికి కొంచెం భిన్నంగా కనిపిస్తుంది. సరిహద్దును పొరుగు దేశాల నుంచి కాపాడడానికి ప్రభుత్వం చేపట్టే చర్యలకు బలి అయ్యేది ఈ ప్రజలే. దూరాన బతికేవాళ్ళు సరిహద్దు భద్రత గురించి చేసే ప్రేలాపన వారికి అవాస్తవికంగా ధ్వనించవచ్చు. ఒక్కొక్కసారి హాస్యాస్పదంగానూ ధ్వనించవచ్చు. భారత పాకిస్తాన్‌లు కశ్మీర్ వివాదాన్ని ఏదో ఒక రకంగా పరిష్కారం చేసేసుకుని తమను పాకిస్తాన్‌లో పడేసినా ఫరవాలేదు గానీ ఈ నిత్య ఘర్షణను ఇంక భరించలేం అని జమ్మూ ప్రాంతపు సరిహద్దు వాసులయిన హిందువులు విసుక్కుంటున్నారంటే ఎంతమంది నమ్ముతారు?

భారతదేశానికీ పాకిస్తాన్‌కూ దీర్ఘమైన విభజన రేఖ వుంది. అది గుజరాత్‌లో మొదలయి రాజస్తాన్, పంజాబ్, జమ్మూకశ్మీర్‌ల మీదుగా పోయి లదాఖ్‌లోని కార్గిల్‌లో ముగుస్తుంది. ఈ సరిహద్దు సమీపంలో కొన్ని లక్షల కుటుంబాలు నివసిస్తున్నాయి. వారు బుద్ధిపూర్వకంగా సరిహద్దు సమీపంలో వచ్చి వుండడం లేదు. సరిహద్దే వారి ఊర్ల మధ్య 1947లో పుట్టింది. అప్పటి నుండి ఇప్పటిదాకా వారు అనుభవించిన అణచివేత వర్ణనాతీతం.

గుజరాత్ నుండి జమ్మూలో సగభాగం దాకా ఈ సరిహద్దు ఇరుదేశాలూ అంగీకరించే అంతర్జాతీయ సరిహద్దు (ఐ.బి). అది జమ్మూలోని అఖ్నూర్ తాలూకాలోని పల్లన్‌వాలా గ్రామంలో ముగుస్తుంది. అక్కడి నుండి కార్గిల్ దాకా వున్న విభజన రేఖ వివాదాస్పదమయిన 'వాస్తవాధీన రేఖ' (ఎల్.ఓ.సి).

---

మానవహక్కుల వేదిక బులెటిన్-6, ఫిబ్రవరి 2004

గుజరాత్ నుండి అఖ్నూర్ దాకా ఈ విభజన రేఖ వెంబడి నివసించే జనం అత్యధిక భాగం హిందువులు. అక్కడి నుండి కార్గిల్ దాకా వాస్తవాధీన రేఖ వెంబడి నివసించే వారిలో ముస్లింలు ఎక్కువ. పోను పోను అంతా ముస్లింలే.

గుజరాత్ నుండి అఖ్నూర్ దాకా ఈ విభజన రేఖ మైదాన ప్రాంతంలో వుంది. అక్కడి నుండి కొండలలోకి ప్రవేశిస్తుంది. పోను పోను ఆ కొండలు చాలా ఎత్తయినవి. ప్రపంచంలోనే అన్నిటికంటే ఎత్తయిన యుద్ధక్షేత్రంగా పేరుపొందిన సియాచిన్ ఇక్కడే వుంది.

అంతర్జాతీయ సరిహద్దు సమీపంలో నివసించే కుటుంబాలు భారత పాకిస్తాన్‌ల మధ్య యుద్ధం వచ్చినప్పుడల్లా తమ ఇళ్ళూ పొలాలూ విడిచిపెట్టి లోపలికి తరలివచ్చారు. 1947లో ఒకసారి, 1965లో ఒకసారి, 1971లో ఒకసారి ఇది జరిగింది. ఆ తరువాత యుద్ధం ఎప్పుడూ జరగలేదు గానీ సరిహద్దు దగ్గర సైన్యాల మోహరింపు, కాల్పులు జరిగాయి. 1989లో కశ్మీర్ లోయలో స్వయం నిర్ణయాధికార పోరాటం మిలిటెంట్ రూపం తీసుకున్నప్పటి నుంచి ఈ టెన్షన్ నిరంతరాయంగా వుంది. 1999లో కార్గిల్ ఘర్షణ తరువాత ఇది పెరిగింది. 2001 డిసెంబర్ 13న భారత పార్లమెంట్‌పైన మిలిటెంట్ల దాడి జరిగిన తరువాత భారత్ 10 నెలలపాటు సరిహద్దు దగ్గర 7 లక్షల సైన్యాన్ని మోహరించింది. అప్పుడు మళ్ళీ అంతర్జాతీయ సరిహద్దు దగ్గరి గ్రామాలను ఖాళీచేయించి అందరినీ లోపలికి తరలించారు.

ఊరు ఖాళీ చేసి వెళ్ళిపోతే పొలాలు బీడుపడతాయి. ఇళ్ళు పాడుబడి గోడలలో మొక్కలు మొలుస్తాయి. చిన్నాచితక వ్యాపారాలూ వృత్తులూ దెబ్బతింటాయి. పిల్లల చదువులకు భంగం కలుగుతుంది. పది సంవత్సరాలకొకసారి ఇది జరిగినట్టయితే ఆ కుటుంబాలు కోలుకోవడం కష్టం. గుజరాత్ నుండి జమ్మూలోని అఖ్నూర్ తాలూకా దాకా వేలాది కుటుంబాలు ఈ దుర్గతిని అనుభవించాయి, అనుభవిస్తున్నాయి.

13 డిసెంబర్ 2001 తరువాత జరిగిన వలసలో ఒక్క జమ్మూ జిల్లాలోనే 28,000 కుటుంబాలు సరిహద్దు గ్రామాలను విడిచిపెట్టి లోపలికి వచ్చాయని జమ్మూ జిల్లా డిప్యూటీ కమిషనర్ (మన భాషలో జిల్లా కలెక్టర్) అంటాడు. అన్ని రాష్ట్రాలలోని అన్ని జిల్లాలనూ లెక్కలోకి తీసుకుంటే ఒక లక్షకు పైగా కుటుంబాలు వలస వచ్చి వుంటాయని నిస్సందేహంగా చెప్పవచ్చు.

ఇలా వలసవచ్చిన వారికి సమగ్రమైన పునరావాసం కల్పించే ప్రయత్నం జమ్మూకశ్మీర్ ప్రభుత్వం చేయలేదు. సరిహద్దు నుండి ఒక ఇరవై కిలోమీటర్లు లోపలికి వున్న దేవీపూర్ అనే గ్రామం దగ్గర 2800 గుడారాలను రాష్ట్ర ప్రభుత్వం రెడ్‌క్రాస్, ఆక్స్‌ఫాం సంస్థల సహాయంతో వేసింది. జమ్మూ జిల్లా సరిహద్దు ప్రాంతం నుండి వలస

వచ్చిన 28,000 కుటుంబాలకూ ఇదే ప్రభుత్వం కల్పించిన విడిది. ఒక్కొక్క గుడారంలో ఒకటి, అథవా రెండు కుటుంబాల కంటే వుండలేరు కాబట్టి మెజారిటీకి ప్రభుత్వం పునరావాసం కల్పించనట్టే లెక్క. వారంతా ఏం చేశారంటే బంధువుల ఇళ్ళల్లోనో, కిరాయి నివాసాలలోనో కాలం వెళ్ళదీశారు.

అందరికీ గుడారాలు ఇవ్వకపోయినా తిండిగింజలు మాత్రం ప్రభుత్వం సరఫరా చేసింది. మనిషికి నెలకు 2 కిలోల బియ్యం, 9 కిలోల గోధుమ పిండి, తలసరి నెలకు 400 రూపాయల నగదు (కుటుంబంలో నలుగురికి మాత్రమే) ఇచ్చింది. ఈ 'రేషన్' మీదనే ఎవరూ బతకలేరనేది స్పష్టమే. అయితే వేరే పని ఏదీ అందరికీ దొరకడం సాధ్యం కాదు కాబట్టి అధికభాగం కాందిశీకులు 10 నెలలపాటు అర్ధాకలితో బతికారు. పిల్లల చదువులు వలస వచ్చిన చోట కొనసాగించడానికి కొంత ఏర్పాటు జరిగినప్పటికీ అది అసంతృప్తికరంగానే వుండింది.

పార్లమెంటుపైన దాడి తరువాత భారత ప్రభుత్వం సరిహద్దు దగ్గర జరిపిన సైన్యం మోహరింపునకు 'ఆపరేషన్ పరాక్రమ్' అని పేరు పెట్టారు. పాకిస్తాన్‌పైన ఒత్తిడిపెట్టి సరిహద్దుకు ఆవలి నుండి ఈవలికి సాయుధ మిలిటెంట్లను పంపే ప్రక్రియను (సీమాంతర ఉగ్రవాదాన్ని) ఆపించాలని భారత్ లక్ష్యం. అయితే మోహరింపు కొనసాగించినట్టయితే ఏ ఒక్క తొందరపాటు చర్య అయినా యుద్ధానికీ అణుయుద్ధానికీ దారితీసే ప్రమాదం వుందన్న భయంతో ఇతర దేశాలు విరమించమని భారత్‌పైన ఒత్తిడి పెట్టాయి. 10 నెలల తరువాత భారత్ 'ఆపరేషన్ పరాక్రమ్'ను ఉపసంహరించింది.

ఉపసంహరించిన తరువాత, వలస వచ్చిన కుటుంబాలన్నిటినీ తిరిగి తమ సరిహద్దు సమీప గ్రామాలకు పొమ్మని చాలా ఒత్తిడి పెట్టారు. గుజరాత్, రాజస్తాన్, పంజాబ్‌లలో ఇది సాఫీగానే జరిగింది గానీ జమ్మూ ప్రాంతంలో వలస వచ్చినవారు వెనక్కి పోవడానికి పెద్దగా సుముఖత చూపలేదు. మాటిమాటికీ పొలాలు బీడుపెట్టి వలసవచ్చే ఈ గతి ఎన్నాళ్ళు అనుభవిస్తాం. మాకు లోతట్టు ప్రాంతంలో శాశ్వత పునరావాసం కల్పించండి అని ప్రభుత్వాన్ని కోరారు. 'కశ్మీర్ సమస్య' విషయంలో భారత పాకిస్తాన్‌ల మధ్య సయోధ్య ఎప్పటికయినా కుదురుతుందన్న నమ్మకం సరిహద్దు ప్రజలలో అసలే లేదు.

'హిందూస్తాన్ మొత్తం నాశనమయినా సరే కశ్మీర్‌లో ఒక్క అంగుళం కూడా వదులుకోవడానికి భారత్ సిద్ధపడదు. పాకిస్తాన్ కూడా అంతే. ఈ రెండు దేశాలలో ఏ నాయకుడు రాజీకి సిద్ధపడినా వాడి కుర్చీ పోతుంది' ఈ మాటలు అంటున్నది జమ్మూ జిల్లాలోని దేవీపూర్ క్యాంపులోని ఒక హిందూ కాందిశీకుడు. దాదాపు సరిహద్దు ప్రాంతం వారందరి అభిప్రాయమూ ఇదే. అందుకే వారు రాష్ట్రం లోపలి భాగంలో శాశ్వత పునరావాసం కల్పించమని కోరుతున్నారు.

కానీ ప్రభుత్వం ససేమిరా అంటున్నది. 'వాళ్ళ భూములలో పెరిగిన మొక్కలు పీకించి బాగుచేయడానికీ వాళ్ళకు పక్కా ఇళ్ళు కట్టియ్యడానికీ ఒక ప్రతిపాదన తయారు చేసి కేంద్ర ప్రభుత్వానికి పంపాము. అది సరిహద్దు ప్రాంతం కాబట్టి ఏ నిర్మాణమైనా కేంద్రం అనుమతితోనే జరగాలి. అనుమతి రాగానే చేసేస్తాం. అంతే తప్ప లోపలి ప్రాంతాలలో పునరావాసం ఏర్పాటు చేసే ఆలోచన లేదు. అది జరగదు' అని జమ్మూ జిల్లా డిప్యూటీ కమిషనర్ కచ్చితంగా అంటారు. అయినా సరే మొండిగా మేము తిరిగి పోమని ఎవరయినా అంటే వారి 'రేషన్' నిలిపివేస్తామని ప్రభుత్వం స్పష్టం చేసింది. వెనక్కిపోయినట్టయితే భూములు మళ్ళీ సాగు యోగ్యం అయ్యేదాకా 'రేషన్' ఇస్తాము గానీ పోకపోతే మీకు ఒక్క గింజ కూడా ఇచ్చేది లేదనింది. ఈ విధంగా ఒత్తిడిపెట్టి చాలా మందిని వెనక్కి పంపించేశారు.

ప్రభుత్వం అనుసరిస్తున్న ఈ మొండివైఖరికి కారణం ఏమిటని అడిగితే చెప్పరు గానీ మనం ఊహించడం కష్టం కాదు. సరిహద్దు ప్రజలను లోపలికి తీసుకొచ్చి పునరావాసం కల్పించడమంటే భారత ప్రభుత్వం తన చేతకానితనాన్ని ఒప్పుకోవడమేనని ప్రస్తుతం దేశాన్ని ఏలుతున్న కాషాయ దేశభక్తి భావిస్తున్నది. తలచుకుంటే పాకిస్తాన్‌పైన అరక్షణంలో దాడిచేసి తరతరాలు జ్ఞాపకం పెట్టుకునేటట్టు భారత్ బుద్ధిచెప్పగలదని కదా వారి నిత్య ప్రగల్భం. అటువంటి వారు ఈ తగాదా ఇప్పట్లో తెగేది కాదని ఒప్పుకొని సరిహద్దు జనాన్ని శాశ్వతంగా సురక్షిత ప్రాంతాలకు ఎట్లా తరలిస్తారు? వారి 'పౌరుషానికి' ప్రజలు బలికాక తప్పదు మరి.

జమ్మూ ప్రాంత కాందిశీకులకు ఇంకొక రెండు ఫిర్యాదులున్నాయి. అందరికీ పునరావాస శిబిరాలు కల్పించకపోయినా తిండిగింజలు, రొక్కం కొంత ఇచ్చారని చెప్పాము. అది జరుగుబాటుకు సరిపోదని కూడా సూచించాము. జమ్మూ కాందిశీకులు తమ పరిస్థితిని కశ్మీర్ పండిట్‌లతో పోల్చుకుని, 'అందరమూ వలసవచ్చిన కాందిశీకులమే కదా, మా మధ్య ఈ వివక్ష ఎందుకు?' అని అడుగుతున్నారు. కశ్మీర్ లోయలో మిలిటెన్సీ కారణంగా కశ్మీర్ పండిట్‌లు 1990తో మొదలుపెట్టి లోయ నుండి జమ్మూకు వచ్చి కాందిశీకులుగా వుంటున్నారు. వాళ్ళకు దశాబ్దం పైగా ప్రభుత్వం 'రేషన్' ఇస్తున్నది. తలసరి నెలకు 5 కిలోల బియ్యం, 11 కిలోల గోధుమ పిండి, కుటుంబానికి నెలకు 3000 రూపాయల దాకా రొక్కం ఇస్తుంది ప్రభుత్వం. కానీ సరిహద్దు నుండి తరలివచ్చిన జమ్మూ కాందిశీకులకు 2 కిలోల బియ్యం, 9 కిలోల గోధుమపిండి, కుటుంబానికి గరిష్ఠం 1600 రూపాయలు ఇస్తున్నారు.

ఈ వ్యత్యాసానికి కారణం ఎవ్వరూ చెప్పకపోగా, దేవీపూర్ శిబిరంలో మాత్రం దాని గురించి రకరకాలుగా జోక్ చేసుకుంటున్నారు. పండిట్‌లు 'ఎ' క్లాస్ కాందిశీకులు కాగా తాము 'బి' క్లాస్ అని ఒకరు (పండిట్‌లు అందరూ బ్రాహ్మణులు కాగా, జమ్మూ

సరిహద్దువాసులు అధికభాగం అబ్రాహ్మణులనేది వాస్తవం), 'వాళ్ళు తెల్లగా వుంటారు. మేము నల్లగా వుంటాం' అని ఇంకొకరు అంటున్నారు. జమ్మూ వాసులు మనకంటే 'తెల్లగా'నే వుంటారు గానీ కశ్మీరీలతో పోలిస్తే 'నలుపే'!

ఇంకొక ఫిర్యాదు మందుపాతరలకు సంబంధించినది. యుద్ధ ప్రమాదం దగ్గరికొచ్చినప్పుడు శత్రుసైన్యాలు దేశంలోకి ప్రవేశించకుండా ఆపడం కోసం సరిహద్దు దగ్గర మందుపాతరలు పెట్టే యుద్ధతంత్రం తెలిసిందే. ట్యాంకుల వంటి భారీ వాహనాలు ప్రవేశిస్తే వాటి ఒత్తిడికి పేలి వాటిని ధ్వంసం చేసేవి ఒక రకం మందుపాతరలు కాగా, మనిషి కాలుపెడితే కూడా పేలి ఆ మనిషిని చంపేవి రెండవ రకం. ఈ రెండవ రకాన్ని ఇంగ్లీష్‌లో anti-personnel mines అంటారు. ఈ మందుపాతరలు సరిహద్దు దగ్గర నివసించే మనుషులకు, వారి పశువులకు కూడా హానికరం కాబట్టి వీటిని పూర్తిగా నిషేధించాలన్న ప్రయత్నం ఐక్యరాజ్య సమితి కొంత కాలంగా చేస్తున్నది. 1996లో మొదలయిన ఈ ప్రయత్నం ఒక మందుపాతరల నిషేధ ఒప్పందం (Mine Ban Treaty) రూపం తీసుకుంది. 2003 మే 13 నాటికి 147 దేశాల దానిపైన సంతకం చేశాయి. వాటిలో 134 దేశాల ఆ ఒప్పందాన్ని తమ దేశాలు రాజ్యాంగాలు నిర్దేశించే పద్ధతిని అనుసరించి ఆమోదించాయి. సంతకం చేయని దేశాలు కేవలం 46. ఈ 'ఉగ్రవాదుల'లో మనం ఉన్నాము, మన పొరుగు వారయిన పాకిస్తానీలున్నారు, ఇద్దరికీ కావలసిన అమెరికా వారున్నారు!

2001 డిసెంబర్ 13 తరువాత సరిహద్దు వద్ద జరిగిన సైనిక మోహరింపులో భాగంగా భారత్ మందుపాతరలను విస్తృతంగా అమర్చింది. ఈ అమరిక అంతర్జాతీయ సరిహద్దు వద్దా జరిగింది, దానికి కొనసాగింపైన వాస్తవాధీన రేఖ వద్ద కూడా జరిగింది.

వాస్తవాధీన రేఖ వెంబడి అమర్చిన మందుపాతరల వల్ల చాలామంది సరిహద్దు వాసులు ప్రాణాలు, శరీర అంగాలు పోగొట్టుకున్నారు (దీనికి గల కారణాలను దిగువ చూద్దాం). కాగా అంతర్జాతీయ సరిహద్దు వద్ద మనుషుల ప్రాణాలు ఎక్కువ పోకపోయినా వారి పశువులు అపారంగా చనిపోయాయి.

మందుపాతరలు ఫలానాచోట దాకా వున్నాయని ప్రజలకు చూచాయగా మాత్రమే తెలుసు. అయితే అంతర్జాతీయ సరిహద్దు ఎక్కువ భాగం పల్లపు మైదానంలో వుంది కాబట్టి ఆ ఊహాత్మక రేఖను ప్రజలు పాటించగలిగారు. ప్రాణాలు కాపాడుకోగలిగారు. కానీ తమ పశువులను కాపాడుకోవడం వారికి సాధ్యం కాలేదు. మేతకోసం సరిహద్దు సమీపానికి పోయి మందుపాతరలను తొక్కి కాళ్ళు, ప్రాణం పోగొట్టుకున్న పశువులు 'వేల సంఖ్యలో' వున్నాయని అధికారులే ఒప్పుకుంటున్నారు. వాటి సంఖ్య కచ్చితంగా ఎందుకు తెలియదంటే ఈ విధంగా చనిపోయిన, అంగవైకల్యం పొందిన పశువుల యజమాన్లకు ఏ రకమైన నష్టపరిహారం ఇవ్వడం లేదు. మొదట్లో ఈ సంగతి తెలియని

రైతులు అర్జీలు పెట్టుకున్నారు. అయితే అందుకోసం మూడు సర్టిఫికెట్లు తేవలసి వచ్చేది. పశువు నిజంగా చచ్చిందని వెటరినరీ డాక్టర్ సర్టిఫికెట్, అది మందుపాతర వల్లనే చచ్చిందని పోలీసు సర్టిఫికెటు, ఆ పశువు ఈ అర్జీదారుకు చెందినదే అని గ్రామ అధికారి సర్టిఫికెటు పెట్టాల్సి వచ్చేది. ఇంతాచేస్తే అసలు నష్టపరిహారం ఇచ్చే పాలసీయే లేదని గ్రహించి ఉసూరుమన్నారు.

ఇప్పుడు మందుపాతరలు మొత్తం తవ్వి తీసేస్తేనే వెనక్కి తిరిగిపోతామని కాందిశీకులు అనడంతో అంతర్జాతీయ సరిహద్దుకు సంబంధించినంత వరకు ఆ పని చేసేశారు.

వాస్తవాధీన రేఖ వెంబడి వున్న ఆవాసాల ప్రజలది మరీ దుర్భరమైన పరిస్థితి. దీనికి చాలా కారణాలున్నాయి. అంతర్జాతీయ సరిహద్దు ఉభయ దేశాలూ ఆమోదించే సరిహద్దు కాబట్టి అక్కడ నిత్యం కాల్పులు జరగవు. భారత్ – పాక్ సంబంధాలు వేడెక్కినప్పుడు మాత్రమే జరుగుతాయి. వాస్తవాధీన రేఖ వివాదాస్పద సరిహద్దు కాబట్టి దానిని ఇటూ అటూ నెట్టే ప్రయత్నంలో రెండు సైన్యాలూ నిత్యం కాల్పులు జరుపుతూనే వుంటాయి. ఈ కాల్పులు తుపాకీ కాల్పులే అయినట్టయితే ప్రజలకు అపాయం వుండేది కాదు గానీ ఇప్పుడు కొన్ని సంవత్సరాలుగా ఫిరంగులు వాడడం పరిపాటి అయింది. ఈ ఫిరంగుల దెబ్బకు సరిహద్దు ప్రజలు చనిపోవడం, అంగవైకల్యం పొందడం ఎంత మామూలు విషయం అయిపోయిందంటే, రాష్ట్ర ప్రభుత్వం సరిహద్దు దగ్గర ఫిరంగి గుండ్ల వల్ల చనిపోయిన వారి కుటుంబాలకు 1 లక్ష రూపాయలు, శాశ్వతంగా వికలాంగులయిన వారికి 75,000 రూపాయలు నష్టపరిహారం ఇచ్చే జీవో జారీ చేసింది.

రెండవ సమస్య ఏమిటంటే, పాకిస్తాన్ వైపు నుండి ఇండియా వైపునకు మిలిటెంట్లు 'చొరబడే' ప్రాంతం ఈ వాస్తవాధీన రేఖే. వాళ్ళు రేఖ దాటడానికి వెసులుబాటు కల్పించడం కోసం పాకిస్తాన్ సైన్యం భారత సైన్యాన్ని కాల్పులతో వెనక్కినెట్టే ప్రయత్నం చేస్తుంటుంది. 'చొరబాటుదార్లు' రేఖ దగ్గరకు రాకుండా నిలువరించడానికి ఇవతలి వైపు నుండి భారత సైన్యం అంతే పట్టుదలతో కాల్పులు జరుపుతుంటుంది. ఈ కారణంగా కూడా వాస్తవాధీన రేఖ దగ్గర ఎడతెరిపి లేకుండా కాల్పులు జరుగుతుంటాయి. అందువల్ల సరిహద్దువాసులయిన ప్రజలు నిత్యం ఫిరంగి గుండ్లను ఎదుర్కొంటుంటారు.

'చొరబాటుదార్ల' కారణంగా వాస్తవాధీన రేఖ వద్ద మందుపాతరలు మరింత దట్టంగా వుంటాయి. వాటిని తొలగించడం ఎప్పుడూ జరగదు కాబట్టి మందుపాతరలు తొలగిస్తే వెనక్కి పోతాం అని షరతుపెట్టే అవకాశం ఇక్కడ లేదు. అవి వుంటుండగానే వెనక్కి పోవాలి, పోయి బతకాలి. లేదా కాందిశీకులకు ప్రభుత్వం ఇస్తున్న రేషన్ వదులుకుని తమ చావు తాము చూసుకోవాలి.

వాస్తవాధీన రేఖ వద్ద ఇంకొక సమస్య ఏమిటంటే అంతర్జాతీయ సరిహద్దు లాగ ఇది మైదాన ప్రాంతం కాదు. కొండ ప్రాంతం. అఖ్నూర్ తాలూకాలోని పల్లన్‌వాలా గ్రామం వద్ద అంతర్జాతీయ సరిహద్దు అయిపోతుంది, మైదానమూ అయిపోతుంది. అక్కడి నుండి కొండ ప్రాంతం, వాస్తవాధీన రేఖ మొదలవుతాయి. చిన్నచిన్న కొండలుగా మొదలయి కశ్మీర్ చేరేసరికి బాగా ఎత్తు పెరిగి కార్గిల్ చేరేలోపల ప్రపంచంలోనే అతి ఎత్తయిన యుద్ధక్షేత్రమైన సియాచిన్ తగులుతుంది. ఇది కొండప్రాంతం, పోనుపోను మంచుకొండల ప్రాంతం కావడం వల్ల వాస్తవాధీన రేఖ ఎక్కడుందో కచ్చితంగా ఎవరూ చెప్పలేరు. ప్రజలు తమకే తెలియకుండా ఇండియా నుండి పాకిస్తాన్‌లోకి, పాకిస్తాన్ నుండి ఇండియాలోకి 'చొరబడు'తుంటారు. ఆ విధంగా తెలియకుండానే ప్రాణాపాయాన్ని కొని తెచ్చుకుంటుంటారు.

ఈ సమస్య ఎక్కువగా ఎదుర్కొనేది పశువుల కాపర్లయిన గుజ్జర్, బఖర్‌వాల్ తెగలు. కొండ ప్రాంతంలోని వాస్తవాధీన రేఖ సమీపంలో అత్యధికంగా నివసించేది వీరే. రెండు దేశాల సైన్యాలు పేల్చుకునే ఫిరంగి గుండ్లకు, భారత సైన్యం అమర్చిన మందుపాతరలకు, మిలిటెంట్ల తూటాలకు, భారత సైన్యం తూటాలకు అత్యధికంగా బలి అవుతున్నది, బలి అయింది వీరే. గడచిన యాభై ఏళ్ళలో తాతల తరంలో, తండ్రుల తరంలో, పిల్లల తరంలో ఒక్కొక్కరిని కోల్పోయిన కుటుంబాలు వీరిలో అనేకం వున్నాయి. అయితే ఈ ప్రజలకు రాజకీయ ప్రతినిధులు గానీ వీరి సమస్యల గురించి రాయగల మేధావులు గానీ లేరు. వీరు జమ్మూ ప్రాంతవాసుల భాష అయిన డోగ్రీ గానీ కశ్మీర్ లోయ భాష అయిన కశ్మీరీ గానీ, సరిహద్దు ప్రాంతంలోని ప్రధాన సామాజిక వర్గాలు మాట్లాడే పహాడీ గానీ మాట్లాడరు. వీరి భాష గోజ్రీ. రూపురేఖలలోనూ సంస్కృతిలోనూ విలక్షణంగా వుంటారు. ఎప్పటికయినా వీరికి నోరొచ్చి మాట్లాడడం మొదలుపెడితే యాభై ఏళ్ళ భారత – పాక్ వైరం వల్ల అత్యధికంగా నష్టపోయిన ప్రజా సమూహాలుగా ప్రపంచం వీరిని గుర్తిస్తుంది. కశ్మీర్ పండిట్ల కంటే ఎన్నోరెట్లు అధికంగా వీరు హింస అనుభవించారు, నిత్యం అనుభవిస్తున్నారు. అయితే వాళ్ళు హిందువులు, బ్రాహ్మణులు, దేశ పాలనలో అత్యున్నత స్థానాలలో బంధువర్గాన్ని కల్గినవారు. వీరు ముస్లింలు, అందులోనూ అల్ప సంఖ్యాక వర్గానికి చెందినవారు. చదువులు, ఉద్యోగాలు ఎరుగని సంచార జీవులు.

గుర్రాలెక్కి పశువులనూ గొర్రెలనూ మేకలనూ తోలుకుంటూ తమ పెంపుడు కుక్కలు తప్ప వేరే భద్రత ఏదీ లేకుండా ప్రపంచంలోనే అతి ప్రమాదకరమైన సరిహద్దుగా గుర్తింపుపొందిన భారత్ పాక్‌ల వాస్తవాధీన రేఖ వద్ద వీళ్ళు సంచరిస్తుంటారు. అవే కొండచరియలలో ఇక్కడొకటీ అక్కడొకటీ వీరి ఇళ్ళు, గుడిసెలు వుంటాయి. పాకిస్తాన్ వైపునుండి ప్రవేశించే మిలిటెంట్లకు తోవ చూపించడానికీ తిండిపెట్టడానికీ భారత సైన్యం గురించి సమాచారం ఇవ్వడానికీ వీరు తప్ప వేరే ఎవ్వరూ దొరకరు. కొందరు

ఇష్టపూర్వకంగా ఇస్తారు, కొందరు డబ్బు కోసం ఇస్తారు, కొందరు భయానికి ఇస్తారు. మిలిటెంట్లు వీరినే ఆశ్రయిస్తారని భారత సైన్యానికి తెలుసు కాబట్టి వీరిని విపరీతమైన హింసకు గురిచేస్తారు. కొట్టడం, హింసించడం, చంపడమే కాక వాస్తవాధీన రేఖ సమీపంలో సైన్యం జరిపే 'ఆపరేషన్ల'కు అవసరమయిన కూలిపని యావత్తు గుజ్జర్, బఖర్‌వాల్ ప్రజలచేతనే చేయించుకుంటారు. గుడారాలు వేయడం, నీళ్ళు తేవడం, మూటలు మోయడం, చెట్లు కొట్టడం ఇత్యాది పనులు పైసా కూలి ఇవ్వకుండా చేయించుకుంటారు. మళ్ళీ తన 'ఆపరేషన్' అవసరాల రీత్యా అప్పుడప్పుడు ఆ ప్రాంతాన్ని వదిలి వెళ్ళిపొమ్మంటుంటారు. తాము అనుమతి ఇచ్చేంతవరకు తిరిగి రావద్దంటారు. ఈ హింస భరించలేక వారు తమకు సహాయం చేయడం మానేస్తారేమోనన్న భయంతో మిలిటెంట్లు ఈ మధ్యకాలంలో వాస్తవాధీన రేఖ సమీపంలోని గుజ్జర్, బఖర్‌వాల్ ప్రజలపైన భౌతిక హింస విపరీతంగా పెంచారు. భారత్ సైన్యానికి ఎవరు సహకరిస్తున్నారని తెలిసినా వారినే కాక వారి కుటుంబ సభ్యులయిన స్త్రీలను, పిల్లలను, ముసలి వాళ్ళను కాల్చి చంపుతున్నారు, అవయవాలు తెగకోస్తున్నారు.

అయినా ఈ హింస కంటే ఎక్కువగా వారికి ప్రాణాపాయం కలిగిస్తున్నది మందుపాతరలు. అంతర్జాతీయ సరిహద్దు దగ్గర మందుపాతరలు పెట్టేది యుద్ధమొచ్చినప్పుడు, లేదా 'ఆపరేషన్ పరాక్రమ్' లాంటి యుద్ధాన్ని పోలిన పరిస్థితులు వచ్చినప్పుడు. ఆ పరిస్థితి గడిచిపోయిన తరువాత మందుపాతరలను తీసివేయడం జరుగుతుంది. వాస్తవాధీన రేఖ పరిస్థితి వేరు. ఇక్కడ పెట్టే మందుపాతరల లక్ష్యం పాకిస్తాన్ సైన్యాన్ని నిలువరించడం కాదు, 'చొరబాటుదార్ల'ను నిలువరించడం. 1989లో కశ్మీర్ లోయలో స్వయం నిర్ణయాధికార పోరాటం మొదలయిన తరువాత వాస్తవాధీన రేఖ దగ్గర భారత్ మందుపాతరలు పెట్టడం మొదలుపెట్టింది. 1999లో జరిగిన కార్గిల్ యుద్ధం తరువాత ఇది మరీ పెరిగింది. 2001 డిసెంబర్ 13 తదుపరి దాదాపు 10 నెలలు నెలకొన్న సరిహద్దు సంక్షోభంలో ఇంకింతగా మందుపాతరలు విస్తరించాయి. వీటిని ఇంక తొలగించే ప్రసక్తి లేదు.

ఇది కొండ ప్రాంతం కాబట్టి ఇక్కడ మందుపాతరలొక సరళ రేఖలో వుండవు. వర్షాలు వచ్చినప్పుడు కొండచరియలలో మట్టి కదులుతుంది. మట్టితోపాటు మట్టిలో పాతిన మందుపాతరలు కూడా కదులుతాయి. అవి తొలినాడు పెట్టినచోటే వుండవు. 'నిజం చెప్పాలంటే వాస్తవాధీన రేఖ వద్ద మందుపాతరలు ఎక్కడ వున్నాయో మాకు సహితం తెలీదు' అని సైనిక అధికారులే ఒప్పుకుంటున్నారు.

'వికలాంగులకు సర్టిఫికెట్లు పంచడానికి నేను నౌషేరా తాలూకాకు పోయినప్పుడు అక్కడ ఎంతమంది వికలాంగులున్నారో చూసి ఆశ్చర్యపోయాను' అని రాజౌరి జిల్లా డిప్యూటీ కమిషనర్ (జిల్లా కలెక్టర్) అన్నాడు. 'ఒక్కొక్క ఇంట్లో ఇద్దరు ముగ్గురు వికలాంగులుండడం గమనించాను. కారణం కనుక్కుంటే మందుపాతరల వల్ల గాయపడ్డారని చెప్పారు' అన్నాడు.

జమ్మూకశ్మీర్ రాష్ట్ర ప్రభుత్వం పాకిస్తానీ సైనికుల ఫిరంగి గుండ్ల వల్ల క్షతగాత్రులయిన వారికి, మిలిటెంట్ల చేతిలో గాయపడ్డవారికి నష్టపరిహారం ఇస్తుంది. చనిపోతే 1 లక్ష రూపాయలు, శాశ్వతంగా వికలాంగులయితే 75,000 రూపాయలు ఇస్తున్నది. ఈ కారణంగా ఎంతమంది ఈ రెండు కారణాల వల్ల చనిపోయారు, లేక గాయపడ్డారు అన్న గణాంకాలు ప్రభుత్వం దగ్గర దొరుకుతాయి. కానీ మందుపాతరలలో గాయపడినా, చనిపోయినా అవి వున్నచోటికి నిన్నెవరు పొమ్మన్నారు అంటూ చాలాకాలం పాటు ఏ నష్టపరిహారం ఇచ్చేవారు కాదు. గొడవ చేయగా చేయగా ఈ మధ్య నామమాత్రం నష్టపరిహారం ఇవ్వడం మొదలుపెట్టారు. మందుపాతర పేలి ప్రాణం పోతే 10,000 రూపాయలు, అంగవికలురైతే 1,000 రూపాయలు ఇస్తున్నారు. ఈ వివక్షకు కారణం వివరించగల వాళ్ళెవరూ లేరు. అవి 'వాళ్ళ' ఆయుధాలు, ఇవి 'మన' మందుపాతరలు అయినందుకే అనుకోవాలి!

అదెట్లాగున్నా, చాలాకాలం మందుపాతర మరణాలకు, గాయాలకు ఏ నష్టపరిహారం ఇవ్వని కారణంగా వీటికి సంబంధించిన గణాంకాలు ప్రభుత్వం దగ్గర లేవు. ప్రైవేట్ వ్యక్తులు గానీ, హక్కుల సంఘాలు గానీ సమగ్రమైన గణాంకాలు సేకరించే పరిస్థితి వాస్తవాధీన రేఖ దగ్గర లేదు. ఒక్కొక్క గూడెం తిరిగి లెక్కలు తీస్తే తప్ప తెలీదు.

అయితే 'శత్రు' సైన్యం ఫిరంగి గుండ్లకన్నా, మిలిటెంట్ల తుపాకి తూటాలకన్నా 'మన' మందుపాతరలే ఎక్కువ హాని చేశాయని కొంత ఆధారంతో వాదించే వ్యక్తి ఒకరు పూంచ్‌లో వున్నాడు. ఆయన మిలిటెంట్ కాదు. కశ్మీరీ కాదు. ముస్లిం కూడా కాదు. డాక్టర్ జగ్బీర్‌సింగ్ సూదన్ అనే సంఘ సేవకుడయిన వైద్యుడు. సిక్కుమతంలోని సేవా స్ఫూర్తితో అతను 'ప్రీతం స్పిరిచ్యువల్ ఫౌండేషన్' అనే ధర్మ సంస్థను పూంచ్‌లో నడుపుతున్నాడు. వికలాంగులకు సహాయం చేయడం ఈ సంస్థ ప్రధాన లక్ష్యం. ఈ సంస్థ 1975లో పనిచేయడం మొదలుపెట్టినప్పుడు కశ్మీర్‌లో మిలిటెంట్ పోరాటం లేదు, సరిహద్దుకు ఆవలి నుండి చొరబాట్లు లేవు. సరిహద్దు దగ్గర మందుపాతరలూ పెద్దగా లేవు. ఆనాడు వారు వికలాంగుల సేవను తమ కార్యరంగంగా యథాలాపంగానే ఎంచుకొని వుండవచ్చును కానీ వారి నిర్ణయంతో ప్రమేయం లేని కారణాల వల్ల వికలాంగుల సేవే ఆ ప్రాంతంలో ఎవరయినా చేపట్టగల ప్రధాన వైద్య సేవ అయికూర్చుంది.

పూంచ్ జమ్మూ ప్రాంతంలోని ఒక జిల్లా కేంద్రం. ఆ వూరు దాదాపు వాస్తవాధీన రేఖ మీదనే వుంది. ఆ జిల్లాలోనూ పొరుగు జిల్లా అయిన రాజౌరి జిల్లాలోనూ సరిహద్దు వాసులెవరయినా ఏ దాడిలోనయినా గాయపడితే పూంచ్ ప్రభుత్వ ఆస్పత్రికి రావడం సహజం. అక్కడ తెగిన అవయవానికి శస్త్రచికిత్స చేసుకున్న తరువాత కృత్రిమ అవయవాల కోసం డాక్టర్ జగ్బీర్‌సింగ్ సూదన్ దగ్గరికి వస్తారు. ఈ సిక్కు మతస్తుడు మరొక జైన

మత సంస్థ సహాయంతో (దాని పేరు భగవాన్ మహావీర్ వికలాంగ్ సహాయతా సమితి, జైపూర్) ప్రధానంగా ముస్లింలయిన క్షతగాత్రులను ఢిల్లీ తీసుకుపోయి ఉచితంగా కృత్రిమ అవయవాలు అమరుస్తుంటారు.

గడచిన 13 సంవత్సరాలలో తాము 1738 మందికి కృత్రిమ అవయవాలు అమర్చామని, అందులో మందుపాతరల వల్ల గాయపడినవారు, సరిహద్దు వద్ద అవతలి వైపు నుండి జరిగే ఫిరంగి గుండ్ల కాల్పులలో గాయపడినవారు, మిలిటెంట్ల చేతులలో గాయపడినవారూ వున్నారనీ, అయితే అందరికంటే ఎక్కువమంది మందుపాతరలలో గాయపడినవారేననీ డాక్టర్ సూదన్ అంటాడు. ఆయన మాటలను అనుమానించవలసిన అవసరమేమీ లేదు.

కశ్మీర్ లోయలోకి పోతే వాస్తవాధీన రేఖ సమీపంలో నివసించేవారి స్థితి మరీ దారుణం. కశ్మీర్‌లో కుప్వారా జిల్లా పూర్తిగా వాస్తవాధీన రేఖను ఆనుకొని వున్న జిల్లా. కిందటి సంవత్సరం డాక్టర్ జగ్బీర్‌సింగ్ సూదన్ కుప్వారా జిల్లాలో వికలాంగులకు ఉపయోగపడే పరికరాలను అందివ్వడం కోసం క్యాంప్ నిర్వహించగా, లాంగేట్ అనే ఒక్క సరిహద్దు గ్రామంలోనే 300 మంది వికలాంగులు సహాయం కోరారట. ఆ ఒక్క ఊరిలోనే ఆయన 31 మూడు చక్రాల సైకిళ్ళు, 41 రెండు చక్రాల కుర్చీలు, 61 చంక కింద పెట్టుకునే కర్రలు పంచాడంట!

'ఆపరేషన్ పరాక్రమ్' ముగిసిన తరువాత అంతర్జాతీయ సరిహద్దు వద్ద నుండి వలస వచ్చిన కాందిశీకులను వెనక్కి పొమ్మన్నట్టే, వాస్తవాధీన రేఖ వద్ద నుండి వలస వచ్చిన కాందిశీకులనూ ఆ రాష్ట్ర ప్రభుత్వం వెనక్కి పొమ్మనింది. వాళ్ళు కనీసం మళ్ళీ యుద్ధమో యుద్ధ పరిస్థితో వచ్చేంతవరకు కొంచెం భయంగానయినా సరే బతుకు వెళ్ళదీయవచ్చు. వీళ్ళు ఫిరంగి గుండ్లనూ మందుపాతరలనూ ఎదుర్కొంటూ ప్రతిరోజూ చస్తూ బతకవలసిందే. మొదట్లోనే చెప్పినట్టు, గుజరాత్ నుండి జమ్మూ జిల్లాలోని అఖ్నూర్ తాలూకా దాకా అంతర్జాతీయ సరిహద్దు సమీపంలోని ఆవాసాలలో వుండే జనం అత్యధిక శాతం హిందువులు కాగా, వాస్తవాధీన రేఖ మొదలయిన దగ్గర నుండి జనాభాలో ముస్లిం శాతం పెరుగుతుంది. పూంచ్ జిల్లాకు వచ్చేసరికి దాదాపు అందరూ ముస్లింలే. వాళ్ళ గోడే విననప్పుడు వీళ్ళ గోడెవరు వింటారని అనడానికి ఎంత ఇబ్బంది అనిపించినా అనక తప్పదు.

# గుజ్జర్‌లు : కొండలు ఈదే మొండి మనుషులు

జమ్మూకశ్మీర్ రాష్ట్రంలోని కొండ ప్రాంతాలలో ప్రయాణిస్తుంటే ఒక చిత్రం పదే పదే కనిపిస్తుంటుంది. కుటుంబాలకు కుటుంబాలు గుర్రాలను వెంటపెట్టుకొని ఆవులనూ, గొర్రెలనూ, మేకనూ తోలుకొని పోతుంటారు. కొండలు ఎక్కుతుంటారు, దిగుతుంటారు. రహదార్ల మీద మోటార్ వాహనాల సరసన ప్రయాణిస్తుంటారు. ఏ మోటార్ వాహనాలూ పోలేని కొండ బాటల మీదా ప్రయాణిస్తుంటారు. మంచినీళ్ళు తాగడానికో, బువ్వ తినడానికో ఆగుతారు గానీ విశ్రాంతి కోసం ఆగినట్టు ఎక్కడా చూడము.

ఈ ప్రజలు గుజ్జర్, బఖర్‌వాల్ తెగలకు చెందిన సంచార జీవులు. జమ్మూకశ్మీర్‌లో వారి జనాభా 20 లక్షలకు పైగా ఉంటుందని అంచనా. వీరు రాష్ట్రమంతటా కొండలమీద బతుకుతుంటారు గానీ, ఏ ప్రాంతంలోనూ ఇతర ప్రజలతో వీరికి అన్యోన్య సంబంధం ఉండదు. వీరి భాష గోజ్రీ. ఇతర స్థానిక భాషలకంటే భిన్నమైనది. రూపురేఖలలోనూ వీరు చాలా విలక్షణంగా ఉంటారు. జమ్మూ ప్రాంతవాసులు సగటు ఉత్తర భారతదేశ వాసులలాగ ఉంటే, కశ్మీరీలు బాగా ఎర్రగా ఉండడమే కాక రూపురేఖలలో మధ్యఆసియా ప్రజలను పోలి ఉంటారు. గుజ్జర్‌లు రంగులో మనలాగ చామనఛాయగా ఉంటారు గానీ రూపురేఖలలో కశ్మీరీల కంటే కూడా 'విదేశీయుల' లాగ ఉంటారు. సన్నటి పొడవైన ముఖం, పొడవైన ముక్కు, ఎత్తయిన ఆకారం, సన్నగానే ఉన్నా చాలా దృఢమైన శరీరం, మగవాళ్ళకు తప్పనిసరిగా గడ్డం – ఏ పశ్చిమాసియావాసులో అనిపిస్తుంది చూస్తే. గుజ్జర్, బఖర్‌వాల్ అనేవి రెండు వేరువేరు తెగలైనప్పటికీ రూపురేఖలను బట్టి వారి మధ్య తేడా చెప్పడం కశ్మీరీలకు సహితం సాధ్యం కాదు. వారి పశువుల మందలను బట్టి తేడా చెప్తారు. గొర్రెలు, మేకలు ఉంటే బఖర్‌వాల్ అనీ, ఆవులుంటే గుజ్జర్‌లు అనీ గుర్తిస్తారు. గుర్రాలు, కాపలాకు కుక్కలు మాత్రం ఇద్దరి దగ్గరా ఉంటాయి.

ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం, 30-05-2004

## సంచార జీవులు

వీరిలో చదువుకున్న వాళ్ళు చాలా తక్కువ. సంచార జీవన విధానం కారణంగా ప్రత్యేకమైన ఏర్పాట్లు లేనప్పుడు సహజంగానే వారి పిల్లలకు చదువుకునే అవకాశం తక్కువ. వీరి ప్రయోజనాల కోసం బలవంతులైన వర్గాలతో గొడవ పెట్టుకునే నాయకులూ వారికి తక్కువే. ఆనవాయితీగా జమ్మూకశ్మీర్ రాష్ట్ర కేబినెట్‌లో గుజ్జర్ తెగకు చెందిన ఒక మంత్రి ఉంటారు గానీ, ఆ రాష్ట్రంలోని ప్రధాన జాతులైన కశ్మీరీ, డోగ్రా నాయకులను కాదని తమ వారి కోసం కొట్లాడే యోగ్యులిప్పటి వరకు ఎవరూ లేరు. కానీ తమ జాతి ఉనికిని గురించి, తాము ఎదుర్కొంటున్న సమస్యల గురించి నిర్భీతిగా రాసే జావేద్ రాహి అనే పరిశోధకుడు మాత్రం గుజ్జర్ జాతిలో పుట్టాడు. అతని కృషి వల్ల గోజ్రీ భాషా సంస్కృతుల పరిరక్షణ కోసం జమ్మూకశ్మీర్ పాలకులు అప్పుడు కొంచెం, ఇప్పుడు కొంచెం చేస్తున్నారు.

## ఒంటరి తెగలు

అయితే వారి సామాజిక ఆర్థిక జీవితాల మెరుగుదలకు ప్రభుత్వాలు చేస్తున్నది చాలా తక్కువ. ఆవు పాలకూ, గొర్రె మాంసానికీ, ఊలుకూ ఉన్న గిరాకీ వారి జీవనానికి పునాది. ఈ పునాదిని బలోపేతం చేయడానికి ప్రభుత్వాలు చేసిందేమీ లేదు. అదొక సహజ సామాజిక సంబంధంగా కొనసాగుతున్నది. గుజ్జర్, బఖర్‌వాల్ తెగలను షెడ్యూల్డు తెగలుగా గుర్తించాలన్న ప్రతిపాదన సహితం చాలాకాలం బుట్టదాఖలై ఉండి ఈ మధ్యనే వారికి ఆ గుర్తింపు లభించింది. అయితే దాని ఫలితాలు వారికి అందాలంటే రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేకమైన చర్యలు చేపట్టాలి. షెడ్యూల్డు తెగలుగా గుర్తింపు లభించడం వారికి ఒక అవకాశాన్ని ఇచ్చింది గానీ ప్రభుత్వాలు దానిని వినియోగించుకోకపోతే ఆ గుర్తింపు నిష్ఫలంగా ఉండిపోతుంది. నిజానికి జమ్మూకశ్మీర్‌కు పొరుగున ఉన్న హిమాచల్‌ప్రదేశ్‌లోనూ, ఉత్తరాంచల్‌లోనూ కూడా గుజ్జర్‌లు ఉన్నారు. వారు కూడా పశుపోషకులే గానీ జమ్మూకశ్మీర్‌లోలాగ చుట్టూ ఉన్న సమాజం నుంచి వేరుపడిన సంచార జీవులు కారు. వారిప్పుడు హైందవ సమాజంలో ఒక కులంగా పరిణామం చెంది ఇతర వెనుకబడిన కులాల సరసన జీవిస్తున్నారు. జమ్మూకశ్మీర్‌లోని గుజ్జర్, బఖర్‌వాల్‌లు ముస్లింలు అయినా స్థానిక ముస్లిం ప్రజానీకంతో కూడా వారికి సంబంధ బాంధవ్యాలు లేవు.

## మూడుదేశాల వారసులు

ఈ మధ్యకాలంలో ఈ సంచార జీవులు తమ అదుపులో లేని కారణాల వల్ల వార్తలకెక్కారు. వాటిని అర్థం చేసుకోవాలంటే గుజ్జర్, బఖర్‌వాల్ ప్రజల జీవనశైలిని తెలుసుకోవాలి. జమ్మూకశ్మీర్ రాష్ట్రం కొంత ఇండియాలో, కొంత పాకిస్తాన్‌లో (కొంత చైనాలో కూడా) ఉన్న సంగతి తెలిసిందే. ఇండియాలో ఉన్న జమ్మూకశ్మీర్ భూభాగంలోని

**జార్జియా - గుర్జియా**

గుజ్జర్‌లు ఎక్కడివాళ్ళో, మన దేశానికి ఎప్పుడొచ్చారో ఎవరికీ సరిగ్గా తెలియదు. యూదుల రూపురేఖలున్నాయి కాబట్టి పశ్చిమాసియా నుంచి వచ్చి ఉండొచ్చనే అభిప్రాయం ఉంది. కాదు మధ్యఆసియా నుండి వచ్చారనే అభిప్రాయమూ ఉంది. 'హూణుల' సంతతి వారని చెబుతారు. హూణుల్లో ఎర్రహూణులు, తెల్లహూణులు ఉండేవారట. ఎర్రవాళ్ళు యూరప్‌పై దండయాత్ర చేస్తే తెల్లవాళ్ళు కాబూల్‌లో పరిపాలిస్తున్న కుషాణుల మీద దాడి చేశారని, ఆ తర్వాత వాళ్ళు భారతదేశంలోకి వచ్చి ఉండిపోయారని చెపుతారు. ఈ వచ్చిన వాళ్ళు నేరుగా గుజరాత్‌కు వెళ్ళి, అక్కడ అనేక ఏళ్ళు ఉండి, తీవ్రమైన క్షామం వచ్చినప్పుడు రాజస్తాన్ మీదుగా శివాలిక్, హిమాలయాల కొండలకు వలసవచ్చి బతుకుతున్నారనే కథనం కూడా ఉంది.

సోవియట్ యూనియన్‌లోని నల్లసముద్రం, కాస్పియన్ సముద్రం మధ్య ఉన్న జార్జియా దేశం (ఇది స్టాలిన్ స్వరాష్ట్రం) వీరి స్వస్థలమని మాజిద్ హుస్సేన్ అనే చరిత్ర రచయిత అభిప్రాయం. జార్జియాను అప్పట్లో గుర్జియా అని పిలిచేవారట. వీళ్ళు తాము నడిచివచ్చిన దారిపొడవునా అనేక ప్రాంతాలకు అటువంటి పేర్లే పెట్టుకుంటూ వచ్చారు. గుజర్, గుజ్జారా, గుజ్రాబాద్, గుజ్రు, గుజ్రిస్తాన్, గుజ్రాబాస్, గుజ్దార్ – కొట్టా, గుజార్‌ఘర్, గుజర్‌ఖాన్, గుజ్రన్‌వాలా ఇలా ఎన్నో పేర్లు ఇరాన్, ఆఫ్ఘానిస్తాన్, తుర్క్‌మేనియా, పాకిస్తాన్, ఇండియాలలో కనిపిస్తాయి. మన గుజరాత్ కూడా ఈ కోవలోదే అంటారు.

ప్రధాన పర్వతశ్రేణి దిగువ హిమాలయాలకు చెందిన పీర్ పంజల్ శ్రేణి. ఈ కొండలు గుజ్జర్, బఖర్‌వాల్‌ల నివాస స్థలం. ఇవి ఎగువ హిమాలయాలంత ఎత్తయినవి కావు. 15,000 అడుగుల ఎత్తు ఉన్న ఒక శిఖరం పీర్ పంజల్ శ్రేణిలో ఉన్నప్పటికీ సగటున ఈ శ్రేణిలోని కొండల ఎత్తు 9,000 లేక 10,000 అడుగులు మించదు.

గుజ్జర్‌లు, బఖర్‌వాల్‌లు ఏప్రిల్ నుండి సెప్టెంబర్ వరకు ఈ కొండల ఎగువ భాగాన ఉంటారు. అక్కడ విసిరేసినట్టు ఉండే ఈ సంచార జీవుల ఇళ్ళే తప్ప వేరే ఇళ్ళేవీ ఉండవు. కొండల ఎగువ భాగాన మంచు కురవడం మొదలు కాగానే తమ పశువులను తోలుకుని కొద్ది కొద్దిగా కిందికి వస్తారు. కశ్మీర్ లోయలోనికీ, డిసెంబర్ జనవరి నెలలొచ్చే సరికి ఇంకా కింది ప్రాంతానికీ వచ్చేస్తారు. అయితే పూర్తిగా మైదాన ప్రాంతానికి ఎప్పుడో గాని రారు. కింది ప్రాంతంలో వారికి ఇళ్ళు కూడా ఉండవు. రోడ్డు పక్కన గుడారాలు వేసుకొని, చెట్ల నీడ చూసుకొని నివసిస్తారు. రెండు బక్కెట్లు నాలుగు తపేలాలు తప్ప పెద్దగా సామాన్లు కూడా ఉండవు. మళ్ళీ ఎండాకాలం సమీపించగానే ఎగువకు ప్రయాణం

మొదలుపెడతారు. ఉన్న నాలుగు సామాన్లు గుర్రాల మీదికెక్కించి కుక్కలు మొరుగుతూ వెంటరాగా గొర్రెలను, మేకలను, ఆవులనూ తోలుకొని రోడ్డుంటే రోడ్డు వెంబడి, లేకుంటే కొండ బాటల వెంబడి బయలుదేరతారు.

## పెను ప్రమాదం

ఎప్పటిలాగే ఈ సంవత్సరం కూడా మే నెల మొదటి వారం వచ్చేసరికి వేలాది గుజ్జర్, బఖర్‌వాల్ కుటుంబాలు కొండలెక్కి 9,000 అడుగుల ఎత్తున్న ప్రాంతం చేరుకున్నాయి. అయితే ఈసారి దేశమంతటా వేసవిలో అకాల వర్షాలు కురిసినట్టే కశ్మీర్‌లోనూ వర్షమేకాక మంచు కూడా కురిసింది. ఎత్తు ప్రదేశాలకు అప్పటికే చేరుకున్న సంచార జాతులు, వారి పశువులు అకస్మాత్తుగా కురిసిన మంచులో ఇరుక్కున్నారు. ఆ సంగతి నాలుగైదు రోజులదాకా పాలనా యంత్రాంగం దృష్టికి రాలేదంటే జమ్మూకశ్మీర్ రాష్ట్రంలో ఈ ప్రజల పరిస్థితి ఏమిటో అర్థం అవుతుంది. వారి తరఫున మాట్లాడే సంస్థలు లేవు, పార్టీలు లేవు, వారి వార్తలను పత్రికలకు ఎప్పటికప్పుడు ఎక్కించే వ్యవస్థ లేదు.

పశువుల మందలతో సహా కొన్ని వందల గుజ్జర్, బఖర్‌వాల్ కుటుంబాలు మంచులో ఇరుక్కున్న సంగతి తెలిసిన తరువాత సైన్యం హెలికాప్టర్లలో వారికి ఆహారం, వెచ్చటి బట్టలు చేరవేసినట్టు పత్రికలలో వార్తలొచ్చాయి. కానీ పశు నష్టం చాలా జరిగింది. మే నెల తొలి దినాలలోనే 4 లక్షల పశువులతో సహా 30 వేల కుటుంబాలు కొండల పైభాగానికి చేరుకోవడం వలన పశునష్టం భారీగానే జరిగింది. ముగ్గురు పిల్లలతో సహా 11 మంది చనిపోయారనీ, 11,844 గొర్రెలూ, మేకలూ, 417 గుర్రాలూ, 272 ఆవులూ చనిపోయాయనీ అధికార్లు మే 5వ తేదీన ప్రకటించారు.

## మిలిటెన్సీ ముప్పు

మిలిటెన్సీ, దానిమీద భారత ప్రభుత్వం చేస్తున్న పోరాటం కూడా గుజ్జర్, బఖర్‌వాల్ ప్రజలను చాలా ఇబ్బందికి గురిచేస్తున్నాయి. జమ్మూకశ్మీర్‌లోని మిలిటెన్సీకి పునాది కశ్మీరీల స్వయం నిర్ణయాధికార కాంక్ష. కశ్మీరీలు కశ్మీర్ లోయలోనూ, పీర్ పంజల్ పర్వతశ్రేణి వెంబడి పరుచుకొని ఉన్న దోడా జిల్లాలోనూ నివసిస్తారు. గుజ్జర్, బఖర్‌వాల్ తెగలు అదే పర్వత శ్రేణుల మీద ప్రధానంగా జీవనం సాగిస్తారు. కశ్మీర్ లోయలోకి పశుగ్రాసం వెతుక్కుంటూ పోయి వస్తుంటారు. అయితే గోజ్రీ భాష మాట్లాడే ఈ సంచార జాతులు కశ్మీరీల జాతీయ ఆకాంక్షను ఎన్నడూ తమదిగా స్వీకరించలేదు. కశ్మీరీల పోరాటంలో భాగం కాలేదు. తీవ్రమైన అంతర్యుద్ధ వాతావరణంలో కూడా వీరు తమ పాటికి తాము కొండ చరియలలో పశువులు కాసుకుంటూ బతుకుతుండేవారు.

అయితే కశ్మీర్ లోయను భారత సైన్యం దిగ్బంధం చేసి పాకిస్తాన్ నుండి మిలిటెంట్ల చొరబాటును కష్టతరం చేసిన తరువాత, మిలిటెంట్లు పీర్ పంజల్ కొండల మీదుగా

**ఒకే ఒక్క పరిశోధకుడు**

కశ్మీరీ గుజ్జర్‌లలో చదువుకున్నవాళ్ళు చాలా తక్కువ. ఎవర్ని అడిగినా జావేద్ రాహి పేరొక్కటే చెపుతారు. ఆయన జమ్మూకశ్మీర్ ఆదివాసీ పరిశోధనా, సాంస్కృతిక సంస్థకు కార్యదర్శి. హిందీ – గోజ్రీ నిఘంటువును తయారుచేయడమే కాక హిమాలయన్ గుజ్జర్ల మీద ఒక ఎన్‌సైక్లోపీడియా కూడా తీసుకొచ్చారు. దానిలో గుజ్జర్ల కళలు, సాహిత్యం, వారసత్వ సంపద గురించి ఎన్నో వివరాలున్నాయి. గుజ్జర్ల పాటలు, జీవితం, సామెతలు, నానుడులు వగైరాల మీద కూడా ఆయన కొన్ని పుస్తకాలు రాశారు. గోజ్రీ భాషలో వెలువడే 'షీరాజా' మాసపత్రికకు ఆయన అసోసియేట్ ఎడిటర్. నాలుగు గోజ్రి టెలిసీరియల్స్‌ను రచించారు. జమ్మూకశ్మీర్‌లో మాట్లాడే గోజ్రీ భాషలో 20 శాతం పర్షియన్ పదాలుంటే, హిమాచల్ వగైరా చోట్ల మాట్లాడే గోజ్రీలో ఆ 20 శాతం సంస్కృత పదాలుంటాయని ఆయన పరిశీలన.

కశ్మీరీ గుజ్జర్లలో ఇటీవలే ఒక మహిళ మొదటిసారిగా పి.హెచ్.డి. చేసింది. పూంచ్ జిల్లాలోని మెందర్‌కు చెందిన షమీమ్ చౌదురి జువాలజీలో డాక్టరేట్ తీసుకోవడం అక్కడి వాళ్ళకు పెద్ద వార్త.

భారత్ ఆధీనంలోని భూభాగంలోకి ప్రవేశించి అక్కడి నుంచి అనువైన చోట లోయలోకి దిగే వ్యూహం ఎంచుకున్నారు. పీర్ పంజల్ శ్రేణి పడమట పాకిస్తాన్ ఆధీనంలో ఉన్న ముజఫరాబాద్ నుండి తూర్పున లదాఖ్ దాకా విస్తరించి ఉంది. ఆ కొండ పైభాగాన వాస్తవాధీన రేఖను గుర్తించడం కష్టం. దానిని కాపలా కాయడం మరింత కష్టం. కాబట్టి ఈ వ్యూహం నిరాఘాటంగా సాగుతూ వుంది.

కొండల పైభాగాన భారత్ ఆధీనంలో వున్న భూభాగంలోకి ప్రవేశించే మిలిటెంట్లకు కనిపించే మొదటి మనుషులు గుజ్జర్, బఖర్‌వాల్‌లు. వాళ్ళకు అన్నం పెట్టినా వీళ్ళే పెట్టాలి, దారి చూపించినా వీళ్ళే చూపించాలి. అదే విధంగా, చొరబాటుదార్లను అడ్డుకోవడానికి కొండలెక్కే భారత సైన్యానికి కూడా గుజ్జర్, బఖర్‌వాల్‌లే కళ్ళు, చెవులు, కాళ్ళు, చేతులు. కళ్ళు చెవులేకాక కాళ్ళు చేతులు అని కూడా ఎందుకంటున్నామంటే సైన్యం వారిని ఇన్‌ఫార్మర్లుగానే కాక కూలీలుగా కూడా (కూలి డబ్బులియ్యకుండా) వాడుకుంటుంది. నెత్తిమీద ముప్ఫైకిలోల బరువు పెట్టుకొని అలవోకగా కొండలెక్కగల నైపుణ్యం వారికి ఉండడం వారి పాలిట శాపం అయింది. కొండ పై భాగంలో సైన్యం క్యాంప్ పెట్టదలచుకుంటే దానికి కావలసిన సామగ్రి మొత్తం వీళ్ళు మోసుకుపోవలసిందే. పని చేయించుకుంటే చేయించుకున్నారు, కూలి డబ్బులైనా ఎందుకియ్యరనే ప్రశ్నకు భారత సైన్యం నుండి జవాబు ఉండదు.

## నలుగుతున్న మనసులు

ఈ విధంగా తమకు ఏమీ సంబంధం లేని సంఘర్షణలో గుజ్జర్, బఖర్‌వాల్ ప్రజలు గడచిన అయిదారు సంవత్సరాలుగా ఇరుక్కున్నారు. వారు కశ్మీరీల స్వయం నిర్ణయాధికార ఆరాటంతో తాదాత్మ్యం చెందలేదని పైన చెప్పాను. భారత పాకిస్తాన్‌ల సరిహద్దు ఆవేశం కూడా వారిని కదిలించదు. ఆ పీర్ పంజల్ కొండలపైకి ఇటువైపైనా అటువైపైనా బతుకుతెరువు కోసం వచ్చేది వారే. ఇరువైపులా ఉండేది వారి బంధువులే. ఎవ్వరూ ఆపకపోతే ఇరువైపుల ఉన్న వారూ ఇటూ అటూ పోయి వస్తుంటారు. యుద్ధం చేయడానికో లేక పొరుగు దేశంలోకి చొరబడడానికో మాత్రమే ఆ కొండలు ఎక్కేవాళ్ళు తమ నుండి కోరుకునే వేర్పాటు కాంక్షను గానీ, దేశభక్తిని గానీ ప్రదర్శించవలసిన అవసరం వాళ్ళకేముంది?

ఉన్నా లేకపోయినా శాసించేది ఆయుధాలు చేపట్టిన వారే కాబట్టి ఈ సంచార జీవులు రెండువైపుల నుంచీ చాలా హింస అనుభవించారు. సైన్యం ఇంటరాగేషన్ పేరిట పెట్టే హింసల గురించి కొత్తగా చెప్పవలసిందేమీ లేదు. మిలిటెంట్లు కశ్మీర్ లోయలో ప్రదర్శించడానికి సాహసించని క్రూరత్వం నోరులేని ఈ పశువుల కాపర్లపైన ప్రదర్శించారు. తాము ఇన్‌ఫార్మర్‌గా భావించే మగవాడు దొరకకపోతే అతని కుటుంబంలోని స్త్రీలు, పిల్లల ముక్కు చెవులు తెగకోసి పోయిన ఘటనలు సహితం జరిగాయి. అయితే ఈ మధ్య జరుగుతున్న ఒక పరిణామం ఏమిటంటే నిత్యం తుపాకుల మధ్య బతుకుతున్న ఈ పశువుల కాపర్ల పిల్లలు కొందరు మిలిటెంట్లలో చేరుతున్నారు. 'పీర్ పంజల్ కొండలమీద స్థావరాలు ఏర్పరచుకున్న మిలిటెంట్లలోని స్థానికులందరూ గుజ్జర్‌లే నని' సైనికాధికారులు ప్రకటించే దాకా వచ్చింది. ఇది పూర్తిగా నిజమైనా కాకున్నా ఆ ప్రజల మీద పెరగనున్న ఒత్తిడికి సూచిక అనడంలో సందేహం లేదు.

## ఈ పని చేస్తే చాలు

జమ్మూకశ్మీర్‌లో పరిపాలన అంటే కేవలం మిలిటెంట్ల మీద పోరాటమే కాకూడదనీ, ప్రజల బాగోగులు, అభివృద్ధి చూసుకునేదే పరిపాలన అని ప్రకటించి ఎన్నికల బరిలోకి దిగిన ముఫ్తీ మహమ్మద్ సయీద్ ప్రభుత్వం అధికారానికి వచ్చి రెండేళ్ళయింది. రెండేళ్ళలోనే ఏం చేశారు, ఏం చేయలేదు అని ఆడిట్ చేయడం న్యాయం కాకపోవచ్చును గానీ గుజ్జర్, బఖర్‌వాల్‌లకు సంబంధించినంత వరకు పెద్దగా ఖర్చుతో కూడిన అభివృద్ధి ఏమీ చేయనవసరం లేదు. కొండచరియలపైన గడ్డి పెంచడానికి ప్రాజెక్టులు కట్టనక్కర లేదు. పశువులను మేతకు తోలుకుపోవడానికి గోల్డెన్ క్వాడ్రిలేటరల్ అక్కరలేదు. 9000 అడుగుల ఎత్తున ట్రాన్స్‌ఫార్మర్‌లు కట్టి ఇక్కడొకటి అక్కడొకటి ఉన్న ఇళ్ళకు నిరంతరాయంగా

గుజ్జర్, బఖర్‌వాల్‌ల ఇళ్ళను కొఠా, బంది అని పిలుస్తారు. అన్నీ మట్టి ఇళ్ళే ఉంటాయి. కొండలమీది వాటిని ధోక్ అని అంటారు. చిన్న తలుపు తప్ప ఇళ్ళలో ఎలాంటి వెంటిలేషన్ ఉండదు. పొగ బయటికి వెళ్ళడానికి ఒక గోడలో చిన్న రంధ్రం మాత్రం ఉంచుతారు. అంత శుభ్రంగా ఉండదు. కాని చలి నుంచి మాత్రం వాళ్ళను, వాళ్ళ పశువులను బాగా కాపాడుతుంది.

కరెంటు ఇప్పటికిప్పుడే ఇవ్వకపోయినా ఫరవాలేదు ('బిజిలీ సడక్ పానీ' అనేది ప్రస్తుత అభివృద్ధి ఫార్ములా కదా!). గుజ్జర్, బఖర్‌వాల్‌ల జీవన విధానానికి తగిన ఆర్థిక ఆసరా ఇవ్వడానికి అంత కష్టం అక్కరలేదు. ఆవుపాలకూ, గొర్రెమాంసానికీ (ఆవు మాంసం కశ్మీర్‌లో ఎవ్వరూ తినరు), ఊలుకూ కావలసినంత డిమాండ్ ఉంది. కష్టకాలంలో గట్టెక్కడానికి చవక రుణాలు, పశువులకు వైద్య సదుపాయం, ఊలు అమ్మకంలో నష్టపోకుండా కాపాడే ప్రభుత్వ కొనుగోలు వ్యవస్థ కల్పిస్తే చాలు వారి బతుకు వారు బతికేస్తారు. ఆపైన బహుశా అత్యవసరంగా కావలసింది వారి సంచార జీవితానికి తగిన విద్యావ్యవస్థ. వీటికి పెద్దగా పెట్టుబడులు అక్కరలేదు గానీ రాజకీయంగా ప్రాబల్యం లేని ప్రజల కోసం ఈ మాత్రం చేయడం కూడా మన దేశంలో కష్టమే.

# భారత పాకిస్తాన్ చర్చలు : గతీ, గమ్యం

**భా**రత పాకిస్తాన్ చర్చలకొక ప్రత్యేక లక్షణం ఉంది. మామూలుగా ఏవయినా రాజకీయ సంభాషణలు లేక సమస్యలపైన చర్చలు జరుగుతుంటే అందరి దృష్టీ వాటి ఫలితంపైన ఉంటుంది. ఫలితం కోసం, సమస్యల పరిష్కారం కోసం చర్చలు అనేది సాధారణ వైఖరి.

కానీ భారత పాకిస్తాన్ చర్చలు చర్చల కోసమేనంటే అతిశయోక్తి కాదు. ఈ రెండు దేశాల సరిహద్దు వెంబడి బతికే ప్రజలకు చర్చలు అంటే శాంతి అని అర్థం. వాళ్ళ ప్రాణాలు, బతుకులు భద్రంగా ఉంటాయని అర్థం. ఈ సరిహద్దు 900 కిలోమీటర్ల పొడవు ఉంది కాబట్టి, దాని వెంబడి రెండు వైపులా లక్షలమంది జనం బతుకుతున్నారు కాబట్టి ఇది చిన్న విషయం కాదు. ఈ రెండు దేశాలు చర్చించి చర్చించి చివరికి ఏ పరిష్కారమూ సాధించకున్నా, ఆ చివరి ఘడియను రానియ్యకుండా సాగనిస్తుంటే చాలు జనం బతికిపోతారు.

చర్చలు అంటే అణుయుద్ధ ప్రమాదం తాత్కాలికంగా వాయిదా పడ్డట్టే. ఇది భారత పాకిస్తాన్ చర్చలకు ఉండే రెండవ సత్ఫలితం. ఇది చిన్న మేలు కాదు. అణుబాంబులున్నంత మాత్రాన ప్రయోగిస్తారని భయపడనక్కరలేదని వేరే ఏదయినా సందర్భంలో అనుకోవచ్చునేమో గానీ ఈ రెండు దేశాల విషయంలో మట్టుకు కాదు. ఇరువైపులా పిచ్చి వాళ్ళకు కొదవలేదు. యుద్ధంచేసి 'పాకిస్తాన్‌ను కలిపేసుకోవాలని' లేదా కనీసం, 'పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్'ను కలిపేసుకోవాలని ఉబలాటపడే వాళ్ళు ఇక్కడ, భారత్‌వల్ల రాగల ప్రమాదాన్ని శాశ్వతంగా తొలగించేసుకోవాలనీ లేదా కనీసం 'భారత్ ఆక్రమిత కశ్మీర్'ను కలిపేసుకోవాలని ఆరాటపడేవాళ్ళు అక్కడ చాలామందే ఉన్నారు. పిచ్చాసుపత్రులలో కాదు, బయటే ఉన్నారు. నిర్ణయాత్మకమైన పదవులలోనూ ఉన్నారు. ప్రజాభిప్రాయాన్ని బలంగా ప్రభావితం చేయగల స్థానాలలోనూ దండిగా ఉన్నారు.

మూడవది, యుద్ధానికి నిత్యం తయారుగా ఉండడానికయ్యే ఖర్చు తగ్గడం. భారత్ ఈ తయారీమీద రోజుకు 6 కోట్ల రూపాయలు (సంవత్సరానికి కాదు, నెలకు కాదు,

---

ఉద్యమం మాసపత్రిక, ఆగస్టు – సెప్టెంబర్ 2004

వారానికి కాదు, రోజుకు) ఖర్చు పెడుతున్నదన్నది చాలాకాలంగా ఉన్న అంచనా. చర్చల సందర్భంగా నెలకొన్న యుద్ధవిరమణ కారణంగా ఇది మొత్తం మిగలకున్నా, ఇందులో సగం మిగిలినా సంవత్సరానికి వెయ్యికోట్ల రూపాయలు మిగిలినట్టే. అంతే మొత్తం పాకిస్తాన్‌కూ మిగులుతుంది. ఈ దారిద్ర్య స్థావరాలకు అది చిన్న మిగులు కాదు.

నాలుగవది, నిరర్థకమైన చావులు ఆగడం. సరిహద్దు వెంబడి జరుపుకునే కాల్పులలో జవాన్లు నిత్యం చస్తుంటారు. సియాచిన్‌లోనయితే ఒక్క తూటా కాల్చకున్నా చలికే చస్తున్నారు. జంతువులు, పక్షులు, క్రిమికీటకాలు సహితం బతకజాలని చోట యుద్ధం చేసుకోవడమేకాక, ఆ మంచు ఎడారిని ప్రపంచంలోని అతి ఎత్తయిన యుద్ధక్షేత్రంగా మార్చుకుని ఈ రెండు దేశాలు అదేదో గర్వకారణమైనట్టు చెప్పుకొంటున్నాయంటే, చచ్చేది వేరే వాడయితే ఎంత పిచ్చిగానయినా వ్యవహరించగలం అని అర్థం అవుతుంది. ఇప్పుడు దానినొక 'శాంతివనం'గా మార్చే ఆలోచన ఉందని అంటున్నారు. ఆ పనిచేసి అక్కడికి టూరిస్టులు గుర్రాలో, గాడిదలో ఎక్కి బయలుదేరిపోయి దారిలో కొండచరియలు కూలడం వల్లనో మంచు తుఫానులు కురవడం వల్లనో చావడం, ఆ వార్తలు మనం చదవడం ఎందుకు? మనుషులు రావద్దని ప్రకృతి భావించిన చోటికి పోయి యుద్ధం చేసుకోవడమెందుకు? ఆ తరువాత దానిని శాంతివనంగా మార్చడమెందుకు? రెండు సైన్యాలు సామాన్లు సర్దుకొని కిందికొచ్చేస్తే చాలు, ప్రకృతి లక్ష్యం నెరవేరుతుంది.

కాబట్టి కేవలం చర్చలు జరుగుతుండడం వల్ల ఇన్ని ప్రయోజనాలు ఉండగలవు. చర్చలు జరుపుతూ జరుపుతూ అదే అలవాటయిపోతే – యుద్ధం చేస్తూ, చేస్తూ అదే అలవాటయి పోయినట్టు ఈ ప్రయోజనాలు శాశ్వతం కాగలవు. అదీ పదివేలే.

ఎందుకంటే చర్చల అజెండాపై ప్రతిష్ఠంబన వీడడం లేదు. పాకిస్తాన్‌కు ఈ విషయంలో స్పష్టత ఉంది. (పాకిస్తాన్ పాలకులు మనవారి కంటే విజ్ఞులని కాదు గానీ వివేకం స్వప్రయోజనంతో ఏకీభవించినప్పుడు స్పష్టత కొరవడవలసిన అవసరం లేదు.) భారత పాకిస్తాన్‌ల మధ్య కశ్మీర్ సమస్యే ప్రధాన సమస్య కాబట్టి, అదే అజెండాలోని ప్రధాన అంశం కావాలని పాకిస్తాన్ అంటుంది. నిజానికి అది కాక ఈ రెండు దేశాల మధ్య వేరే ఏ సమస్యలున్నాయి? సింధూనది జలాలను న్యాయబద్ధంగా పంచుకోవడం, ఒకరికొకరు వర్తక వ్యాపారాలలో ప్రాధాన్యం ఇచ్చుకోవడం – ఇవేవీ తలలు పగలగొట్టుకోవలసిన సమస్యలు కాదు. కశ్మీర్ సమస్యే అసలు సమస్య. అసలు సమస్యను మొదట పరిష్కరించుకుంటే మిగిలినవి వాటంతటవే పరిష్కారం అవుతాయి కాబట్టి, కశ్మీర్‌తోనే మొదలుపెడదాం అని పాకిస్తాన్ అంటుంది.

భారత్‌కు ఈ విషయంలో ఒక స్పష్టమైన వైఖరే లేదు. అసలు సమస్య జటిలమైనది కాబట్టి దానిని వాయిదా వేసి పరిష్కారం కాగల సమస్యల గురించి మాట్లాడుకున్నట్టయితే అసలు సమస్య చర్చించడానికి కావలసిన సుహృద్భావ వాతావరణం ఏర్పడుతుందని

ఒక్కొక్కసారి అంటుంది. అసలు కశ్మీర్ సమస్య సమస్య కాదనీ, మహారాజా హరిసింగ్ 1947 అక్టోబర్ 26న జమ్మూకశ్మీర్ రాష్ట్రాన్ని ఇండియాలో కలపడానికి అంగీకరించినప్పుడే అది పరిష్కారం అయిపోయిందనీ, పరిష్కారం అయిపోయిన సమస్యను తిరగతోడడం కోసం కశ్మీర్‌లోనికి పాకిస్తాన్ చొరబాటుదార్లను పంపించడమే ప్రస్తుతమున్న 'కశ్మీర్ సమస్య' అని ఒక్కొక్కసారి అంటుంది.

ఇది నిజమని నిజంగా నమ్మివుంటే భారత్ చర్చలకు అసలు ఒప్పుకునేదే కాదు. నిజాన్ని గుర్తించినప్పటికీ దానిని ముందుంచకుండా కల్పనను ముందుంచడం ఎత్తుగడ రీత్యా తెలివయిన పనిగా భారత్ భావిస్తున్నది కాబట్టి అదే వైఖరి కొనసాగిస్తున్నది.

అయితే ఇప్పుడు రెండు దేశాలూ ఏ సమస్య ముందు చర్చిస్తామని చెప్పకుండా అన్ని విషయాలు చర్చిస్తాం అని అంటున్నాయి. పాకిస్తాన్ 'జమ్మూకశ్మీర్‌తో సహా' అని ఆ వాక్యం మొదట చేరుస్తున్నది.  భారత్ ఆ మాటలు చేర్చకున్నప్పటికీ పాకిస్తాన్ చేర్చడం పట్ల అభ్యంతరం చెప్పడం లేదు. దీని అర్థం కశ్మీర్‌ను ఒక సమస్యగా భారత్ గుర్తించినట్టేనని పాకిస్తాన్ పాలకులు తమ దేశీయ విమర్శకులకు నచ్చజెపుతుండగా, కశ్మీర్ భారత్‌లో విడదీయరాని భాగమని వేరే సందర్భాలలో ప్రకటించడం ద్వారా అటువంటిదేమీ లేదని భారత్ తన దేశీయ విమర్శకులకు సర్దిచెప్తున్నది.

భారత పాకిస్తాన్ చర్చలు ఎక్కడిదాకా వచ్చాయంటే ఇదిగో ఇక్కడి దాకా వచ్చాయి. 'అసలు విషయం' అనేది ఒకటి ఉందా లేదా, అది నిజమైన సమస్యా లేక జిహాదీలు కల్పించిన సమస్యా అన్న విషయంలో ఏకాభిప్రాయం కుదరకుండానే రెండు దేశాల అధికారులూ అప్పుడప్పుడూ కలుసుకుంటూ పిచ్చాపాటీ మాట్లాడుకుంటున్నారు. మనమంతా ఒకలాంటి మనుషులమే కదా అని మళ్ళీ మళ్ళీ కనుక్కుంటున్నారు. రెండు దేశాల విదేశాంగ శాఖ మంత్రులూ వేరే ఏవో సందర్భాలలో ఎక్కడెక్కడో కలుసుకుంటూ ఒకరినొకరు  కౌగలించుకుంటున్నారు.

ఇట్లాగే సాగుతున్న ఈ ప్రక్రియ పూర్తిగా నిరర్థకమని భావించనక్కరలేదనడానికి కారణం పైన చెప్పాను. అది ఆగిపోకుండా కొనసాగాలంతే. అయితే నిర్దిష్టమైన ఫలితాలేవీ దీని నుండి రావని కూడా అనలేం. రెండు దేశాలకూ అవసరమయినవి కొన్ని ఉన్నాయి. ఇరాన్ నుండి భారత్‌కు గ్యాస్ పైప్‌లైన్ వేయాలన్నది ఒకటి. అది ఇరాన్‌కూ భారత్‌కూ అవసరం. రెవెన్యూరీత్యా పాకిస్తాన్‌కు ఇష్టమే. కాని పాకిస్తాన్ ప్రభుత్వం ఆ దేశంలో సమాంతర పాలన సాగిస్తున్న ఇస్లామిక్ మిలిటెంట్ల నుండి ఆ పైప్‌లైన్‌కు భద్రత కల్పిస్తుందా అన్నది భారత్ భయం. కల్పించగలుగుతామని పాకిస్తాన్ హామీ ఇస్తున్నది. ఈ విషయం, ఆర్థిక సహాయ సహకారానికి సంబంధించిన ఇటువంటి ఇతర విషయాలు కొలిక్కిరాగలవు.

ఇక్కడే పాకిస్తాన్‌కు కొన్ని న్యాయమైన సందేహాలున్నాయి. అసలు విషయం చర్చించకుండ ఇవన్నీ మాట్లాడుకుంటూ పరిష్కరించుకుంటూ పోతే భారత్ అసలు విషయం

చర్చిస్తుందా? తన అవసరాలన్నీ తీరిపోయిన తరువాత కశ్మీర్ గురించి మాట్లాడేది లేదు పొమ్మని భారత్ అంటే అప్పుడేం చేయాలి? అందువల్ల ఇరాన్ పైప్‌లైన్ చర్చను వాయిదా వేసి భారత్‌పైన ఒత్తిడి పెంచాలని వాదిస్తున్న పాకిస్తానీలు ఉన్నారు. చిన్న చిన్న విషయాలు పరిష్కరించుకుంటూ పోతే అసలు విషయం మాట్లాడుకోవడానికి కావలసిన స్నేహ వాతావరణం ఏర్పడుతుందని భారత్ చెప్పటం అతి తెలివి ఎత్తుగడ అని వారు అనుమానిస్తున్నారు.

కశ్మీర్ విషయంలో పాకిస్తాన్ దృష్టి భారత్ దృష్టి కంటే ఉన్నతమైనదేం కాదు కాబట్టి – ఇద్దరిదీ భూమి కబ్జాదారుల దృష్టే కాబట్టి – పాకిస్తాన్ పాలకుల భయాందోళనలను పెద్దగా పట్టించుకోనక్కరలేదు. కానీ భారత్ ఆడుతున్న ఆటకు బలయ్యేది కశ్మీరీలు, కశ్మీరీల స్వయం నిర్ణయాధికార ఆకాంక్ష. ఆ ఆకాంక్షను భారత్ గుర్తించ నిరాకరించడం, భారత పాకిస్తాన్‌లు రెండూ దానిని ఒక భూమి వివాదంగా మార్చడం అసలు 'కశ్మీర్ సమస్య'. దీని పరిష్కారం కావలసింది ఇండియాకూ, పాకిస్తాన్‌కూ కాదు; కశ్మీరీలకు.

భారత్ పాకిస్తాన్‌ల మధ్య పెరుగుతున్న స్నేహాన్ని కశ్మీరీలు రెండు మనస్సులతో గమనిస్తున్నారు. స్వభావరీత్యా చాలా స్నేహశీలురు కావడం వల్ల ఈ స్నేహాన్ని వారు ఆహ్వానించకుండా ఉండలేరు. తగిన వైద్య సదుపాయాలు దొరకని పాకిస్తానీ పిల్లలు బెంగుళూరుకొచ్చి ఆపరేషన్ చేయించుకోవడం, భారత్ క్రికెట్ జట్టును పాకిస్తాన్ ప్రజలు సాదరంగా ఆహ్వానించడం, ఎవరికయినా సంతోషం కలిగించే విషయాలే.

కానీ ఇది చివరికి ఎటుపోతుంది? ఈ రెండు దేశాలూ దగ్గరయి, వైద్య సదుపాయాల నుండి గ్యాస్ పైప్‌లైన్ దాకా అన్నిటిలోనూ సహకరించుకోవడం మొదలుపెట్టిన తరువాత అదే ఒరవడిలో కశ్మీర్‌ను కూడా చెరి కొంచెం తీసేసుకొని వాస్తవాధీన రేఖ వద్ద పూల కుండీలు అమర్చేసుకుంటే తమ నేల భవితవ్యం ఏమవుతుంది? భారత్ కశ్మీర్ గురించి పాకిస్తాన్‌తో అసలు చర్చించకుండా మిగిలిన సమస్యలు పరిష్కరించుకుని కశ్మీర్ విషయంలో ప్రస్తుత మొండివైఖరినే కొనసాగిస్తుందన్న భయం పాకిస్తానీలలో ఎంత వుందో కశ్మీరీలలోనూ అంత వుంది. వాస్తవాధీన రేఖనో, వేరొక సరిహద్దునో శాశ్వత సరిహద్దు చేసేసుకుని కశ్మీర్ అధ్యాయానికి ముగింపు పలకాలని అమెరికా ఒత్తిడి పెడుతున్న విషయం అందరికీ తెలిసిందే. అమెరికాకు కావలసింది శాంతి, న్యాయబద్ధమైన పరిష్కారం కాదు. భారత పాకిస్తాన్‌ల మధ్య ఏదో ఒక ప్రాతిపదికన శాంతి నెలకొంటే పాకిస్తాన్‌లోని ఇస్లామిక్ మిలిటెంట్ల ఉనికి దెబ్బతింటుందని అమెరికా ఆశ. 'ఆఫ్ఘనిస్తాన్ సమస్య' పరిష్కారం కోసం అమెరికాయే వారిని ఉనికిలోకి తెచ్చింది. ఇప్పుడు వారిని తొలగించడానికి 'కశ్మీర్ సమస్య'ను పరిష్కరించాలని అనుకుంటున్నది. ఈ రెండు దేశాలలోనూ యుద్ధమంటే విసిగిపోయిన వారంతా అమెరికా ప్రతిపాదన నొక సులభమైన పరిష్కారంగా భావిస్తున్నారు.

బహుశా చివరి పరిష్కారం ఆరూపంలోనే ఉండవచ్చు. కానీ అన్యాయమైన ఆ పరిష్కరానికి సహితం ఇండియా తొందర పడదు. దశాబ్దాల తరబడి కశ్మీర్ మొత్తం మనదేనంటూ కృత్రిమంగా రెచ్చగొట్టిన జాతీయవాద ఆవేశాన్ని ఎదుర్కొనడానికి భారత పాలకులు సులభంగా సిద్ధపడరు. పాకిస్తాన్ పాలకులకూ ఆ సమస్య ఉందిగానీ కశ్మీర్‌ను చెరికొంత అనే ప్రాతిపదికన పంచేసుకునేటప్పుడు కశ్మీర్ లోయ తమకు దక్కుతుందన్న ఆశ వారిలో లేకపోలేదు. అందుకే వారు 'కశ్మీర్ సమస్య' అజెండాలో ఉండాలని తొందరపడుతున్నారు. ఇవన్నీ తెలిసే కశ్మీరీలు ఈ మొత్తం 'చర్చల' వ్యవహారాన్ని అనుమానంగా చూస్తున్నారు. కానీ వారి భయాలను ఆలకించేవారెవరు?

# భారత పాకిస్తానీయం

ఈ మధ్య భారత-పాకిస్తాన్ వ్యవహారాలలో వింత వింత విషయాలు చాలా జరిగిపోయాయి.

మహమ్మద్ అలీ జిన్నా లౌకికవాది అని లాల్‌కిషన్ అద్వానీ ప్రకటించడం వాటిలో ఒకటి మాత్రమే. అయితే ఆ ప్రకటనలోని అసలు వింత - లౌకికవాది అనే మాటనొక తిట్టుగా భావించే అద్వానీ దానిని ప్రశంసగా ప్రయోగించడం ఎప్పుడు మొదలుపెట్టాడు అనేది. బహుశా, హిందువులుగా పుట్టినవాళ్ళు లౌకికవాదులయితే తప్పుగానీ ముస్లింలు, క్రైస్తవులు, పార్సీలు, యూదులు వగైరాలు లౌకికవాదులయితే సంఘ్ పరివార్ దృష్టిలో మంచిదేమో. చెప్పలేం. వారి తలలోకి ప్రవేశించి వారి కళ్ళతో ప్రపంచాన్ని చూడడానికి కావలసిన వక్రబుద్ధి సాధారణ మానవులకు ఉండదు.

అద్వానీ జిన్నాను మెచ్చుకోలుగా లౌకికవాది అనడాన్నీ, 'లౌకికవాది కాని వాడిని లౌకికవాది అంటావా' అని సుదర్శన్‌జీలో, ఆచార్య గిరిరాజ్ కిషోర్‌లో అతని మీద విరుచుకుపడడాన్నీ బట్టి ఈ సందేహం వ్యక్తం చేశాను గానీ, సంఘ్ పరివార్ సాహిత్యంతో పరిచయం ఉన్న వారికొక విషయం బాగానే తెలుసును. హిందువులు, ముస్లింలు సహజీవనం చేయలేని వేరు వేరు జాతులన్న ద్విజాతి సిద్ధాంతాన్ని తిరస్కరించిన మౌలానా అబుల్ కలామ్ ఆజాద్ వంటి ముస్లింలను ఎన్నడూ గౌరవించలేదు. అటువంటప్పుడు ద్విజాతి సిద్ధాంతాన్ని ఆచరించిన జిన్నాను పొగుడుతావా అని అద్వానీని తిట్టడం ఎందుకు?

తర్కబద్ధంగా ఆలోచించడం సహజం అనుకోవడం వల్ల ప్రశ్నలేస్తున్నాను గానీ, జవాబు మీకు అర్థం కాలేదనా, నాకు అర్థం కాలేదనా! సమైక్యవాదులయిన మౌలానా ఆజాద్ వంటి ముస్లింలనూ చులకనగా చూడాలి, ద్విజాతి వాది అయిన జిన్నా వంటి ముస్లింలనూ ద్వేషించాలి అంటే అర్థం ఒక్కటే. మొత్తంగా ముస్లింలను ద్వేషించాలి. చెడ్డవాళ్ళయితే చెడ్డవాళ్ళయినందుకు ద్వేషించాలి. 'మంచి' వాళ్ళయితే చెడ్డవాళ్ళు కాకుండా పోయినందుకు ద్వేషించాలి.

పోనీయండి. వాళ్ళ గురించి మరీ ఎక్కువ ఆలోచించడం మన మానసిక ఆరోగ్యానికి మంచిది కాదు.

---

ప్రజాతంత్ర వారపత్రిక, 19-06-2005

మరొక వింత, దాదాపు అదే సమయంలో పాకిస్తాన్‌కు వెళ్ళిన హురియత్ కాన్ఫరెన్స్ బృందం – మరీ ముఖ్యంగా యాసిన్ మాలిక్ – పాకిస్తానీల బాధ్యతారాహిత్యానికి వారిని బహిరంగంగా నిందించడం. తుపాకులిచ్చి, తర్ఫీదు ఇచ్చి, పోరాడండి, పోరాడండి అంటున్న వాళ్ళు కూడా పోయిన ప్రాణాలకు జవాబుదార్లేనని యాసిన్ మాలిక్ స్పష్టంగా అన్నాడు. ట్రైనింగ్ క్యాంప్‌లు నిర్వహించిన ఒక మినిస్టర్ పేరు కూడా చెప్పాడని ఒక పాకిస్తానీ పత్రిక రాసింది గానీ అది అవాస్తవమనీ, ఆ పత్రికకు విశ్వసనీయత లేదనీ వెనక్కి వచ్చిన తరువాత యాసిన్ మాలిక్ అన్నాడు.

కావచ్చు. కానీ కశ్మీరీ మిలిటెంట్లకు పాకిస్తాన్‌లోని వివిధ అధికార, అనధికార శక్తులు తర్ఫీదు, తుపాకులు ఇచ్చిన సంగతి అందరూ ఎరిగిన వాస్తవమే. అయితే కేవలం పాకిస్తాన్‌లోని కశ్మీరీల నుండి మాత్రమే తాము ఈ సహాయం పొందామని యాసిన్ మాలిక్ పదే పదే అంటుంటాడు. తక్కిన హురియత్ ప్రతినిధులకు ఆ పట్టింపేమీ లేదు.

ముక్కుపచ్చలారని యువకులకు తుపాకులిచ్చి పోరాటంలోకి పొమ్మని ప్రోత్సహించి, వారి చావులను రాజకీయ ప్రచారం కోసం వాడుకుంటున్న పాకిస్తానీల పట్ల కశ్మీర్‌లో గడచిన మూడు నాలుగేళ్ళలో నిరసన బాగా పెరిగింది. ఇది నిస్పృహ నుండి పుట్టిన నిరసనగా తోచవచ్చు. అది కొంతవరకు వాస్తవమే. కానీ కశ్మీరీలు కొన్నాళ్ళు పోరాడినట్టయితే పాకిస్తాన్ సైన్యం రంగంలోకి దిగి భారత సైన్యంతో తలపడి కశ్మీర్‌ను విముక్తం చేస్తుందన్న హామీ పాకిస్తాన్ నుండి కశ్మీరీలకు లభించిందని చాలామంది చెప్తారు. పాకిస్తాన్ ఆ మాట నిలబెట్టుకోలేదన్న నిరసనయితే కశ్మీరీలలో బలంగానే ఉంది. ఆ నేపథ్యంలో యాసిన్ మాలిక్ వ్యక్తం చేసిన నిరసనను అర్థం చేసుకోవచ్చు.

యాసిన్ మాలిక్‌ది విశిష్టమైన రాజకీయ వ్యక్తిత్వం. ఆయన రాజకీయాలలో చాలా కాలంగా ఉన్నాడు గానీ ఇప్పటికీ అబద్ధాలు చెప్పలేదు, సందర్భాన్ని బట్టి మాట మార్చలేదు, ముఖప్రీతి మాటలు మాట్లాడలేదు. రాజకీయాలలో కొన్నాళ్ళుంటే ఇవి సులభంగా అబ్బే గుణాలు. స్వార్థ రాజకీయాలయితే స్వార్థం కోసం అలవరచుకుంటారు. మహత్తర లక్ష్యాలు గల రాజకీయాలయితే ఆ మహత్తర లక్ష్యం కోసం అలవరచుకుంటారు. (మన దగ్గర దీనికి చాలా ఉదాహరణలు గడచిన రెండు మూడు నెలలలో చూశాం).

యాసిన్ మాలిక్‌దీ మహత్తర లక్ష్యమే గానీ ఆయన ఆ లక్షణాలను అలవరచుకోలేదు. అందువల్ల భారత పాకిస్తాన్‌లు కశ్మీర్ సమస్య పరిష్కారం దిశగా పురోగమిస్తున్నాయని తక్కిన హురియత్ నేతలు ప్రశంసించగా, యాసిన్ మాలిక్ మాత్రం తనకా లక్షణాలేవీ కనిపించలేదన్నాడు. దానికి గల కారణాన్ని కూడా స్పష్టంగానే చెప్పాడు. భారత పాకిస్తాన్‌ల చర్చలలో కశ్మీర్‌కు ప్రథమ పక్షంగా సమస్థానం కల్పించనిదే ఆ 'సమస్య' పరిష్కారం కాదనేది కేవలం యాసిన్ మాలిక్ అభిప్రాయమే కాదు. కశ్మీర్‌లో అందరి అభిప్రాయమూ

అదే. 'కశ్మీర్ సమస్య' గురించి దేశభక్తికి లోనుకాకుండా ఆలోచించగల భారత, పాకిస్తానీయులందరి అభిప్రాయం కూడా అదే. అయితే ద్వైపాక్షిక చర్చల గురించి ఈ రెండు దేశాలు చేసుకుంటున్న ప్రకటనలలో కశ్మీరీలకు సమస్థానం కల్పించే ప్రస్తావన ఎక్కడా లేదు. అసలు ఏ స్థానం కల్పించే ప్రస్తావనా లేదు. ఆ మాటే యాసిన్ మాలిక్ నిక్కచ్చిగా అన్నాడు. భారత్‌లో భారత పాలకుల ముఖం మీదే చాలాకాలంగా అంటున్నాడు. ఇప్పుడు పాకిస్తాన్‌కు పోయి ఆ దేశ పాలకుల ముఖం మీదా అన్నాడు. అతను అనడంలో వింత లేదు. అతనికి అవకాశం ఇస్తే ఇట్లాగే మాట్లాడతాడని తెలిసీ వీళ్ళు పోనిచ్చారు. వాళ్ళు రానిచ్చారు. అదీ వింత.

పాకిస్తాన్‌లోని కశ్మీర్ (దానిని 'పాక్ ఆక్రమిత కశ్మీర్' అని మనమూ 'ఆజాద్ కశ్మీర్' అని వాళ్ళు అంటుంటారు) దాకా మాత్రమే పోవడానికి బయలుదేరిన హురియత్ కాన్ఫరెన్స్ నాయకులు అక్కడి నుండి పాకిస్తాన్ భూభాగంలోకి వెళ్ళి ఇస్లామాబాద్ నుండి కరాచీ దాకా పర్యటించడం మంచిదయింది. భారత్ దీనికి అభ్యంతరం చెప్పలేదంటే అర్థం కశ్మీర్ విషయంలో తన వైఖరి మార్చుకున్నట్టేనని ముషార్రఫ్ అనవసర వ్యాఖ్య చేసినప్పటికీ మన పాలకులు గంభీరంగానే మౌనం పాటించారు.

కశ్మీర్‌ను ఇండియా నుండి విముక్తం చేయాలని సాధారణ పాకిస్తానీలలో ఉన్న ప్రగాఢ సంకల్పం 'కశ్మీర్ సమస్య' అని పిలవబడుతున్న దానిలో ఒక ముఖ్య అంశం. ఆ పాకిస్తాన్ ప్రజలకు హురియత్ కాన్ఫరెన్స్ నాయకులు కనబడి వినబడి రావడం ఇరు దేశాలూ సిద్ధపడుతున్నాయని చెప్పుకుంటున్న పరిష్కారానికి చాలా అవసరం. ఈ ప్రయాణానికి భారత్ అడ్డు పెట్టకుండా ఉండడం మన పాలకులు చేసిన మంచి పనులలో ఒకటి. కశ్మీర్ (మొత్తం కశ్మీర్, ఇండియాలో ఉన్న భాగం మాత్రమే కాదు) భారత్‌లో అవిభాజ్యమైన భాగం అని మనం అంటుంటాం కాబట్టి ఇండియాలోని కశ్మీర్ నుండి పాకిస్తాన్‌లోని కశ్మీర్‌కు భారత పాస్‌పోర్టు లేకుండా పోవడం తప్పు కాదు గానీ ఆపైన కూడా కశ్మీరీలు భారత్ పాస్‌పోర్టు లేకుండా పోయి వచ్చినట్టయితే వారు పాకిస్తాన్‌లో భాగమేనని ఒప్పేసుకున్నట్టు కాదా అన్న ధర్మ సందేహం ధార్మిక బుద్ధి గలవాళ్ళకు వచ్చింది. ఊహాత్మకమైన అభిప్రాయాలను బట్టి ఏవో నియమాలు పెట్టుకొని వాటి ఉల్లంఘనను అడ్డుకోవడంలో అర్థంలేదని గ్రహించిన భారత పాలకులు హురియత్ కాన్ఫరెన్స్ నాయకుల పర్యటనకు అభ్యంతరం చెప్పలేదు.

కానీ ధర్మబుద్ధి గల అటల్‌జీ ఈ విషయాన్ని ఎత్తి చూపుతూ మన్మోహన్ సింగ్‌కు ఉత్తరం రాయగానే ఆయన తప్పొప్పేసుకుని పాకిస్తాన్ అంతటి పనిచేసి ఉండకూడదనడం వింతలలో వింత. ముషార్రఫ్ రెచ్చగొట్టినప్పుడు రెచ్చిపోని వాడు వాజ్‌పేయి బ్లాక్‌మెయిల్‌కు లొంగడం ఎందుకు? పాస్‌పోర్టు లేకుండా పాకిస్తాన్ పోయి వచ్చినందుకు ఇప్పుడు

హురియత్ నాయకులపైన ఇండియాలో ఒక ఎఫ్.ఐ.ఆర్, పాకిస్తాన్‌లో ఒక ఎఫ్.ఐ.ఆర్ నమోదు చేసి అంతర్జాతీయ క్రిమినల్ కోర్టులో విచారించాలి కాబోలు. అద్వానీ ప్రవచనాల వల్ల దేశభక్తి కుంటుపడిందన్న కాషాయంబరధారుల నిందను ఎదుర్కొనడానికి ఆయన వీర పాస్‌పోర్టు భక్తి ప్రదర్శించడమూ బాగుంది. ఈయన సై అనడమూ బాగుంది. రాజకీయ ప్రక్రియలకు చట్టపరమైన సాంకేతిక అవరోధాలను అడ్డంపెట్టడం కంటే తెలివితక్కువ తనం ఇంకొకటి ఉండదు. ఈ ఒక్క ఉదంతాన్ని జోక్‌గా తీసుకుంటాము గానీ ఇటువంటి అభ్యంతరాలు, సంజాయిషీలు, పాకిస్తాన్‌నూ కశ్మీరీలనూ వివరణ కోరడాలు ఇక పునరావృతం కాకుండా భారత పాలకులు చూసుకుంటే మంచిది.

# ఎవరి కోసం...ఎందుకోసం...?

**కొం**తమంది ఏదో ఒక ఉపద్రవం వచ్చి మీద పడినప్పుడు తప్ప వార్తలలోకి రారు. వాళ్ళ ఉనికే ఎవరికీ పట్టదు.

కశ్మీరీల గురించి మొత్తంగానే ఈ మాట చెప్పుకోవచ్చు. మిలిటెంట్లు ఏదైనా పెద్ద ఘాతుకానికి పాల్పడినప్పుడు తప్ప బయటి ప్రపంచం కశ్మీర్ వైపు చూడదు.

కశ్మీర్ లోయవాసుల పరిస్థితి ఈ విషయంలో కొంత మెరుగు. వాళ్ళ రాజకీయ చొరవ వల్ల, చురుకుదనం వల్ల బలవంతంగా అయినా ప్రపంచం దృష్టిని ఆకర్షించే ప్రయత్నం చేస్తుంటారు.

లోయ చుట్టూ ఉండే కొండలలో, ముఖ్యంగా వాస్తవాధీన రేఖ సమీపంలో నివసించే వారు ఆ మేరకు కూడా ప్రపంచం దృష్టిని ఆకర్షించరు, వార్తలలో కనిపించరు. దీనికి చాలా కారణాలున్నాయి. ఒకటి, వాస్తవాధీన రేఖ సమీప ప్రాంతాలలో – ఇరువైపులా – సైన్యం పెద్దఎత్తున మోహరించి ఉంటుంది. అటువైపు సంగతేమో గానీ ఇండియాలోనయితే సరిహద్దు ప్రజలు సైన్యం కబ్జాలో బతుకుతున్నారంటే అతిశయోక్తి కాదు. తమ భావాలు, ఇష్టాయిష్టాలు వ్యక్తం చేసే స్వేచ్ఛ లోయవాసులకు ఉన్న మేరకు సహితం వారికి లేదు. రెండు, వారిలో అధికులు పశుపోషకులయిన సంచార జీవులు. గుజ్జర్, బఖర్వాల్ తెగలకు చెందినవారు. ఈ తెగలలో అక్షరాస్యత చాలా తక్కువ, ఉద్యోగులు, బుద్ధిజీవులు ఇంకా తక్కువ, రాజకీయ నాయకులు సహితం తక్కువే.

15 సంవత్సరాల మిలిటెన్సీ వల్ల ఇరువైపుల నుండి ప్రధానంగా ఒత్తిడికి గురి అయిందీ నష్టపోయిందీ ఈ తెగలే. అయినా వారి గురించి ఎక్కడా వినం. మిలిటెంట్లు వారిని షెల్టర్ల కోసం ఆశ్రయించారు, తిండి పెట్టించుకున్నారు, వేగులవాళ్ళగా ఉపయోగించుకున్నారు. సైన్యం వారిచేత మూటలు మోయించింది, టెంట్లు వేయించింది, ఇన్‌ఫార్మర్లుగా వాడుకుంది. వారికి సహకరించినందుకు వీరు, వీరికి సహకరించినందుకు వారు ఈ తెగల ప్రజలను తీవ్రంగా హింసించారు. ఇది ఎవ్వరూ రికార్డు చేయని చరిత్ర.

వీరు కాక వాస్తవాధీన రేఖ సమీపంలో పహాడీ భాష మాట్లాడే ప్రజలున్నారు. వారు కశ్మీరీల లాగ చదువు, ఉద్యోగాలు ఎరిగినవారే గానీ రాజకీయంగా బలహీనులు.

---

ప్రజాతంత్ర వారపత్రిక, 23-10-2005

షేక్ అబ్దుల్లా వంటి ప్రతిభావంతులయిన నాయకులు పహాడీ జాతిలో పుట్టలేదు. వాళ్ళు నివసించేది పూర్తిగా కొండ ప్రాంతం కావడం వల్ల తీరికగల మేధావి వర్గమూ వారిలో అభివృద్ధి చెందలేదు, పైగా 'వాస్తవాధీన రేఖ' అని పిలవబడే సరిహద్దు వారిని రెండుగా చీల్చింది. పహాడీ జాతిని బలహీనపరచింది. కశ్మీర్ విభజన వల్ల ఈ విషయంలో కశ్మీరీ భాష మాట్లాడే లోయవాసుల కంటే పహాడీలు, గుజ్జర్‌లు, బఖర్‌వాల్‌లు ఎక్కువ నష్టపోయారు.

ఎప్పుడూ వార్తల్లో కనిపించి ఎరుగని ఈ ప్రజలను భూకంపం వార్తలలోకి తెచ్చింది. వాళ్ళ ఊళ్ళకు టీవీ కెమెరాలు వచ్చాయి. అయిదేళ్ళ కొకసారి కూడా వచ్చిపోని నాయకులు కొండలూ వాగులూ వంకలూ దాటి బార్లు తీరిన కార్లలో వచ్చారు. దుప్పట్లతో గుడారాలతో ఎన్జీవోలు వచ్చారు.

కానీ ఇది ఎన్ని రోజులు? చావు తప్పించుకున్న వాళ్ళు కూడా ఇంకా చాలాకాలం వరకు సాధారణ జీవితాన్ని చూడలేరు. అప్పటిదాకా ప్రపంచం ఈ ఆసక్తి వారి విషయంలో చూపించదు. ఈ వేడిలో ఎంత పునరావాసం లభిస్తే అంత లభించాలి. ఆ తరువాత దేనికీ భరోసా ఉండదు. అందువల్లనే అధికార యంత్రాంగం అలసత్వం చూస్తే కడుపు మండిపోతుంది. ఇప్పటికే చలి మొదలయిందనీ, ఒంటినిండా బట్టలు, నివాసానికొక గుడారం అర్జంటుగా కావాలనీ పత్రికలు రాస్తున్నాయి. ఆ మాత్రం కూడా ఇప్పటికీ కల్పించలేకపోయారంటే ప్రభుత్వాలను ఏమనాలి? కూలిపోయిన ఇళ్ళు ఇంతలో కట్టియ్యలేరంటే అర్థం చేసుకుంటాం. శిథిలమయిన స్కూళ్ళు, ఆస్పత్రులు తిరిగి కట్టడానికి కొంత టైం పడుతుందంటేనూ అర్థం చేసుకుంటాం. కానీ స్వెట్టర్లూ, దుప్పట్లూ, గుడారాలూ కూడా తగినన్ని సరఫరా చేయలేరా? 30,000 మందిని కోల్పోయిన పాకిస్తానే కాదు, 2,000 మందిని మాత్రమే కోల్పోయిన భారత్ కూడా చేయలేదా?

వీళ్ళిన్ని కోట్లిచ్చారనీ వాళ్ళిన్ని కోట్లు ఇచ్చారనీ పత్రికలలో చదువుతున్నాం. కశ్మీర్‌లో ఇంటింటికి తిరిగి వస్తువులు సేకరించి సరిహద్దుకు తరలిస్తున్నారనీ చదువుతున్నాం. అయినప్పటికీ చలి నుండి రక్షించుకోవడానికి ఒక గుడారం కూడా లేకుండా ప్రజలు వేలాదిగా కొండలమీద బయలు ప్రదేశంలోనే ఎందుకుండిపోయారు?

భారత పాకిస్తాన్‌ల పరస్పర వైఖరి ఇంకా చికాకు పుట్టిస్తుంది. రెండువైపులా ఉన్నది ఒకే ప్రజనే. చనిపోయినవారు, బతుకులు చితికిన వారు ఒకరికొకరు కావలసిన వారే. అయినా వారు ఒకరి బాగోగులొకరు కనీసం ఫోన్ ద్వారా తెలుసుకోవడానికి కూడా న్యూఢిల్లీలోనూ, ఇస్లామాబాద్‌లోనూ ఉన్న పెద్దమనుషుల అనుమతి కావాలంట. ఎక్కిన గుర్రం దిగివచ్చి ఫోన్లు చేసుకోండి అని అనుమతి ఇవ్వడానికే వారిద్దరికీ పది రోజులు పట్టింది. ఇక తక్కువ దెబ్బతిన్న భారతవాసులు ఎక్కువ దెబ్బతిన్న పాకిస్తాన్‌లోని

తమవారి ఊర్లకు పోయి సహాయం అందించడానికి అనుమతి ఎప్పుడొస్తుందో? అక్కడ అనాథలయిన వారిని ఇక్కడికి తీసుకొచ్చి ఆశ్రయం కల్పించడానికి అనుమతి అసలు వస్తుందో రాదో? దానికి 'కశ్మీర్ సమస్య' పరిష్కారం కావాలి కాబోలు. అప్పటిదాకా పాకిస్తాన్‌లోని దెబ్బతిన్న కశ్మీర్ గ్రామాలలో బతికి ఉన్నవారు బతికే ఉంటారా?

అయినప్పటికీ శాంతి బాటలో ఒక్కొక్క మెట్టూ పురోగమిస్తున్నామంటారు రెండు దేశాల నాయకులూ. ఒకరినొకరు అభినందించుకోవడం, పత్రికలు ఇరువురి విజ్ఞతనూ ప్రశంసించడం చికాకే కాదు విసుగు కూడా కల్గించే విషయాలు. ఇక్కడ ప్రధానంగా పత్రికలను తప్పుపట్టాలి. లేకపోతే, పదిరోజుల దాకా కనీసం ఫోన్ చేసుకోనివ్వని మూర్ఖత్వానికి రెండు ప్రభుత్వాలనూ తిట్టవలసింది పోయి, అనుమతి ఇవ్వడం గొప్ప విషయమంటూ రాస్తారా? 15 సంవత్సరాల తరువాత మొట్టమొదటిసారిగా వాస్తవాధీన రేఖకు ఇరువైపులా ఫోన్లు మోగాయని మెచ్చుకుంటారా? ఫోన్లు చేయగలిగిన వారు తమ వారంతా చనిపోయారని తెలుసుకొని కన్నీళ్ళ పర్యంతం అయ్యారని మళ్ళీ అవే పత్రికలు రాశాయి. మరి అప్పటిదాకా వాళ్ళు ఎంత ఆందోళన చెంది ఉంటారు? అయినా ఫోన్ చేయగలిగిన వారు కొందరే. అవతలివైపు జరిగిన భారీ విధ్వంసంలో టెలిఫోన్ కనెక్షన్లు చాలావరకు పోయాయి. ఫోన్ కలవని వారి బంధుమిత్రులు ఫోన్ మాత్రమే పోయిందనుకోవాలా, లేక తమవారు కూడా పోయారనుకోవాలా?

చివరికిప్పుడు ముషార్రఫ్ మనుషులను కూడా రానిస్తానన్నాడు. ఆ మాట ఆయన ఇస్లామాబాద్‌లో అనలేదు. అక్కడ 'సరిహద్దు భద్రత' మాత్రమే కనిపిస్తుంది తప్ప సరిహద్దు దగ్గరున్న మనుషులు కనిపించరు. ఆయనగారు తీరిక చేసుకొని ఆజాద్ కశ్మీర్ రాజధాని ముజఫరాబాద్‌కు వచ్చినప్పుడు ఈ ప్రకటన చేశాడు. అక్కడి వాతావరణం చూసి అది తప్పనిసరి అనుకొని ఉంటాడు. దీనికి ఎన్ని మెలికెలుపెడతారో, ఎప్పుడు సాధ్యమవుతుందో వేచి చూడాలి. ఈ రాకపోకల వల్ల మిలిటెన్సీ బలపడే ప్రమాదం ఉందని మనవాళ్ళు తప్పక సంకోచిస్తారు. మనవైపు ఉన్న కశ్మీర్‌లోని నిషిద్ధ మిలిటెంట్ సంస్థలు అవతలి వైపున ఉన్న కశ్మీర్‌లో స్వేచ్ఛగా సంచరిస్తూ తర్ఫీదు పొందుతున్న విషయం బయల్పడ గలదని పాకిస్తాన్ అధికార యంత్రాంగమూ సంకోచిస్తుంది. బహుశా ముషార్రఫ్ ప్రకటన నిజమయ్యే లోపల దానికి అనేక షరతులూ మినహాయింపులూ వచ్చి చేరతాయి.

కశ్మీర్ ప్రజలు ఇదంతా ఎవరికోసం భరించాలన్న ప్రశ్నకు మాత్రం జవాబు లేదు.

# ముషార్రఫ్ నోట అమెరికా మాట ఎందుకు వినపడుతున్నట్టు?

ముషార్రఫ్ ఈ మధ్య కశ్మీర్ విషయంలో చేసిన రెండు ప్రకటనలు మీడియాలో బాగా ప్రచారం అయ్యాయి. పాకిస్తాన్ కశ్మీర్‌ను కోరుకొనడం లేదనీ, కశ్మీర్ భవితవ్యాన్ని కశ్మీరీలే నిర్ణయించాలని మాత్రమే అంటున్నదనీ అన్నాడు. పాకిస్తాన్‌లో కొంతమందికి ఇది నచ్చలేదు. ముషార్రఫ్ అమెరికాను, భారత్‌నూ మెప్పించడానికి కశ్మీర్ విషయంలో పాకిస్తాన్ ఇప్పటిదాకా అనుసరిస్తూ వస్తున్న అచంచలమైన వైఖరి నుండి వైదొలగాడని జమాతె ఇస్లామి ప్రతినిధులు అతని మీద ఆరోపణ చేశారు.

నిజానికి ముషార్రఫ్ పాకిస్తాన్ రాజ్య ప్రయోజనాల దృష్ట్యా చాలా తెలివిగా వ్యవహరించారని చెప్పాలి. పాకిస్తాన్ పాలకుల అభిప్రాయంలో కశ్మీర్ వివాదాస్పద భూభాగం కావడానికి కారణం ఆ దేశాన్ని భారత్‌లో విలీనం చేసిన రాజు చర్యపైన ప్రజాభిప్రాయ సేకరణ ఇప్పటిదాకా జరపకపోవడం కాదు. అటువంటి ప్రజాభిప్రాయ సేకరణ జరిపి తీరుతామనీ, జరిపి ప్రజామోదం పొందినప్పుడే విలీనం పూర్తయినట్టు భావిస్తామనీ భారత పాలకులు కశ్మీర్ ప్రజలకే కాక ఐక్యరాజ్య సమితికి కూడా హామీయిచ్చారు. ఆ హామీని తప్పించుకోవడానికి ఆడిన నాటకాల చరిత్రే కశ్మీర్‌కు సంబంధించినంతవరకు గత యాభై ఏళ్ళ భారత చరిత్ర.

దీనిని పాకిస్తాన్ సహజంగానే వేలెత్తి చూపుతుంది గానీ, పాకిస్తాన్ అధికారిక దృష్టిలో 'కశ్మీర్ సమస్య' ఇది కాదు. దేశ విభజన జరిగినప్పుడు ముస్లింలు మెజారిటీగా ఉన్న రాష్ట్రాలన్నీ పాకిస్తాన్‌లో చేరాయనీ, ఒక్క జమ్మూకశ్మీర్ మాత్రమే హరిసింగ్ – నెహ్రూల కుయుక్తుల వల్ల, షేక్ అబ్దుల్లా నమ్మకద్రోహం వల్ల ఇండియాలోకి పోయిందనీ, ఇది అన్యాయమనీ వారి అభిప్రాయం. అధికారిక పాకిస్తానీ దృక్పథంలో ఇదే 'కశ్మీర్ సమస్య'. ద్విజాతి సిద్ధాంతపు మిగిలిపోయిన కర్తవ్యం అయిన కశ్మీర్ విముక్తిని కశ్మీరీల స్వయం నిర్ణయాధికార సమస్యగా ముషార్రఫ్ చెప్పడం సంప్రదాయవాదులకు నచ్చలేదు.

---

'మరో స్వతంత్ర ఉద్యమం' మాసపత్రిక, జనవరి–ఫిబ్రవరి 2007

కాని ముషార్రఫ్‌కు కొన్ని చారిత్రక వాస్తవాలు తెలియకుండాపోయే అవకాశం లేదు. హరిసింగ్ పరిపాలించిన జమ్మూకశ్మీర్ రాజ్యంలో ముస్లింలు మెజారిటీ అన్నది వాస్తవమే. ఒక్క కశ్మీర్ లోయలోనే కాదు, అప్పటి జమ్మూ ప్రాంతంలోనూ ముస్లింలే మెజారిటీ. ఒక లడఖ్‌లో మాత్రమే ముస్లింలూ బౌద్ధులూ దాదాపు చెరి సగం ఉంటారు. లాహోర్ రాజు రంజిత్‌సింగ్‌ను ఓడించిన బ్రిటిష్ వాళ్ళు ఆ రాజ్యమంతటినీ బ్రిటిష్ ఇండియాలో కలుపుకొని ఉంటే, అందులో భాగమైన జమ్మూకశ్మీర్ కూడా బ్రిటిష్ ఇండియాలో చేరి ఉండేది. దేశ విభజనప్పుడు పడమటి పంజాబ్‌లాగ, తూర్పు బెంగాల్ లాగ, సింధ్‌లాగ ఆ రాజ్యమంతా పాకిస్తాన్‌లో భాగమయి పోయి ఉండేది (బహుశా జమ్మూ, కటువా జిల్లాలు మాత్రం ఇండియాలోకి వచ్చి ఉండేవి). ఈ మేరకు పాకిస్తానీ సంప్రదాయవాదుల ఫిర్యాదులను అర్థం చేసుకోవచ్చు.

బ్రిటిష్‌వాళ్ళు రంజిత్‌సింగ్ రాజ్యంలో తక్కిన భాగాన్ని బ్రిటిష్ ఇండియాలో కలుపు కున్నారు గానీ, జమ్మూకశ్మీర్‌ను మాత్రం రంజిత్‌సింగ్‌కు ద్రోహం చేసి బ్రిటిష్ వాళ్ళ విజయానికి సహాయపడిన డోగ్రా జమీందారు గులాబ్‌సింగ్‌కు అప్పగించారు. ఆ రాజ్యంలో చాలా భిన్నత్వం ఉన్నప్పటికీ రెండు మూడు వందల సంవత్సరాలు ఒకే పాలన కింద ఉండడం వల్ల ప్రజలలో తామంతా ఒకటన్న భావన ఏర్పడి ఉండవచ్చు. మెజారిటీ ముస్లింలు కాబట్టి ఆ రాజ్యం యావత్తు పాకిస్తాన్‌లో కలవాలని అన్నా, భారత్‌లో గానీ పాకిస్తాన్‌లో గానీ చేరకుండ స్వతంత్రంగా ఉండాలన్న ఆకాంక్ష బలంగా ఉండింది కాబట్టి ఆ నిర్ణయమే చేసినా, లేదా ప్రజాభిప్రాయ సేకరణ జరిపి మెజారిటీ నిర్ణయం ప్రకారం ఆ రాజ్యం భవిష్యత్తు నిర్ణయించినా అర్థం ఉండేది.

కానీ 50 ఏళ్ళ తరువాత పరిస్థితి చాలా మారింది. వాస్తవాధీన రేఖ అనేది సరిహద్దు కాదని రాజకీయాల కోసం ఎంత చెప్పుకున్నా, మనుషుల మధ్య అది సరిహద్దే అయింది. పాత జమ్మూకశ్మీర్ రాజ్యం ప్రాతిపదికన చేసే ఏ ఆలోచనకూ ఇప్పుడు అర్థం లేదు. మీర్‌పూర్ వాసులు, కొంతమేరకు ముజఫరాబాద్ వాసులు తమకు తాము పాకిస్తాన్‌లో భాగంగానే భావించుకుంటారు. భారత్‌లోని జమ్మూవాసులు మానసికంగా భారతీయులే. లదాఖ్‌వాసులు జమ్మూతోగానీ కశ్మీర్‌తోగానీ మమేకం చెందరు. వాళ్ళకు సాంస్కృతికంగా, జాతిపరంగా సాన్నిహిత్యం ఉండేది టిబెటన్లతో. టిబెట్ చైనాదేశపు వలస కాకపోతే టిబెట్‌తో కలవడానికి ఇష్టపడతారేమో. వారిలో సగభాగం (కార్గిల్‌లో మెజారిటీ) ముస్లింలయినప్పటికీ షియాలు కావడం వల్ల పాకిస్తాన్‌లో కలవడానికి ఇష్టపడకపోవచ్చు. మొత్తానికి ఇష్టంగానో అయిష్టంగానో భారతీయులుగానే బతకడానికి లదాఖీలు సిద్ధపడి పోయినట్టున్నారు.

ఇక మిగిలింది కశ్మీర్ లోయ, జమ్మూలో కశ్మీరీలు నివసించే దోడా జిల్లా. బలమైన స్వాతంత్ర్య కాంక్ష ఇప్పటికీ ఉన్నది ఇక్కడే. పాకిస్తాన్‌లో దీని ప్రభావం ముజఫరాబాద్‌లో

మాత్రం కొంత ఉంటుంది. కశ్మీర్ లోయలో 95 శాతం పైగా ముస్లింలు కాబట్టి ద్విజాతి సిద్ధాంతం ఆధారంగా ఆ లోయను పాకిస్తాన్‌లో కలిపివేయాలని డిమాండ్ చేసే బదులు, వారికి స్వయం నిర్ణయాధికారం ఇమ్మనడం ప్రజాస్వామికంగానూ ఉంటుంది, అదే ఫలితాన్నీ ఇస్తుంది అనే నిర్ణయానికి ముషార్రఫ్ వచ్చాడు. ఇక్కడ గుర్తుంచుకోవలసిన విషయం ఏమిటంటే కశ్మీర్ విషయంలో పాకిస్తాన్ స్వయం నిర్ణయాధికారం అన్న పదాన్ని ఎప్పుడు ప్రయోగించినా అందులో ఇండియా కావాలా పాకిస్తాన్ కావాలా అన్న రెండు ప్రత్యామ్నాయాలే తప్ప స్వాతంత్ర్యం అన్న మూడవ ప్రత్యామ్నాయం లేదు. అవి రెండే ఉంటే మెజారిటీ పాకిస్తాన్‌కే వోటు వేస్తారన్న ధీమా ముషార్రఫ్‌కు ఉన్నట్టయితే అది వాస్తవికమైన అభిప్రాయమే. (మూడవ ప్రత్యామ్నాయం అన్నట్టయితే మెజారిటీ స్వాతంత్ర్యానికే వోటు వేస్తారనేది కశ్మీర్ గురించి తెలిసిన వాళ్ళందరి అభిప్రాయం.) చెప్పుకోదగ్గ విషయం ఏమిటంటే 1960 దాకా ఈ రెండు ప్రత్యామ్నాయాలే ఇచ్చినట్టయితే మెజారిటీ వోట్లు ఇండియాకే పడి ఉండేవనేది కూడా చరిత్రకారులలో ఏకాభిప్రాయం ఉన్న విషయమే. పరిస్థితిని అక్కడి నుండి ఇక్కడికి తీసుకొచ్చింది మన పాలకులే కాబట్టి ఎవరినీ ఆడిపోసుకొని ప్రయోజనం లేదు.

అయితే ముషార్రఫ్ అక్కడితో ఆగిపోలేదు. పాకిస్తాన్ మద్దతు ఇస్తున్నది కశ్మీరీల స్వయం నిర్ణయాధికారానికేనని ఒక పక్క అంటూ, వారి నిర్ణయంతో నిమిత్తంలేని 'పరిష్కారాన్ని' ప్రతిపాదించాడు. ఈ పరిష్కారం కొంత కాలంగా అమెరికా నోట వినపడుతున్నదీ, ఢిల్లీలోని భారత ప్రభుత్వ విధానకర్తలు అవునంటున్నదీ కావడం కొంత ఆశ్చర్యం, ఎక్కువ ఆందోళన కలిగించే విషయం. భారత్, అమెరికా, పాకిస్తాన్‌లు ఇంత అకస్మాత్తుగా 'కశ్మీర్ సమస్య' పరిష్కారాన్ని గురించి ఏకాభిప్రాయానికి ఎందుకు వచ్చేస్తున్నట్టు?

ఈ పరిష్కారం సారాంశమేమిటంటే ఇటో అటో 'అడ్జస్ట్' అయిపోయిన ప్రాంతాలు శాశ్వతంగా భారత్‌లోనూ పాకిస్తాన్‌లోనూ భాగం అయిపోతాయి. ఉదాహరణకు జమ్మూ, మీర్‌పూర్‌లు ఇంకా స్వయం నిర్ణయాధికారం, స్వాతంత్ర్యం అంటూ ఆందోళన చేస్తున్న ప్రాంతాలు (కశ్మీర్ లోయ, దోడా జిల్లా, బహుశా పాకిస్తాన్‌లోని ముజఫరాబాద్ ప్రాంతం) ఒక స్వయంప్రతిపత్తి గల రాజ్యశకలంగా ఏర్పడుతుంది. ఈ ప్రాంతవాసులకు ఇండియాతోనూ, పాకిస్తాన్‌తోనూ రాకపోకల స్వేచ్ఛ కొంత ఇవ్వబడుతుంది. వారి స్వయంప్రతిపత్తిపైన భారత పాకిస్తాన్‌ల ఉమ్మడి పర్యవేక్షణ, ఆ స్వయంప్రతిపత్తికి అమెరికా భరోసా ఉంటాయి. చిన్నాచితక సవరణలతో ఈ ప్రతిపాదన బిల్‌క్లింటన్ కాలం నుండి వినపడుతున్నది. ఢిల్లీలోని బ్యూరోక్రాట్లలో 'ప్రాక్టికల్' అని పేరున్న వారు దీనికి మద్దతుగా మాట్లాడుతున్నారు. ఇప్పుడు మొట్టమొదటిసారిగా పాకిస్తాన్ నోటి నుండి కూడా ఇదే మాట వినపడుతున్నది.

ఈ 'పరిష్కారం' భారత పాకిస్తాన్ జాతీయవాదుల అహాన్ని సంతృప్తిపరచడానికీ, అమెరికా పెత్తనాన్ని ఉపఖండంలో పెంచడానికీ తప్ప వేరే దేనికయినా పనికొస్తుందా? స్వాతంత్ర్యం కోరుకున్న పాపానికి కశ్మీరీలు ఒకటి కాదు, మూడు పెత్తనాల కింద బతకాలా? 'కశ్మీర్ సమస్య' కశ్మీరీల స్వయం నిర్ణయాధికార సమస్య అని ఎన్నిసార్లు చెప్పినా ఎక్కువ కాదు. అది కశ్మీరీల సమస్యే తప్ప మన దేశంలో చాలామంది భావిస్తున్నట్టు 'మన' సమస్య కాదు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే కశ్మీరీల వల్ల భారత్‌కు సమస్య రాలేదు. భారత్‌వల్ల, పాకిస్తాన్‌వల్ల కశ్మీరీలకు సమస్య వచ్చింది. దానికి ఏకైక పరిష్కారం, కశ్మీరీలకు మూడు ప్రత్యామ్నాయాలు ఇచ్చి ప్రజాభిప్రాయ సేకరణ చేపట్టడం, దాని ఫలితం ఏమైనప్పటికీ భారత పాకిస్తాన్‌లు దానిని మన్నించడం.

ముషార్రఫ్ నోట అమెరికా మాట వినపడడం పాకిస్తానీల సంగతేమో గానీ కశ్మీరీలకు చాలా కోపం తెప్పించి ఉంటుంది. పూర్తిగా సెక్యులర్ భావాలు గల కశ్మీరీలు సహితం తమ స్వాతంత్ర్య కాంక్షలకు పాకిస్తాన్ అండ లభిస్తుందని నమ్మారు. ఇప్పుడు పాకిస్తాన్ భారత్‌తోనూ అమెరికాతోనూ గొంతు కలిపి తమ స్వాతంత్ర్య కాంక్షను తృణీకరించడం వారికి చాలా బాధ కలిగిస్తుంది.

కానీ కాలం వారి పక్షాన లేదు. ముస్లింలు నివసించే ఏ ప్రాంతంలోనయినా అలజడి ఉంటే ఇస్లామిక్ మతవాద సంస్థలు ఎదగడానికది అవకాశం కల్పిస్తుంది. కాబట్టి అటువంటి అలజడులన్నింటినీ 'పరిష్కరించే'యాలనేది అమెరికా దృష్టి. న్యాయంగానే పరిష్కరించనక్కరలేదు. ఏదో ఒక రకంగా పరిష్కరింపచేసి చల్లారిస్తే అమెరికా అవసరం తీరిపోతుంది. భారత పాకిస్తాన్‌లు కశ్మీర్ భూభాగం గురించి ఘర్షించుకుంటున్నాయా? అయితే ఇద్దరికీ కశ్మీర్‌లో హక్కులు కల్పించేద్దాం. అది స్థిరంగా ఉండకపోవచ్చునా? అయితే వారిపైన అమెరికా అజమాయిషీ నెలకొల్పుదాం. అమెరికా కొంతకాలంగా సూచిస్తూ, ఇప్పుడు ముషార్రఫ్ వంత పాడుతున్న 'పరిష్కారానికి' ఇంతకంటే తర్కం లేదు. ఇదే అమలు అయితే కశ్మీరీలకు నిస్సందేహంగా చాలా అన్యాయం జరుగుతుంది. కాని వారి గోడు ఎవరికి పట్టింది?

# మరో రెండు దుర్మార్గాల కథ

**క**శ్మీర్ గురించి మంచి వార్తలు వినబడడం అరుదు. సైనికులో మిలిటెంట్లో పెద్దెత్తున హత్యాకాండకు పాల్పడ్డప్పుడే వార్త అవుతుంది. లేదా కశ్మీర్‌లో తర్ఫీదైన మిలిటెంట్లు ముంబాయిలోనో, ఢిల్లీలోనో బాంబు పేలుళ్ళకు పాల్పడ్డట్టు కనుగొన్నామని పోలీసులు ప్రకటించినప్పుడు వార్త అవుతుంది. భారత పాకిస్తాన్‌లు కశ్మీర్ గురించి ఒకరినొకరు తిట్టుకున్నప్పుడు వార్త అవుతుంది.

కశ్మీరీలకు ఏదైనా మంచి జరిగిందన్న వార్త సాధారణంగా వినం. ప్రత్యేకించి, మిలిటెన్సీని ఎదుర్కొనే పేరిట అక్కడి పాలనా యంత్రాంగం దాదాపు ఇరవై ఏళ్ళుగా పాల్పడుతున్న తీవ్ర నిర్బంధం నుంచి ప్రజలకు ఉపశమనం లభించిందని గానీ, అక్రమాలకు పాల్పడ్డ అధికారులకు శిక్ష పడిందని గానీ, ప్రజలే తిరగబడ్డారని గానీ సాధారణంగా వినం.

అందుకే 2007లో కశ్మీర్‌లో జరిగిన రెండు ఉదంతాల గురించి చెప్పుకోవాలి. ఒకటి, ఒక పద్ధతి ప్రకారం నిరాయుధ పౌరులను 'ఎన్‌కౌంటర్' పేరిట హతమార్చి వారికి విదేశీ మిలిటెంట్లు అని పేరు పెట్టి అనామకంగా పూడ్చిపెట్టి పారితోషికం పొందిన గండర్‌బల్ సీనియర్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ హన్స్‌రాజ్ పరిహార్, సైనిక అధికారి కల్నల్ విక్రంసింగ్ తదితరులపైన క్రిమినల్ కేసు నమోదు చేసిన ఉదంతం. రెండు, పరమ కిరాతకుడైన ప్రభుత్వ అనుకూల మిలిటెంట్ పాపాకిష్టవారీ ఉరఫ్ గులాం మహమ్మద్ లోన్ పైన ఎట్టకేలకు పాంపోర్ పట్టణ ప్రజలు తిరుగుబాటు చేసి అతనిని అరెస్టు చేయించిన ఉదంతం. ఈ తిరుగుబాటు జరిగిన సమయంలో మానవ హక్కుల వేదిక బృందం (ఇతర హక్కుల సంఘాలతో కలిసి) కశ్మీర్‌లో పర్యటిస్తున్న కారణంగా వెంటనే ఆ ఊరికి వెళ్ళి ప్రజలతో విస్తృతంగా మాట్లాడగలిగాము. అంతకుముందు ఆ ఊరిలో కిష్టవారీ ప్రస్తావన తెచ్చినప్పుడు ఏమీ ఎరగనట్టు మౌనంగా ఉండిన జనం ఈసారి కట్టతెగినట్టు అతని దౌర్జన్యాల గురించి వివరించారు.

'విదేశీ మిలిటెంట్' ఎన్‌కౌంటర్‌లో చనిపోయినట్టు కశ్మీర్‌లో సైన్యం, పోలీసులు తరచుగా ప్రకటిస్తుంటారు. ఇక్కడ విదేశీయుడు అంటే పాకిస్తాన్, ఆఫ్ఘానిస్తాన్, సౌదీ

---

మానవహక్కుల వేదిక బులెటిన్-9, మే 2007

అరేబియా మొదలైన దేశాలకు చెందిన వారని అర్థం. కశ్మీరీలు తరచుగా ఈ రకమైన ప్రకటనల పట్ల అవిశ్వాసాన్ని ప్రకటిస్తారు. చనిపోయిన వాడు 'విదేశీయు'డైతే శవాన్ని ఎవరికీ అప్పగించకుండా సైన్యమే పూడ్చి పెట్టవచ్చును. కాబట్టి అమాయకులను చంపడానికి వారిని విదేశీ మిలిటెంట్లుగా చూపించడం సులువైన మార్గం అని వారి అనుమానం.

విదేశీ మిలిటెంట్లు పెద్ద సంఖ్యలో ఉన్నారని చూపించడం వల్ల ప్రభుత్వానికి వేరే ప్రయోజనాలూ ఉన్నాయి. కశ్మీర్‌లో జరుగుతున్నది కశ్మీరీల స్వయం నిర్ణయాధికార పోరాటం కాదనీ, 'జిహాద్' అనీ వాదించడానికి అది పనికొస్తుంది. పాకిస్తాన్‌లోని జమ్మూకశ్మీర్ భూభాగానికి చెందిన వారిని విదేశీయులుగా వర్ణించడాన్ని కశ్మీరీలు వ్యతిరేకిస్తారు. పాత జమ్మూకశ్మీర్‌నే తమ 'దేశం'గా తాము భావిస్తున్నామనీ ఆ ప్రాంత ప్రజలిప్పుడు ఇండియాలో ఉన్నా, పాకిస్తాన్‌లో ఉన్నా తమకు వారు స్వదేశీయులేననీ వారి వాదన. ఇతర పాకిస్తానీలు, ఆఫ్ఘాన్‌లు వగైరా ఒకవేళ పోరాటకారులలో ఉన్నా, వారు కశ్మీరీలకు అండగా పోరాడడం 'ధర్మయుద్ధం'లో పాల్గొనడంగా భావించినా, అందులో తప్పేముందని కశ్మీరీలు వాదిస్తారు. తమ పోరాటానికి ఎవరు సహాయం చేయవచ్చునో శాసించే నైతిక అధికారం ఇండియాకెక్కడిదని ప్రశ్నిస్తారు.

ఈ ప్రశ్నలు, ప్రత్యుత్తరాలు అట్లాగుంచి, నిరాయుధులైన పౌరులను చంపేసి 'విదేశీ మిలిటెంట్ ఎన్‌కౌంటర్‌లో మృతి' అని ప్రకటించడం జరుగుతున్నదన్న సందేహం సహేతుకమైనదేనని ఇప్పుడు రుజువయింది. ఒక ఘటన కాకతాళీయంగా బయటికొచ్చింది గానీ ఇంకెన్ని జరిగాయో! 1990 నుంచి ఇప్పటిదాకా 8,000 మంది కశ్మీరీలు 'అదృశ్యం' అయ్యారని కశ్మీరీ మానవహక్కుల పోరాటకారులు ఆరోపిస్తున్నారు. వారంతా సరిహద్దు దాటి పాకిస్తాన్‌కు పోయి ఆయుధాల శిక్షణ పొంది 'జిహాద్'లో భాగం అయ్యారని ప్రభుత్వం అంటుంది. వాళ్ళను పట్టుకొని తీసుకుపోయింది సైన్యం లేక సైన్యానికి అనుకూలంగా పనిచేసే మిలిటెంట్లు అయినప్పుడు ఇదెట్లా సాధ్యం అని కశ్మీరీలు ప్రశ్నిస్తున్నారు.

అదృశ్యం అయిన ఈ 8,000 మందిలో ఎంతమంది విదేశీ మిలిటెంట్ల పేరిట చంపబడ్డారన్నది ఇప్పుడు తలెత్తుతున్న ప్రశ్న. పోలీసు, సైనిక అధికారులపైన క్రిమినల్ కేసు నమోదైన గండర్‌బల్ హత్యల పరంపర ఈ ప్రశ్నలు లేవదీస్తున్నది.

అబ్దుల్ రెహమాన్ పద్దార్ అనే వ్యక్తి అనంత్‌నాగ్ జిల్లా కొకర్‌నాగ్ ప్రాంతానికి చెందినవాడు. కార్పెంటర్ (వడ్రంగం) పని చేసుకొని బతికేవాడు. 2006 మార్చి 1వ తేదీన అతనిని శ్రీనగర్ పట్టణంలోని బటిమాలూ బస్‌స్టాండ్ దగ్గర తెల్లబట్టలలోని వ్యక్తులు అపహరించి తీసుకుపోయారు. ఆ తరువాత అతను కనిపించలేదు.

ఇటువంటి ఫిర్యాదులు పోలీసులకు చాలా వస్తుంటాయి కాబట్టి వారు యధాలాపంగా పరిశోధన చేయసాగారు. పరిశోధన క్రమంలో అతని మొబైల్ ఫోన్ సిమ్‌కార్డు అబ్దుల్

రషీద్‌వాగే అనే వ్యక్తి దగ్గర ఉందని తేలింది. నీకెవరిచ్చారంటే బషీర్ అహ్మద్‌భట్ అనే వ్యక్తి ఇచ్చాడని చెప్పాడు. ఆ వ్యక్తిని ప్రశ్నిస్తే తనకు ఫరూఖ్ అహ్మద్ పద్రూ అనే పోలీస్ కానిస్టేబుల్ ఇచ్చాడని చెప్పాడు. ఇతగాడు గందర్‌బల్ కేంద్రంగా గల పోలీసు స్పెషల్ ఆపరేషన్స్ గ్రూపు (ఎస్.ఒ.జి) సీనియర్ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీసు హన్స్‌రాజ్ పరిహార్ నేతృత్వంలోని ప్రత్యేక పోలీసు బృందంలో జీపు డ్రైవర్‌గా పని చేస్తున్నాడు. 'మిస్సింగ్' కార్పెంటర్ అబ్దుల్ రెహమాన్ పద్దార్ సెల్‌ఫోన్ సిమ్ కార్డు అతని దగ్గరకు చేరిందంటేనే ఏం జరిగిందో ఊహించుకోవచ్చు.

పద్దార్ 'అదృశ్యాన్ని' పరిశోధిస్తున్న పోలీసులు ఇక్కడిదాకా వచ్చాక ఇది ఎటో పోతున్నట్టుంది మనకెందుకులే అని ఊరుకుంటే ఈ కథ ఇక్కడితో ఆగిపోయేది. కానీ నిజాయితీగల అధికారి ఎవరో చేతికి చిక్కిన తీగను లాగడం మొదలుపెట్టాడు. డొంకంతా కదిలింది. పద్దార్‌ను 2006 డిసెంబర్ 9న (అంటే తొమ్మిది నెలల నిర్బంధం అనంతరం) గందర్‌బల్ సమీపంలోని వస్కార్ వద్ద చంపి, ముల్తాన్‌కు చెందిన లష్కర్–ఇ–తొయిబా కమాండర్ అబు హఫీజ్ ఎన్‌కౌంటర్‌లో మరణించాడని ప్రకటించి ఖననం చేశారని బయటపడింది. దానితోబాటు అటువంటి మరొక నలుగురు 'విదేశీ మిలిటెంట్ల' ఎన్‌కౌంటర్ కథలు కూడా బయటపడ్డాయి.

అనంత్‌నాగ్ జిల్లా కొకర్‌నాగ్‌కే చెందిన అలీ మహమ్మద్ పద్రూ అనే వ్యక్తిని 2006 మార్చి 7వ తేదీన అరెస్టు చేసి 14వ తేదీన బండిపుర జిల్లాలోని సుంబల్ పోలీస్‌స్టేషన్ పరిధిలో కాల్చి చంపి పాకిస్తాన్‌కు చెందిన షహీన్‌భాయి అనే మిలిటెంటు ఎన్‌కౌంటర్‌లో చనిపోయాడని ప్రకటించారని బయటపడింది.

శ్రీనగర్‌కు చెందిన నజీర్ అహ్మద్ డెక్కా పాతబట్టలు, అత్తరు అమ్ముకొని బతికేవాడు. అతనిని 2006 ఫిబ్రవరి 16న శ్రీనగర్‌లోని లాల్‌చౌక్ ప్రాంతంలో అరెస్టుచేసి గందర్‌బల్ సమీపంలోని రేష్‌పురా వద్ద గుర్తు తెలియని విదేశీ మిలిటెంట్ పేరిట చంపారు. అదే నగరానికి చెందిన గులాం నబీ వాని తోపుడు బండి పెట్టుకొని పాతబట్టలు అమ్ముకునేవాడు. అతనిని 2006 మార్చి 2వ తేదీన లాల్‌చౌక్‌లోని బిస్కో స్కూలు ఎదురుగా అరెస్టు చేసి పాకిస్తాన్ ఆక్రమిత కశ్మీర్‌కు చెందిన జుల్ఫికార్ అహ్మద్ అని పేరు పెట్టి బండిపురా ప్రాంతంలోని ఐసా వద్ద 'ఎన్‌కౌంటర్'లో చంపారు.

అయిదవ మృతుడు ఒక ఇమాం. 27 సంవత్సరాల యువకుడైన మౌల్వీ షౌకత్ అహ్మద్ కబరియా జమ్మూ ప్రాంతంలోని బనిహాల్ సమీపాన ఉన్న దూలిగాం నకూట్ జబ్రి అనే కుగ్రామం నివాసి. అయితే ఇతను శ్రీనగర్‌లోని ఆలంగిరి మసీదు ఇమాంగా ఉన్నాడు. 2006 అక్టోబర్ 4 రాత్రి అతను నిద్రపోయే ముందు మసీదు గేటు వేయడానికి పోగా అక్కడ అతనిని పట్టుకొని తీసుకుపోయి బండిపుర జిల్లాలోని బాజిపుర ఐజాస్ వద్ద

తెల్లవారే లోపల కాల్చేసి, కరాచీకి చెందిన అబు జహీద్ అనే విదేశీ మిలిటెంటు 'ఎన్‌కౌంటర్'లో చనిపోయాడని ప్రకటించారు.

ఒక హత్యతో మొదలైన పరిశోధన అయిదింటిని బయటపెట్టి అక్కడ ఆగిపోవడానికి కారణం ఈ అయిదూ సీనియర్ పోలీస్ సూపరింటెండెంట్ హన్స్‌రాజ్ పరిహార్ ఆధ్వర్యంలో జరిగినవి కావడం. పౌరులను బంధించి తీసుకుపోయి చంపేసి 'విదేశీ మిలిటెంట్' అని పేరు పెట్టి రివార్డు తీసుకునే పథకం అతను రచించాడు. ఈ విషయాలు బయటికొచ్చేసరికి కార్పెంటర్ పద్దార్ మృతికి రూ. 1,25,000/- పారితోషికం S.O.G.కి లభించేసింది కూడా. అతనికి ఈ హత్యాకాండలో అతని శాఖకే చెందిన కిందిస్థాయి ఉద్యోగులేకాక భారత సైన్యంలో భాగమైన రాష్ట్రీయ రైఫిల్స్‌కు చెందిన కల్నల్ విక్రంసింగ్ కూడా సహకరించాడని పరిశోధనలో తేలేసరికి అతనిపైన కూడా కేసు నమోదు చేశారు.

ఈ 'గండర్‌బల్ హత్య'ల పరిశోధనను ఆ రాష్ట్ర ప్రభుత్వం ఫరూఖ్ అహ్మద్ అనే డి.ఐ.జి.కి అప్పగించింది. ఎం.ఎల్.కౌల్ అనే రిటైర్డ్ హైకోర్టు న్యాయమూర్తి ఆధ్వర్యంలో న్యాయవిచారణకు కూడా ఆదేశించింది. అయితే కాకతాళీయంగా బయటికొచ్చిన ఈ అయిదు ఘటనలను దాటిపోవడానికి రాష్ట్ర ప్రభుత్వం ఇష్టపడలేదు. 'మాయం' అయిన వాళ్ళు విదేశీ మిలిటెంట్ల పేరిట హతమవుతున్నారన్న సందేహానికి ఇప్పుడు ఊతం లభించింది కాబట్టి, తొలి నుంచి జరిగిన 'విదేశీ మిలిటెంట్'ల ఎన్‌కౌంటర్ హత్యలను సమకాలీన 'మిస్సింగ్' కేసులతో సమన్వయపరచి పరిశోధించాలన్న డిమాండ్‌కు అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి గులాంనబీ ఆజాద్ ససేమిరా అన్నాడు. కశ్మీరీ పౌర సమాజం మాత్రం ఈ డిమాండ్ బలంగా పెడుతున్నది. కశ్మీర్‌లో చాలాచోట్ల 'విదేశీ మిలిటెంట్' సమాధులున్నాయి. ఆ సమాధులలో అత్తరు అమ్ముకునే ఏ అర్భకుడున్నాడో, ఏ ఇమాం ఉన్నాడో తేలవలసి ఉంది.

ఇక రెండవ ఉదంతానికి వద్దాం.

ప్రభుత్వ అనుకూల (లేక 'సర్కారీ') మిలిటెంట్లు కశ్మీర్‌లో భారతసైన్యం చేపట్టిన అత్యంత వికృత సృష్టి. వీళ్ళలో అధికభాగం మాజీలు. కశ్మీరీ స్వాతంత్ర్య ఉద్యమానికి శత్రువులుగా మారిన మాజీలు. ఈ కారణంగా కశ్మీరీలు వారిని 'విద్రోహులు' (రెనెగేడ్స్) అంటారు. మిలిటెంట్ల వల్ల వారికి ప్రాణాపాయం ఉండగలదని చెప్పి సరండరైన తరువాత కూడా అధికారులు వారి తుపాకులు వారి దగ్గరే ఉంచుకోనిచ్చారు. తమ వ్యక్తిగత శత్రువులపైన దాడులు చేసే స్వేచ్ఛ ఇచ్చారు. దారిదోపిడీలు చేసి సంపాదించుకునే అవకాశం ఇచ్చారు. ఎదురు వారు ఇయ్యవలసిందేమిటంటే భారత ప్రభుత్వం తరఫున ఒక ప్రైవేట్ ముఠాగా పనిచేస్తూ ప్రభుత్వ బలగాల చేతికి మట్టి అంటకుండా కశ్మీరీ స్వయం నిర్ణయాధికార పోరాటానికి అనుకూలంగా ఉన్న వారిపైన దాడులు చేయాలి, హతమార్చాలి,

టెర్రరైజ్ చేయాలి. వారికి కూడా ఆ పోరాటం పట్ల వ్యతిరేకత ఉంది కాబట్టి ఇష్టపూర్వకంగానే చేస్తారు.

ఈ టెర్రర్‌కు పేరుపడ్డ ఇద్దరు ప్రముఖులు జంషడ్ షిరాజీ ఉరఫ్ కుకాపరే, గులాం మహమ్మద్ లోన్ ఉరఫ్ పాపాకిష్టవారీ. ఇద్దరూ ఒకప్పుడు మిలిటెంట్లే. కుకాపరే ఇఖ్వాన్ ఉల్ ముస్లిమీన్ అనే మిలిటెంట్ సంస్థలోనూ, కిష్టవారీ హర్కత్ ఉల్ అన్సార్ అనే మిలిటెంట్ సంస్థలోనూ పని చేశారు. వాటి నుంచి బయటికొచ్చిన తరువాత ఇఖ్వాన్ ఉల్ ముస్లిమూన్ అనే సర్కారీ మిలిటెంట్ సంస్థను నెలకొల్పారు. కుకాపరే దాని అగ్రనాయకుడు కాగా పాపాకిష్టవారీ రెండవవాడు. 1995 చివరి భాగం నుంచి వీరి దౌర్జన్యాలు మొదలయ్యాయి. వీరు సైన్యం కనుసన్నలలో ఉంటూ ఒక తెల్లబట్టల సాయుధసేనగా వ్యవహరిస్తారు. వీళ్ళెక్కడ సంచరిస్తున్నా కనుచూపు మేరలో సైనికులుంటారు – వీళ్ళను కాపాడడానికి. వీళ్ళు దారిదోపిడీలు చేస్తారు, కశ్మీరీ ఉద్యమ సానుభూతిపరులను హతమారుస్తారు, అపహరించి సైన్యానికి అప్పగిస్తారు, సైన్యం చేసే దాడులలో, సోదాలలో సైన్యంతో బాటు పోయి ఇళ్ళూ వాడలూ చూపిస్తారు.

కిష్టవారీ స్వస్థలం పుల్వామా జిల్లాలోని పాంపోర్ పట్టణం. 40 వేల జనాభా గల ఈ ఊరు శ్రీనగర్ – జమ్మూ రహదారిపైన ఉంది. దాని పరిసర గ్రామాలు కుంకుమపువ్వు పంటకు ప్రసిద్ధి. అందువల్ల పాంపోర్ కుంకుమపువ్వు వర్తకానికి కేంద్రం. కిష్టవారీ ఇంటిచుట్టూ సి.ఆర్.పి.ఎఫ్ జవాన్ల గస్తీ ఎప్పుడూ ఉంటుంది. ఒకటి రెండు సి.ఆర్.పి.ఎఫ్ ట్రక్కులు, అతని వినియోగం కోసం ఒక పోలీసుల జీప్సీ ఇంటి బయట ఎప్పుడూ ఉంటాయి. అతని ఇంటిని దాటి రహదారి మీద పోతున్నప్పుడు ఒక హంతకుడికి భద్రతా దళాలు కల్పిస్తున్న ఈ భద్రత వింత లోకంలో ఉన్నామన్న అనుభూతి కలిగిస్తుంది. అయితే మొన్నటిదాకా ఆ ఊరిలో అతని గురించి ఏ సమాచారమూ ప్రజల నుంచి రాబట్టడం అసాధ్యంగా ఉండేది. అతని ప్రస్తావన చేస్తే అదేదో ఎప్పుడూ విని ఎరుగని పేరయినట్టు తెల్లముఖాలు వేసుకొని చూసేవారు.

రెనెగేడ్ల ఉపయోగం 1996లో పార్లమెంటు స్థానాలకు జరిపిన ఎన్నికలలో ప్రభుత్వానికి తెలిసొచ్చింది. 1989 లో కశ్మీర్ లోయలో మిలిటెన్సీ మొదలైన తరువాత అక్కడ ఎన్నికలు జరపలేదు. 1996లో మొట్టమొదటసారి జరిపారు. ఆ ఎన్నిక విజయవంతంగా జరిపితే (అంటే గౌరవప్రదమైన ఓటింగ్ సంఖ్య సాధిస్తే) మిలిటెన్సీ ప్రభావం తగ్గిందని ప్రపంచానికి భారత పాలకులు చెప్పుకోవచ్చు. అందుకోసం సర్కారీ మిలిటెంట్లను రంగంలోకి దింపారు. వారిలో కొందరు స్వయంగా పోటీ చేశారు. కొందరు వివిధ పార్టీల అభ్యర్థుల ప్రచారంలో తుపాకులతో సహా పాల్గొన్నారు. కొందరు సైన్యంతోపాటు గ్రామాలు తిరిగి పోలింగ్ రోజున తప్పనిసరిగా ఓటు వేయాలనీ లేకపోతే

తీవ్రపరిణామాలు ఉంటాయనీ బెదిరించారు. ఈ సర్కారీ మిలిటెంట్లు స్థానిక సమాజానికి చెందినవారు, ఊరూవాడా ఎరిగినవారు కావడంతో వారివల్ల ప్రజలలో కలిగిన భయం అంతాయింతా కాదు. ఆ ఎన్నిక సందర్భంగా కశ్మీర్‌లో పర్యటించిన హక్కుల సంఘాల బాధ్యులు పాపాకిష్టవారీని కలిసినప్పుడతను గర్వంగా 'నా తుపాకీ వల్లనే కశ్మీర్‌లో ఎన్నికలు, ప్రజాస్వామ్యం సాధ్యమయ్యాయి' అన్నాడు.

పార్లమెంటుకు ఎన్నికలు జరిపిన తరువాత అదే పద్ధతిలో అసెంబ్లీకి ఎన్నికలు జరిపారు. అప్పటి నుంచి జరుపుతూనే ఉన్నారు. ఈ క్రమంలో ఎన్నికలను 'సమర్థంగా' నిర్వహించడంలోనే కాక మిలిటెన్సీ తాలూకు సామాజిక పార్శ్వాన్నీ, పునాది వర్గాలనూ భయభ్రాంతులను చేసి అణగదొక్కడంలోనూ రెనెగేడ్లది అనన్యసాధ్యమైన పాత్ర అని భారత పాలకులు గుర్తించారు, వాడుకున్నారు. వారికివ్వవలసిన స్వేచ్ఛ ఇచ్చారు. 1995 నుండి 2001 దాకా (ఆ తరువాత కొంచెం తక్కువ మోతాదులో) వీరి భయం కశ్మీర్‌లో విపరీతంగా ఉండింది. బయటినుంచి వెళ్ళిన హక్కుల సంఘాలతోనూ, మీడియాతోనూ మాట్లాడడానికి సహితం జనం భయపడేవారు. ఏ సందులో నుంచి ఏ సర్కారీ మిలిటెంట్ చూస్తున్నాడో, ఆ తరువాత ఏం చేస్తాడో అన్నది వారి భయం. తమ ఇళ్ళు, కార్యాలయాల నాలుగు గోడల మధ్య మాట్లాడేవారే తప్ప కనీసం సాగనంపడానికి గేటుదాకా కూడా వచ్చేవారు కారు. 1997 లో కశ్మీర్‌లో పర్యటించిన హక్కుల బృందం పుల్వామా జిల్లా కోర్టు బార్ అసోసియేషన్ రూంలో లాయర్లతో మాట్లాడుతున్నప్పుడు అసోసియేషన్ అధ్యక్షుడు 'ఇక్కడికొక మానవ హక్కుల బృందం వచ్చిందనీ మీతో మేము మాట్లాడుతున్నామనీ పాపాకిష్టవారీకి తెలిస్తే ఇప్పటికిప్పుడు ఈ కోర్టు భవనాన్ని పేల్చేసి అందరినీ చంపేస్తాడు' అన్నడు. ఈ వాక్యాలు ఆనాటి వాతావరణానికి అద్దం పడతాయి.

2001 తరువాత ఈ భయం కొద్దిగా తగ్గినప్పటికీ ఒక మోతాదులో కొనసాగింది. తగ్గడానికి ఒక కారణం - రెనెగేడ్ల వినియోగం గురించి సర్వత్రా పెల్లుబికిన విమర్శ కారణంగా జమ్మూకశ్మీర్ పాలనా యంత్రాంగంలోనే కొంత విముఖత ఏర్పడడం. (భారత సైన్యం మాత్రం ఈ విమర్శను ఎప్పుడూ ఖాతరు చేయలేదు.) రెండవ కారణం, మిలిటెంట్లు సర్కారీ మిలిటెంట్ల పైన దాడులు చేసి చాలామందిని చంపడం. అగ్రనాయకుడైన కుకాపరే సహితం చనిపోయాడు. (అతని 'సేవలకు' గుర్తింపుగా భారత సైన్యం అతని స్వగ్రామమైన హాజంలో తాము నడుపుతున్న పాఠశాలకు అతని పేరు పెట్టారు.)

పాపాకిష్టవారీ రాజ్యం మాత్రం పాంపోర్ పట్టణంలో కొనసాగింది. 2001 దాకా ప్రత్యక్షంగా హత్యలకు పాల్పడేవాడు. ఆ తరువాత అతనిని వ్యతిరేకించినవారు అదృశ్యం కావడం, గుర్తు తెలియని వ్యక్తుల చేతిలో హతం కావడం, పొరుగున ఉన్న జీలం నదిలో శవాలై కొట్టుకురావడం జరిగేది. మొత్తానికి పాంపోర్ పట్టణం, ఆ పరిసరాలలోనే 100

మందిని పాపాకిష్టవారీ చంపి ఉంటాడనీ, 100 కు పైగా ఇళ్ళు కాలబెట్టి ఉంటాడనీ మొన్నటి తిరుగుబాటు తరువాత ప్రజలు అన్నారు.

ఆ తిరుగుబాటు కూడా అనుకోకుండా జరిగింది. బహుశా అనుకుంటే జరిగేది కాదేమో. పాపాకిష్టవారీ తన అక్రమ సంపాదనలో భాగంగా పాంపోర్‌లోని ఒక కబరస్తాన్ (శ్మశానం)లో ప్లాట్లు వేసి అమ్ముకోవాలని చూశాడు. 2007 ఏప్రిల్ చివరి వారంలో మసీదు వద్ద జరిగిన వాదనలో అతని చర్యకు పెద్దలు అభ్యంతరం తెలుపగా, అబ్దుల్ గఫూర్ దార్ అనే పెద్దమనిషిని కిష్టవారీ చెంపమీద కొట్టాడు. ఇది చూసి ఆగ్రహించిన బషీర్ అహ్మద్ అనే యువకుడు కిష్టవారీని తిరిగి చెంపమీద కొట్టాడు. ఊహించని ఈ సాహసం అక్కడ కూడిన ప్రజలకు ధైర్యాన్నిచ్చింది. వాళ్లు కిష్టవారీకి వ్యతిరేకంగా నినాదాలు ఇచ్చారు. అతని అంగరక్షకుడైన పోలీసు జవాను వారి పైన కాల్పులు జరపగా, ప్రజలు కోపంగా పోలీస్ స్టేషన్‌కు వెళ్లారు. పోలీసులు గుంపు మీదికి కాల్పులు జరిపి అయిదుగురిని గాయపరిచారు. దానితో కోపోద్రిక్తులైన ప్రజలు పోలీస్‌స్టేషన్ బయట రహదారికి అడ్డంగా బైఠాయించారు. పోలీసులు కిష్టవారీని అరెస్టు చేసేదాకా జనం లేవలేదు.

మే 9వ తేదీన హక్కుల బృందం పాంపోర్‌కు పోయేసరికి కిష్టవారీ ఇంకా జైలులోనే ఉన్నాడు. జనం హక్కుల బృందం చుట్టూ మూగి కిష్టవారీ దౌర్జన్యాలను ఏకరవు పెట్టారు. వాటిలో బాగా ప్రచారమైన ఘటన గులాం రసూల్ షేఖ్ హత్య. ఇతను కుంకుమ పువ్వు వర్తకం చేసేవాడు, రెహనుమా-ఇ-కశ్మీర్ అనే ఉర్దూ పత్రికకు, సాఫ్రన్ టైమ్స్ అనే ఇంగ్లీష్ పత్రికకూ సంపాదకుడు, స్థానిక ధార్మిక ఆస్తుల ట్రస్టుకు అధ్యక్షుడు. అప్పట్లో ఇతనొక్కడే కిష్టవారీని బహిరంగంగా విమర్శించేవాడు. ఒకసారి స్థానిక పోలీస్‌స్టేషన్‌లోను, ఒకసారి రంజాన్ పండుగ సంబరాల సందర్భంగానూ అతనితో వాగ్వాదానికి దిగాడు. 1996 మార్చి 22న అతడు శ్రీనగర్ నుంచి తిరిగి వస్తుండగా, రోడ్లో కిష్టవారీ మనుషులు అతనిని అపహరించారు. ఏప్రిల్ 10 నాడు అతని శవం జీలం నదిలో దొరికింది.

మహమ్మద్ రంజాన్‌ఖాన్ అనే టైలరు మా హక్కుల బృందాన్ని తన ఇంటికి రప్పించుకొని 18 సంవత్సరాల తన కొడుకు అబ్దుల్ రషీద్‌ను కిష్టవారీ చంపిన ఉదంతాన్ని జ్ఞాపకం చేసుకున్నాడు. ఇతను కిష్టవారీ దౌర్జన్యాలను విమర్శిస్తుండేవాడన్న కోపంతో 5 లక్షల రూపాయలు జుర్మానా కట్టమని ఒత్తిడి చేశాడట. చిన్న ఊరిలో బట్టలు కుట్టుకొని బతికే ఖాన్‌కు అది సాధ్యం కాలేదు. 1996 జనవరి 5వ తేదీ రాత్రి కిష్టవారీ ఇతని ఇంటిమీదికొచ్చి, ఒక ప్రైవేట్ బస్ సర్వీస్‌లో కండక్టర్‌గా పనిచేస్తున్న కొడుకు అబ్దుల్ రషీద్‌ను బలవంతంగా లాక్కుపోయాడు. తల్లి అడ్డంపోగా ఆమెను పక్కకు తోసేశాడు. అదే సాయంత్రం అపహరించిన ఫయాజ్ అహ్మద్ వానీ అనే మరొక యువకునితోబాటు ఆ రాత్రి 10.30కు నడిరోడ్డులో రషీద్‌ను కిష్టవారీ కాల్చిచంపాడు. ఇద్దరి శవాలూ రాత్రంతా

అక్కడే పడి ఉన్నాయి. కాల్పుల శబ్దం విన్నా జనం వాటి దగ్గరకు పోవడానికి సాహసించలేదు. కిష్టవారీ పొద్దున వచ్చి రెండు శవాలలోనికీ తూటాలు నింపి వెళ్ళిపోయాడు.

అతనితో మాట్లాడుతుండగా మహమ్మద్ షఫీ సోఫీ అనే వర్తకుడు వచ్చి హక్కుల బృందాన్ని తన ఇంటికి తీసుకుపోయి తన చెల్లెలి హత్య కథ జ్ఞాపకం చేసుకున్నాడు. 1995 నవంబర్ 8న పాపాకిష్టవారీ 50 మందితో అతని ఇంటి మీదకొచ్చి అతని ఇంటిని కాలబెట్టాడు. సోఫీ చెల్లెలు షకీలాబానో పైపుతో నీళ్ళుకొట్టి మంటలను ఆపే ప్రయత్నం చేసింది. కిష్టవారీ ఆమెపైన నేరుగా కాల్పులు జరిపి చంపాడు. సోఫీ ఆమె శవాన్ని తీసుకొని పోలీస్ స్టేషన్‌కు పోయి కేసు నమోదు చేయించగా, కిష్టవారీ అతనిని అపహరించి 25,000 రూపాయలు జుర్మానా వసూలు చేసి విడిచిపెట్టాడు.

'ఇవన్నీ ఇప్పుడు చెప్తున్నారుగానీ గతంలో మేము కిష్టవారీ దౌర్జన్యాల గురించి అడిగితే ఏమీ ఎరుగనట్టు మౌనంగా ఉండేవారే' అని హక్కుల బృందం చుట్టూ మూగిన జనంతో అనగా, అక్కడే ఉన్న గులాం మహమ్మద్ మీర్ అనే వ్యాపారి వైపు చూపించి, 'మీరు 1997 లో వచ్చినప్పుడితను మాట్లాడాడు. ఆ పాపానికి పాపాకిష్టవారీ ఇతని నుంచి 50,000 రూపాయలు వసూలు చేశాడు' అన్నాడు గుంపులో ఒకరు. మీర్ బహుశా అదృష్టవంతుడు. చెల్లించడానికి అతని దగ్గర అంత మొత్తం ఉంది కాబట్టి కిష్టవారీ జుర్మానాతో సరిపెట్టుకున్నాడు. పేదవాడైవుంటే బహుశా హతమార్చి ఉండేవాడు.

ఈ హతుల కుటుంబాలు ఎక్కువ భాగం న్యాయం కోసం పోరాటం చేసే సాహసం చేయలేదు. ఒక్క మినహాయింపు హైస్కూల్ టీచర్ మసూదా పర్వీన్. తన భర్త హత్య గురించి ఆమె 1998లో మొదలుపెట్టిన న్యాయ పోరాటం 2007లో సుప్రీంకోర్టులో ఓడిపోయేదాకా సాగింది. 'ఒకప్పుడు నన్ను నేను ఇండియన్‌గానే భావించుకున్నాను. నా కొడుకులు బాగా చదువుకొని మంచి ఉద్యోగాలు సంపాదించుకోవాలన్నదొక్కటే నా కోరిక' అంటుంది ఆమె. సుప్రీంకోర్టు 2007 మే నెల 2వ తేదీన చాలా అన్యాయమైన తీర్పు ఇస్తూ ఆమె కేసు కొట్టేసిన తరువాతే తనకు భారత్ మీద విశ్వాసం పోయిందంటుంది ఆమె.

ఆమె భర్త గులాం మొహిదీన్ రెగూ వృత్తిరీత్యా లాయరు, కుంకుమ పువ్వు వర్తకుడు. మరొక ఇద్దరు వర్తకులకతను బాకీ పడ్డాడు. ఆ ఇద్దరు – మహమ్మద్ సలీంభట్, గులాం మహమ్మద్ దేవా – బాకీ తీర్చమని వెంటపడ్డారు. రెగూ తన భూమి వాళ్ళకు అప్పగించేశాడు. అది సరిపోతుందని అతను భావించగా, సరిపోదని వారు దబాయించి సతాయించారు. అతని నుంచి బాకీ వసూలు చేసిపెట్టమని వారు హిజ్బుల్ ముజాహిదీన్ నాయకులను కోరగా, వారు రెగూను అపహరించి తీసుకుపోయి 20 లక్షలు చెల్లించమని ఒత్తిడిపెట్టారు.

అప్పుడు మసూదా పర్వీన్ హిజ్బుల్ ముజాహిదీన్ జిల్లా నాయకుడిని కలిసి తమ కథ మొత్తం వివరించింది. అతను సంతృప్తి చెంది గులాం మొహిదీన్ రెగూను విడిచిపెట్టాడు.

మిలిటెంట్ల వల్ల కాకపోతే పోలీసుల వల్ల అవుతుందని భావించిన అప్పులవాళ్ళు పోలీసుల దగ్గరకు పోయారు. అతను మిలిటెంట్ అనీ ఆ బలాన్ని చూసుకొని బాకీ ఎగ్గొట్టాడనీ ఫిర్యాదు చేశారు. పోలీసులు పదే పదే రెగూను తీసుకుపోయి బాకీ తీర్చమని నిర్బంధించసాగారు. మసూదా పర్వీన్ అడపాదడపా పోలీసులకు మొత్తం 50,000 రూపాయలు లంచంగా ఇచ్చి తన భర్తను కాపాడుకుంటూ వచ్చింది. చివరికి విసిగిపోయి అవంతిపుర పోలీస్ సూపరింటెండెంట్ దగ్గరకు పోయి భూమి అప్పగించడం ద్వారా అప్పు మొత్తం తీర్చేశామనీ ఇంకా ఒత్తిడి పెట్టడం, పోలీసులు దానికి సహకరించడం బాగాలేదనీ వివరించింది. ఆ అధికారి రంజాన్ సందర్భంగా ఉపవాసం ఉంటున్నాననీ పండగ అయిపోగానే పరిష్కరిస్తాననీ హామీ ఇచ్చాడు. కానీ పండగ అయిపోయేలోగా గులాం మహమ్మద్ రెగూ హతమయ్యాడు.

1998 ఫిబ్రవరి 2 రాత్రి పాపాకిష్టవారీ అనుయాయులైన బషీర్ అహ్మద్ లంగలా, అబ్దుల్ ఖలీద్ భట్ అనే ఇద్దరు యువకులు రెగూ ఇంటికొచ్చి మీ ఇంట్లో మిలిటెంట్లు దాక్కున్నారని మాకు అనుమానంగా ఉంది, వెతుకుతాం అన్నారు. అంతగా అనుమానం ఉంటే వెతుక్కొమ్మని మసూదా పర్వీన్ అనింది. వాళ్ళు కొంచెంసేపు ఇల్లు సోదా చేశారు. పోతూ పోతూ ఆమె భర్తను తమతో తీసుకుపోయి ఇంటి బయట గొళ్ళెం వేశారు. కిటికీలో నుంచి బయటకు చూసిన మసూదా పర్వీన్‌కు సమీపంలోని లేత్‌పురా క్యాంపు కేంద్రంగా గల 17 జాట్ రెజిమెంట్‌కు చెందిన మేజర్ డి.ఎస్.పునియా, మరికొందరు జవాన్లు రోడ్డుమీద కనిపించారు. రెనెగేడ్లు వెళుతూ వెళుతూ ఇంటి బయట గొళ్ళెం పెట్టి వెళ్ళిపోయారని గమనించిన మసూదా తదితర కుటుంబ సభ్యులు కేకలు పెట్టగా, ఇరుగుపొరుగు వచ్చి గొళ్ళెం తీశారు. ఇంటి నుంచి బయటకొచ్చిన మసూదా తన భర్తను తీసుకుపోయిన వారిని వెంబడించే ప్రయత్నం చేసింది గానీ సైనిక జవాన్లు ఆమెను వెనక్కి నెట్టారు. నీ భర్తకేమీ కాదు లెమ్మని మేజర్ పునియా ఆమెకు హామీ ఇవ్వగా ఆమె తప్పనిసరై వెనక్కి వచ్చింది.

అయితే వెనక్కివచ్చి భర్త గదిలోకి పోయి చూడగా రక్తం కనిపించింది. తన భర్తను రెనెగేడ్లు గాయపరచారని గ్రహించిన ఆమె వెంటనే బయటికొచ్చి మేజర్ పునియాను కలిసే ఉద్దేశంతో లేత్‌పురా క్యాంపుకు పోయింది. క్యాంపు బయట ఆమెకొక రెనెగేడ్ కనిపించాడు. నీ భర్తకేమీ కాదు, రేపు వెనక్కి వస్తాడని హామీ ఇచ్చాడు. ఆమె మళ్ళీ వెనక్కి వచ్చింది. మరుసటి రోజు ఆమెకు పాంపోర్ పోలీస్ స్టేషన్ నుంచి కబురు వచ్చింది. నీ భర్తను ఇంటికి పంపిస్తాం, ఎవరినైనా ఇద్దరిని పోలీస్ స్టేషన్‌కు పంపమని పాంపోర్

ఎస్.ఐ కబురు చేశాడు. మసూదా స్వయంగా బయలుదేరి వెళ్ళింది. పోలీస్‌స్టేషన్‌లో ఆమెతో ఎవ్వరూ మాట్లాడలేదు. కొంతసేపు ఆమె కాచుకొని తిరిగి ఇంటికొచ్చేసరికి ఆమె భర్త శవం అప్పటికే ఇల్లు చేరి ఉంది.

ఆమె భర్తను ఇంట్లోనే కొట్టి, గాయపరచి తీసుకుపోయింది పాపాకిష్టవారీ మనుషులు. వారు ఆ పని చేస్తుండగా ఇంటి బయట కాపలా కాసింది, ఆమె వారిని వెంబడించకుండా ఆపింది భారత సైన్యానికి చెందిన 17 జాట్ రెజిమెంట్ వారు. ఆమె భర్తను అపహరించిన సర్కారీ మిలిటెంట్లు అతనిని అప్పగించింది 17 జాట్ రెజిమెంట్‌కు. ఆ రెజిమెంట్ క్యాంపు బయట కాపలా ఉన్నది, నీ భర్తకేమీ కాదని హామీ ఇచ్చింది ఒక సర్కారీ మిలిటెంటు. చివరికి ఆమె భర్త శవాన్ని ఇంటికి పంపించింది పాంపోర్ పోలీసులు.

భారత పాలకులు కశ్మీర్‌లో నడుపుతున్న పాలన నైజానికిది చక్కగా అద్దం పడుతుంది.

మసూదా పర్వీన్ ఏడుస్తూ కూర్చోలేదు. మొదట్లో చెప్పినట్టు ఆమె వృత్తిరీత్యా స్కూల్ టీచరు. అవంతిపురలోని మంటక్కి హైయర్ సెకండరీ స్కూల్లో చదువు చెప్తుంది. కశ్మీరీ, ఉర్దూయేకాక ఇంగ్లీష్ కూడా వచ్చు. అనర్గళమైన వాక్‌పటిమ ఉంది. తన భర్త హత్య విషయంలో ఎంత దూరమైనా పోవడానికి సిద్ధపడింది. రంజాన్ పండగ అయిపోగానే తన సమస్య పరిష్కరిస్తానని హామీ యిచ్చిన అవంతిపుర పోలీస్ సూపరింటెండెంట్ దగ్గరికి పోయి జరిగిందంతా చెప్పి కేసు నమోదు చేయమనింది. అతను 17 జాట్ రెజిమెంట్ మీద కేసు పెట్టే సాహసం చేయలేదు గానీ కిష్టవారీ మనుషులను అరెస్టు చేసే ఉద్దేశంతో పట్టుకొచ్చాడు. అయితే పాంపోర్ ఎం.ఎల్.ఏ అయిన నేషనల్ కాన్ఫరెన్స్ నాయకుడు ముష్టాక్ అహ్మద్ కుచే వారిని విడిపించుకొని పోయాడు. (పాపాకిష్టవారీని ఆ మధ్యనే నేషనల్ కాన్ఫరెన్స్‌లో చేర్చుకున్నారు.)

తరువాత మసూదా భారత సుప్రీంకోర్టులో కేసు వేసింది. భారత సైన్యం ఆమెకు జవాబిస్తూ ఆమె భర్త అల్‌బర్క్ అనే మిలిటెంట్ సంస్థకు చెందిన మిలిటెంట్ అని చెప్పింది. రెనెగేడ్లెవ్వరూ ఇందులో లేరనీ, సైన్యమే అతనిని అరెస్టు చేసిందనీ చెప్పింది. అతనిని లేత్‌పురాలోని 17 జాట్ రెజిమెంట్ క్యాంపుకు తీసుకుపోయి ప్రశ్నించగా, తాను మిలిటెంట్‌నని ఒప్పుకున్నాడనీ, దాచిపెట్టిన ఆయుధాలు చూపిస్తానని తీసుకుపోయాడనీ అనింది. దాచిపెట్టిన ఆయుధాలను సమీపించి బయటకు తీయబోయినప్పుడు పేలుడు జరిగి అతను చనిపోయాడనీ, అతనిని సోదా కోసం తీసుకుపోయిన జవాన్లు సురక్షితంగా వెనక్కి వచ్చారనీ చెప్పింది.

అతను మిలిటెంట్ అని చెప్పడానికి సైన్యం ఏ రుజువు చూపలేదు. అతనే ఒప్పుకున్నాడన్నది ఒక ఆధారం, ఇంటెలిజెన్స్ వర్గాలు చెప్పాయన్నది రెండవ ఆధారం. మొదటిది సాక్ష్యంగా చెల్లుబాటు కాదు. రెండవది స్వయం కల్పితం కాదని ఎవరూ

నమ్మనవసరం లేదు. రెగూ మృతిపైన పోలీసులు కూడా కొంత పరిశోధన జరిపారని సైన్యం చెప్పగా పోలీసు రిపోర్టు సమర్పించమని సుప్రీంకోర్టు ఆదేశించింది. కానీ రిపోర్టు కోసమే కేసు ఎన్నోసార్లు వాయిదా పడినప్పటికీ దానిని రాష్ట్ర ప్రభుత్వం కోర్టుకు సమర్పించలేదు. దానిలో కొన్ని కాగితాలు పోయాయనీ, అవి ఎట్లా పోయాయో తెలుసుకొని తగు చర్య తీసుకోవడానికి విచారణ జరుపుతున్నామనీ ప్రభుత్వం చెప్పింది. అంతే తప్ప పోలీసు పరిశోధన రిపోర్టు సుప్రీంకోర్టుకు అందలేదు.

అయినప్పటికీ సుప్రీంకోర్టు సైన్యం కథనే నమ్మి మసూదా పర్వీన్ వేసిన కేసును కొట్టేసింది. సాధారణంగా ఇటువంటి కేసులలో ఉన్నత న్యాయస్థానాలు, 'వివాదాస్పదమైన విషయాలు చాలా ఉన్నాయి. కాబట్టి కింది కోర్టులో నేరవిచారణ జరగనిదే ఏమీ తేల్చలేము' అంటాయి. బాధితులను ప్రైవేట్ కేసు వేసుకొని సాక్ష్యాలు ప్రవేశపెట్టి అభియోగం రుజువు చేసుకొమ్మని పురమాయించి కేసు కొట్టేస్తాయి లేదా జిల్లా జడ్జిని సాక్ష్యాలు స్వీకరించి ఇరుపక్షాల వాదనలూ విని నివేదిక ఇమ్మని ఆదేశిస్తాయి. ఈ కేసులో సుప్రీంకోర్టు ఈ ఆనవాయితీని పాటించలేదు. సైనిక అధికారి వాంగ్మూలాన్ని సత్యంగా భావించి రెగూ మిలిటెంటేననీ, సైనిక అధికారులు చెప్పినట్టే అతని మరణం సంభవించిందనీ ప్రకటించింది. మసూదా పిటిషన్‌లో 'ఆవగింజంత' కూడా సత్యం లేదని నిర్ధారించింది. మసూదా ఆ షాక్ నుంచి నేటికీ తేరుకోలేదు. పంతులమ్మగా ఆమె ప్రజాస్వామ్యాన్ని గురించి, చట్టబద్ధ పాలన గురించి, న్యాయస్థానాల నిష్పాక్షికత గురించి పిల్లలకు పాఠాలు చెప్పి చెప్పి అదంతా నిజమేనన్న విశ్వాసం పెంచుకున్నట్టుంది. దేశంలో వేరేచోట్ల అవి కొంతమేరకు నిజాలే అయినా కశ్మీర్ విషయంలో కాదన్న సత్యాన్ని సులభంగా మింగలేకపోయింది. ఇప్పుడామె ఎవరు కదిలించినా తన కథ యావత్తు గలగలా చెప్తుంది. అప్పటిదాకా ఎన్నడూ కశ్మీర్ నుంచి బయటకు పోనిది ఇప్పుడు ఏ మీటింగ్‌కు రమ్మన్నా వచ్చి తన న్యాయపోరాటాన్ని వివరిస్తుంది.

# ఇంకెంత మూల్యం చెల్లిస్తాం?

జమ్మూలో భారతీయ జనతా పార్టీ నిప్పుతో చెలగాటం ఆడుతున్నదని చాలామంది విమర్శిస్తున్నారు. మంటలు మండాలని కోరుకునే వాళ్లు నిప్పుతోనే చెలగాటం ఆడతారు, నీళ్లతో కాదు. 1953లో షేక్ అబ్దుల్లా అక్రమ బర్తరఫ్‌కు, అక్రమ అరెస్ట్‌కు దారితీసిన ఆనాటి జనసంఘ్ నినాదాన్ని ఎల్.కె. అద్వానీ ఇవ్వాళ జ్ఞాపకం చేసుకుంటున్నాడంటే అన్నీ తెలిసే ఆ పని చేస్తున్నాడు. తన చంచల స్వభావాన్ని రాజకీయ ప్రతిష్ఠ చాటున దాచి యోగ్యుడయిన పాలకుడిగా, ప్రజాతంత్రవాదిగా చలామణి అయిన జవహర్‌లాల్ నెహ్రూ ఆనాడు ఆ ఒత్తిడికే తల ఒగ్గి అబ్దుల్లాను నిర్బంధించి నిప్పు రాజేసాడు. ఇవ్వాళ ఆయన వారసులే కదా దేశాన్ని పరిపాలిస్తున్నది!

జమ్మూలో మార్కెట్లు బంద్ పెడితే 'మా ఆపిల్ పండ్లను ముజఫరాబాద్‌కు తీసుకుపోయి అమ్ముకుంటాం' అని కశ్మీరీ రైతులు, వర్తకులు అనడం, హురియత్ నాయకులే కాక ఇతర రాజకీయ నాయకులు కూడా వారికి మద్దతు ఇవ్వడం చాలామందికి ఆగ్రహం కలిగించి ఉంటుంది. చూశావా, ఇండియాలో అమ్ముకోనీయకపోతే పాకిస్తాన్ పోయి అమ్ముకుంటాం అంటున్నారు అనుకొని ఉంటారు. కానీ అదే అనదలచుకున్నా, సౌలభ్యాన్నే ప్రమాణంగా పెట్టుకున్నా, ముజఫరాబాద్ కాదు రావల్పిండికి పోతాం అందురు. కశ్మీర్ లోయలో ఎక్కడి నుండయినా, ఏ సీజన్‌లోనయినా రావల్పిండికి పోయినంత సులభంగా ముజఫరాబాద్‌కు పోలేరు. జమ్మూకు అసలే పోలేరు. అయినప్పటికీ ముజఫరాబాద్‌కు పోయి అమ్ముకుంటాం అన్నారంటే కారణం శ్రీనగర్-ముజఫరాబాద్ రోడ్డు ఈ మధ్య పునరుద్ధరించారన్న దొక్కటే కారణం కాదు. రోడ్డు పునరుద్ధరించారు గానీ అనుమతి పత్రాలూ వీసాలూ రద్దు చేయలేదు. రావల్పిండి రోడ్డు అధికారికంగా పునరుద్ధరించలేదు గానీ పోదలచుకుంటే అసాధ్యమేం కాదు. కానీ ముజఫరాబాద్ అవిభక్త కశ్మీర్‌లోని పట్టణం. శ్రీనగర్ తరువాత రెండవ పెద్ద పట్టణం. కశ్మీరీలు చెప్పదలచుకుంది - మీరు జమ్మూలో అమ్ముకోనీయకపోతే మా కశ్మీర్‌లోనే మరో పెద్ద మార్కెట్ ఉంది, అక్కడికి పోయి అమ్మకుంటాం అని. ఈ తేడా ఇండియాలో ఎంతమందికి అర్థం అవుతుంది?

---

ఆంధ్రజ్యోతి దినపత్రిక, 13-08-2008

ఈ తేడాయే కాదు, కశ్మీరీలకు సంబంధించిన ఏ వాస్తవాన్నయినా అర్థం చేసుకోవడానికి బయటి రాష్ట్రాలలో ఎంతమంది సిద్ధంగా ఉన్నారన్నది అనుమానమే. కులం, ప్రాంతం, భాష, జాతి, ప్రాతిపదికల పైన నడుస్తున్న 'గుర్తింపు' ఉద్యమాలు లేక 'అస్తిత్వ' ఉద్యమాలు ఇప్పుడనేకం ఉన్నాయి. వాటి ఆకాంక్షలలోనూ ఆరాటంలోనూ న్యాయం ఉందని గుర్తించినా కూడా వాటిలోని పరద్వేషం తరచుగా ఇబ్బంది పెడుతుంది. వాటిపట్ల సానుభూతిగల వాళ్లను కూడ దూరం ఉంచుతుంది. ఈ అస్తిత్వ ఉద్యమాలు లేక ఆరాటాలన్నిటిలోకి కశ్మీరీల పోరాటంలో పరద్వేషం తక్కువ అంటే ఎంతమంది నమ్ముతారో! కానీ ఇది నిజం. భయోత్పాతం కల్గించడం, ద్వేషాల్ని రెచ్చగొట్టడం లక్ష్యంగా గల మిలిటెంట్లు పర్యాటకులపైన కాల్పులు జరిపి చంపిన ఉదంతాలూ, బీహార్ నుంచి పోయి కూలి చేసుకుంటున్నవారిని చంపిన ఘటనలూ జరిగిన మాట వాస్తవమే గానీ, సాధారణ కశ్మీరీలలో కశ్మీరీ జాతీయ భావం ఎంత ప్రబలమైనదో పరద్వేషం అంత బలహీనమైన లక్షణం. లేకపోతే మిలిటెన్సీ కొంత వెనుకడుగు వేయగానే ఏటా లక్షల సంఖ్యలో పర్యాటకులు కశ్మీర్‌కు పోయిరావడం జరిగేది కాదు.

మిలిటెన్సీ మొదలయిన తొలినాళ్లలోనే కశ్మీర్‌లో హిందూ దేవాలయాలను కూల్చేశారన్న వదంతి బలంగా వ్యాపించింది. అదృష్టవశాత్తు భారత మీడియా దీని నిజానిజాలు తేల్చే బాధ్యత మీద వేసుకొని పరిశోధన జరపబట్టి అది పూర్తిగా అవాస్తవం అని తేలిందిగానీ లేకుంటే ఆ మచ్చ నిలిచిపోయేదే. గండర్‌బల్ తాలూకాలో తుల్ముల్లా అనే గ్రామం ఉంది. అక్కడ భవానీ గుడి ఉంది. ఆమెను క్షీర్ భవాని అంటారు. సంవత్సరానికొక రోజు ఆమెకు పాలతో అభిషేకం చేస్తారు. 1997 ఫిబ్రవరి 16వ తేదీన ఆ గ్రామానికి చెందిన ఒక టీచర్‌నూ, టైలర్‌నూ భారత సైన్యం కొట్టి చంపింది. ఆ ఊరి ప్రజలు మరుసటిరోజు పెద్ద ప్రదర్శన జరిపారు. ఆందోళన చేశారు. ఆ ఆగ్రహంలో భాగంగా భవాని గుడిపైన దాడి చేస్తారని లేదా చేస్తారన్న భయంతో ప్రభుత్వం ఆ గుడికి భద్రత బాగా పెంచుతుందని బయటివారు అనుకొనడం సహజం. కానీ ఘటన జరిగిన కొద్దిరోజుల తర్వాత తుల్ముల్లాకు వెళ్లిన మానవ హక్కుల బృందానికి కనిపించిన దృశ్యమేమిటంటే గుడి బయట చేత లాఠీ పట్టుకున్న ఒకే ఒక కానిస్టేబుల్ మాత్రమే ఉన్నాడు. సైన్యం కొట్టి చంపిన వారి విషయం గ్రామస్తులతో మాట్లాడిన తరువాత గుడి ఎక్కడుందో చూపించమంటే స్నేహపూర్వకంగా వెంట వచ్చి ఆ గుడి ప్రాచీనత గురించి, ప్రశస్తి గురించి చెప్తూ చూపించారే తప్ప గుడి చూస్తామని అడిగినందుకు నిరసన గానీ వ్యతిరేకత గానీ లేశమంత కూడా వ్యక్తం చేయలేదు. ఆ తరువాత జమ్మూలో తలదాచుకున్న పండిట్లు చెప్పిన విషయమేమిటంటే ప్రతి సంవత్సరం భవానీకి క్షీరాభిషేకం జరిగే పర్వదినాన వారు పెద్ద సంఖ్యలో తుల్ముల్లాకు వెళ్తూనే ఉన్నారని, ప్రభుత్వం నుంచి

సహాయమే కాక గ్రామస్తుల నుంచి ఆదరణా వారికెప్పుడూ దండిగా లభిస్తూనే ఉన్నదని. హిందువుల పూజల పట్ల, హైందవ మతం పట్ల ద్వేషంతోనే కశ్మీరీలు అమర్‌నాథ్ యాత్రను నిర్వహించే సమితికి భూమిని లీజుకివ్వడాన్ని వ్యతిరేకిస్తున్నారని చాలామంది అనుకుంటున్నారు కాబట్టి ఈ ఉదంతాన్ని ఉటంకించవలసి వచ్చింది. మరయితే 100 ఎకరాల అటవీ భూమి గురించి ఇంత రచ్చ ఎందుకు చేస్తున్నారు అని అడుగుతారేమో! వీళ్లయినా 100 ఎకరాల కోసం అంత మొండిగా ఎందుకు గొడవపడాలని ఎదురు ప్రశ్న వేయవచ్చును గానీ కశ్మీరీల కోపాన్ని అర్థం చేసుకోవడానికి మరి కొన్ని వాస్తవాలు తెలుసుకుందాం.

అమర్‌నాథ్ యాత్ర కాజీగుండ్ వద్ద కశ్మీర్‌లోయలోకి ప్రవేశించిన తరువాత దాదాపు రెండున్నర లేక మూడు గంటల సేపు ప్రయాణించి పహల్గాం చేరుకుంటుంది. అక్కడి నుంచి యాత్రికులు కాలినడకన లేక పశువుల పైన దర్శన స్థలానికి పోతారు. కశ్మీరీల తిరుగుబాటు అత్యంత తీవ్రస్థాయిలో ఉన్న రోజులలో కూడ ఈ యాత్ర ఆగలేదు. దానిని భారత సైన్యం తన ప్రతిష్ఠకు సవాలుగా తీసుకొని నిర్విఘ్నంగా సాగించటమొక్కటే అందుకు కారణం కాదు. కశ్మీరీలలో ఎక్కడా దానిపట్ల వ్యతిరేకత, నిరసన లేకపోవడం కూడా కారణమే. ఆ యాత్రలో భక్తులే కాక సంఘ్ పరివార్ కార్యకర్తలు కూడా పాల్గొంటారు. వారు శివ భక్తి స్తోత్రాలే కాక కశ్మీరీలను ఉద్దేశపూర్వకంగా రెచ్చగొడుతూ నినాదాలు కూడా చేస్తారు. 'కశ్మీర్ నుంచి కన్యాకుమారి దాకా ఇండియా ఒకటే' అనేది ఒక మచ్చుతునక. దర్శన స్థలానికి సమీపంలోని అడవి ప్రాంతంలో మిలిటెంట్లు యాత్రికుల పైన కాల్పులు జరిపిన ఉదంతాలు ఉన్నాయి గానీ దారిలో ఎక్కడా స్థానిక ప్రజలు నిరసన గానీ వ్యతిరేకత గానీ తెలిపిన ఉదంతాలు లేవు. పహల్గామయితే యాత్ర జరిగే దినాలలో సగటు హైందవ జాతర స్థలంలాగే ఉంటుంది. బొట్లు, మాలలు, కాషాయ వస్త్రాలు వేసుకున్న భక్తులు వేల సంఖ్యలో దిగుతారు, తమ వంతు వచ్చేవరకు బస చేస్తారు, ఆ తరువాత పోయి దర్శనం చేసుకొస్తారు. మళ్లీ నినాదాలిచ్చుకుంటూ తిరుగు ప్రయాణం అవుతారు. పహల్గాంలోనూ, ఆ తరువాతా వారికి కేవలం ప్రభుత్వం నుంచే కాక స్థానిక ప్రజల నుంచి కూడ చాలా సహకారం లభిస్తుంది. ఆదరణ లభిస్తుంది. ఇవ్వాళ లీజుకు ఇస్తామన్న 100 ఎకరాలు కొత్తగా ఇస్తున్నది కాదు. యాత్రికులు వాడుకొంటున్నదే. మరి కొంత పెద్ద పరిమాణంలో, బహుశా శాశ్వత ధర్మ సత్రాల నిర్మాణం కోసం ఇస్తున్నది. శాశ్వత వసతుల ప్రస్తావన లేకుండ, లీజు గురించి మాట్లాడకుండ ఎప్పటిలాగే యాత్రికుల తాత్కాలిక అవసరాల కోసం ఆ పరిసరాలలోని అటవీ భూమిని వాడుకుంటే ఏ గొడవా జరిగేది కాదు. అవసరాన్ని బట్టి ఎప్పటికన్నా కొంచెం ఎక్కువ వాడుకున్నా గొడవ జరిగేది కాదు. ఈ గొడవంతా ముగిసి ఆవేశాలు చల్లారిన తరువాత

జరగబోయేది అదే. ఇంకొన్ని రోజులలో మొదలు కాబోయే అమర్‌నాథ్ యాత్రను అద్వానీ గారూ, వారి సోదరులూ తమ సంకుచిత ప్రయోజనాల కోసం వాడుకోకుండ ఎప్పటిలాగ సాగనిస్తే మనం అదే చూడబోతాం గూడ. అయినప్పటికీ 100 ఎకరాల లీజును కశ్మీరీలు ఇంతగా వ్యతిరేకించడానికి గల కారణం ఏమిటన్న ప్రశ్నకు జవాబు కావలసిందేనంటే, తమ ఉనికి పట్ల, తమ నేల పట్ల, తమ సంస్కృతి పట్ల వారికి ఉన్న ఉద్వేగభరితమైన బంధాన్ని కారణంగా చూపించవలసి ఉంటుంది. ఆ ఉద్విగ్నత తెలియని వారికి అది ఒక వెర్రిగా కనిపించవచ్చు. దానిని రెచ్చగొట్టి వాడుకోవడం రాజకీయవేత్తలకు సులభం కావచ్చు. అయితే అందులో తమ జాతి గుర్తింపులో భాగమైన భౌతిక, సాంస్కృతిక అంశాల పట్ల తీవ్రమైన తాదాత్మ్య భావనే తప్ప పరద్వేషం ఒకింత కూడ లేదు. అంతేకాక ఈ భావన ఎంత తీవ్రమైనదో వారి స్నేహశీలం అంతే బలీయమైనది. ఈ విషయాన్ని గుర్తించి రెండిటినీ గౌరవించడం నేర్చుకుంటే వారితో వ్యవహరించడం కష్టం కాదు. దీనికి అద్వానీ ఒప్పుకోడు. భారతీయత అనేదొక అఖండమైన భావన అనీ, దానిలోపల వేరే గుర్తింపులకూ భావోద్వేగాలకూ తావులేదనీ, ఆ భారతీయతతో మాకేమి సంబంధం అన్న ప్రశ్న లేవదీయడానికి వీలే లేదనీ ఆయన ప్రాపంచిక దృక్పథం చెప్తుంది. ఆ దృక్పథం అధికారానికి చేరువయిన క్రమంలో ఈ దేశం నుంచి చాలా మూల్యమే తీసుకుంది. అధికారం చలాయించిన కాలంలో మరింత తీసుకుంది. ఇంకా ఎంత తీసుకోనిస్తామనేది మనమంతా నిర్ణయించుకోవలసిన విషయం.

# కశ్మీర్‌లో మన కర్తవ్యం

అవి దేశ విభజన రోజులు. ఉపఖండమంతటా ముఖ్యంగా ఉత్తర, వాయవ్య, తూర్పు ప్రాంతాలలో నరమేధం జరుగుతున్నది. హిందూ, సిక్కు మూకలు ముస్లింలను, ముస్లిం మూకలు హిందువులనూ సిక్కులనూ నరుకుతున్నారు. సజీవంగా కాల్చి చంపుతున్నారు. ఇళ్ళు తగులబెడుతున్నారు. స్త్రీలను రేప్ చేస్తున్నారు. ఇంతటి హింసను ఉపఖండం అప్పటివరకు చూసి ఎరుగదు.

ఆ సమయంలో ఢిల్లీ నుంచి ఒక పెద్దాయన కశ్మీర్ వెళ్లాడు. అక్కడి ప్రశాంతత చూసి ఆశ్చర్యపోయాడు. పక్కనే ఉన్న జమ్మూలోను, కొత్తగా ఏర్పడ్డ సరిహద్దుకు ఆవలనున్న పాకిస్తాన్‌లోనూ రక్తం ఏరులయి పారుతున్నా కశ్మీర్‌లో చిన్న మైనారిటీగా ఉన్న హిందువులు, సిక్కులు మాత్రం భద్రంగా ఉన్నారు. స్వల్పమైన మత ఘర్షణలు సహితం లేవు. ఆ పెద్దాయన కశ్మీరీలను అందుకు అభినందిస్తూ జమ్మూలో హింసను అరికట్టలేకపోయిన మహారాజా హరిసింగ్ గద్దె దిగి షేక్ అబ్దుల్లాకు అధికారం అప్పగించాలని పత్రికా ముఖంగా డిమాండ్ చేశాడు. ఆయన 'హిందువుల ప్రయోజనాలను వ్యతిరేకించే కమ్యూనిస్టు' కాదు, త్రిపురనేని హనుమాన్ చౌదరి కంటే ప్రగాఢమైన రామభక్తి గలవాడు. ఆయనను మహాత్మాగాంధీ అంటారు.

ఆనాటి నుంచి ఈనాటి దాకా దేశంలో మత ఘర్షణలు ఎప్పుడూ జరగని అతి కొద్ది ప్రాంతాలలో కశ్మీర్ ఒకటి. గడచిన నెల రోజులుగా నెలకొన్న తీవ్ర ఉద్రిక్తత మధ్య కూడా అమర్‌నాథ్ యాత్ర ఎప్పటిలాగే సాగింది, సాగుతున్నది. యాత్రికులకు ఎప్పటిలాగే స్థానిక ప్రజల సహాయ సహకారాలు అందుతూనే ఉన్నాయి. ఈ సంవత్సరం ఎప్పుడూ లేనంత సంఖ్య – దాదాపు 5 లక్షల మంది – అమర్‌నాథ్‌కు వెళ్లారు. వాళ్లపైన దాడికాదు సరికదా ఎటువంటి అసౌకర్యమూ కలగలేదు. సినిమా షూటింగ్‌కు పోయిన తెలుగు సినిమా వారి మీద మాత్రమే పహల్గాంలో రాళ్లు పడ్డట్టున్నాయి.

అయినా 'నాలుగు లక్షల మంది కశ్మీరీ పండిట్‌లు కశ్మీర్ లోయ వదిలిపెట్టి పోలేదా?' అని హనుమాన్ చౌదరి అడుగుతున్నారు. నాలుగు లక్షల మంది పోలేదు గానీ

---

ఆంధ్రజ్యోతి దినపత్రిక, 27-08-2008

రెండు లక్షలపైగా పోయిన మాట వాస్తవం. దీనికి కారణం హిందువు మీద దాడులు జరగడం అనుకుంటే పొరపాటు. 1989లో మొదలైన మిలిటెన్సీ తన రాజకీయ ప్రత్యర్థులను ఏరి ఏరి హతమార్చింది. అందులో కొందరు పండిట్‌లు ఉన్నారు. అత్యధికం నేషనల్ కాన్ఫరెన్స్, కాంగ్రెస్ తదితర పార్టీలకు చెందిన ముస్లింలున్నారు. కశ్మీరీ ముస్లింలు గుంపులుగా పండిట్‌లపైన దాడి చేసిన ఒక్క ఘటనా జరగలేదు. ఆనాటి నుంచి ఈనాటి దాకా కశ్మీర్‌లో సైన్యం చేతిలోనూ, మిలిటెంట్ల చేతిలోనూ, ప్రభుత్వ అనుకూల సాయుధ బృందాల చేతిలోనూ చనిపోయిన వారి సంఖ్య వివిధ అంచనాల ప్రకారం 50 వేల నుంచి 80 వేల దాకా ఉంది. అందులో పండిట్‌ల సంఖ్య 300 మించి లేదు. మిగిలినవారంతా – ఎవరి చేతిలో చచ్చినా – కశ్మీరీ ముస్లింలే. మిలిటెన్సీ కశ్మీరీ సంస్థల చేతినుంచి పాకిస్తాన్ కేంద్రంగా గల ఇస్లాంవాద సాయుధ సంస్థల చేతిలోకి పోయిన తరువాత మిలిటెంట్లు మూకుమ్మడిగా నిరాయుధులను చంపిన ఉదంతాలు జరిగాయి, జరుగుతున్నాయి గానీ అంతకు ముందు అది కూడ లేదు.

అయినప్పటికీ పండిట్‌లు పెద్ద సంఖ్యలో వలస పోవడానికి తమ భవితవ్యాన్ని గురించి వారిలో ఏర్పడిన అభద్రతా భావమే కారణం. లక్షల మంది వీధులలోకి వచ్చి ఇండియా వ్యతిరేక నినాదాలిస్తున్నారు. కొందరు పాకిస్తాన్ అనుకూల నినాదాలు ఇస్తున్నారు. ప్రభుత్వ వ్యవస్థ కుప్ప కూలిపోయింది. పండిట్‌లు కశ్మీర్ లోయ విడిచిపెట్టి పోవాలన్న పోస్టర్లు కొన్నిచోట్ల పడ్డాయి. దీనికి పండిట్‌లు భయపడటం సహజం. ఆ స్థితిలో ప్రభుత్వం వారికి భరోసా ఇచ్చి వుంటే పండిట్‌ల వలస జరిగి ఉండేది కాదేమో గానీ అప్పటి గవర్నర్ జగ్‌మోహన్ ఆలోచనారీతి ప్రస్తుత సంక్షోభానికి కారకుడైన గవర్నర్ సిన్హా ఆలోచనారీతి లాంటిదే. పండిట్‌లను ప్రభుత్వం కాపాడజాలదనీ వారి భద్రత కోసం వారు లోయను విడిచిపెట్టి వెళ్లిపోవడం ఉత్తమమనీ రాష్ట్ర గవర్నర్ స్వయంగా ప్రకటించడం పండిట్‌ల భయాన్ని మరింత పెంచి భారీ వలసకు దారితీసింది.

ఈ వలస కశ్మీరీలను కలవరపెట్టింది. హృదయనాథ్ జట్టో అనే కశ్మీరీ పండిట్, రిటైర్డ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ముఫ్తీ బహావుద్దీన్ ఫారూఖీలు కలిసి పండిట్‌లను వలస పోవద్దంటూ ఒక ప్రకటన జారీ చేశారు. వారిద్దరి నేతృత్వంలో వలసలను అరికట్టే లక్ష్యం గల ఒక కమిటీ ఏర్పడింది. కానీ దానిని గవర్నర్ జగ్‌మోహన్ సాగన్వివలేదు. జట్టోకు జమ్మూలో ఒక నివాసం ఏర్పాటు చేసి విమానం టిక్కెట్టు కొనిచ్చి పోలీసు జీపు ఇంటికి పంపించి ఆయనను జమ్మూకు దాదాపు బలవంతంగా తరలించాడు. జమ్మూకు చెందిన బలరాజ్ పురి అనే మానవ హక్కుల వాది గవర్నర్ చర్యకు ఆగ్రహించి ఆయనను కలిసి ఎందుకీ పని చేశావని అడగగా, జగ్‌మోహన్ చెప్పిన జవాబు ఏమిటంటే 'కశ్మీర్‌లో హిందువులూ ముస్లింలూ సఖ్యంగా బతికితే భారత సైన్యం మనోస్థయిర్యం దెబ్బ తింటుంది' అని.

వాస్తవాలు మనకు ఎంత అప్రియంగా ఉన్నా వాటిని గుర్తించడానికి నిరాకరించడం విజ్ఞత అనిపించుకోదు. వాస్తవాలు తెలుసుకోవడానికి ఓపిక లేక మన విశ్వాసాలనే సత్యాలుగా ప్రచారం చేసుకోవడం నాగరిక వైఖరి అనిపించుకోదు. కశ్మీర్‌లో కల్లోలం మొదలయినప్పటి నుంచి బయటి నుంచి హక్కుల బృందాలు తరచుగా ఆ రాష్ట్రానికి పోయి అక్కడి మానవ హక్కుల స్థితి గురించి నివేదికలు ప్రచురిస్తున్నాయి. ఆ బృందాలు జమ్మూలోని పండిట్‌ల శిబిరాలకు పోని సందర్భాలు అరుదు. వారి జీవన స్థితిగతుల గురించి ప్రభుత్వం ముందు డిమాండ్లు పెట్టని సందర్భాలు అరుదు. హనుమాన్ చౌదరి నన్ను పేరు పెట్టి ప్రశ్నించారు కాబట్టి నేను పాల్గొన్న 6 నిజ నిర్ధారణ కమిటీల నివేదికలలో అయిదింటిలో పండిట్‌ల స్థితిగతుల గురించి వివరమైన ప్రస్తావన ఉందని చెప్పాలి.

అయినప్పటికీ కశ్మీర్ పండిట్‌లను పాలస్తీనా అరబ్బులతో పోల్చడం అర్థరహితం. వారి భూమిని వారు వదిలిపెట్టడానికి ప్రేరణ అయిన అభద్రతకు కారణం పరాయివారు కాదు. పాలస్తీనాకు యూరప్‌లోని వివిధ దేశాలకు చెందిన బలవంతులు వేల సంవత్సరాలనాటి పిట్టకథను పట్టుకొచ్చి స్థానిక ప్రజల భూమిని ఆక్రమించుకొని వారిని తరిమేశారు. కశ్మీర్‌లో జరిగిందది కాదు. మెజారిటీ ప్రజల స్వాతంత్ర్య కాంక్ష మైనారిటీ వర్గ ప్రజలలో అభద్రతను పెంచి వారి వలసకు దారితీసింది. పండిట్‌లు బ్రాహ్మణులు అవడం వల్ల వారిలో విద్యావంతులెక్కువ. చాలామంది ఢిల్లీ నుంచి బెంగుళూరు దాకా మంచి ఉద్యోగాలలో స్థిరపడ్డారు. గ్రామీణ ప్రాంతాలకు చెందిన వారు మాత్రమే జమ్మూలోని శిబిరాలలో ఉన్నారు. కశ్మీర్ వారి భూమే, వారు ఎన్నటికైనా వెనక్కి పోవలసిందే. అయితే అది మెజారిటీ ప్రజల రాజకీయ కాంక్షకు పరిష్కారం దొరికిన క్రమంలోనే జరగగలదు.

ఆ కాంక్ష ఎంత బలమైనదో గడచిన నెల రోజుల ఘటనల నుండయినా మనం గ్రహించడానికీ గుర్తించడానికీ సిద్ధంగా ఉన్నామా? 8 కోట్ల తెలుగువారిలో గొప్ప పలుకుబడీ, ప్రాబల్యం ఉందని నిరూపించుకున్న నాయకులూ హీరోలూ బస్సులూ రైళ్లూ ఏర్పాటు చేసుకొని ఒక లక్షమందితో మీటింగ్ పెడితే అది గొప్ప సభ అనుకుంటాం. కశ్మీర్ జనాభా హైదరాబాద్ జనాభాతో సమానం. (గ్రేటర్ హైదరాబాద్ కాదు, వట్టి హైదరాబాద్.) అక్కడ గడచిన రెండు మూడు వారాలలో రెండుసార్లు ఏ ప్రత్యేకమైన ఏర్పాట్లూ లేకుండ కొండల నుంచీ కోనల నుంచీ రెండు మూడు లక్షల మంది జనం ఒకచోట పోగయి ఊరేగింపు తీశారు. ఇదంతా వంద ఎకరాల భూమి కోసం అనుకుంటే పొరపాటు. ఆ భూమి కేవలం ఒక సందర్భం మాత్రమే. అరవై సంవత్సరాలుగా అణచివేయబడ్డ ఆరాటాన్ని వ్యక్తీకరించడానికి అదొక సందర్భం. భారత పాలకుల కౌటిల్యం, భారత సైన్యం వారి పైన ప్రయోగించిన అణచివేత అంతాయింతా కాదు. మతోన్మాద మిలిటెంట్ల విచ్చలవిడి హింస తప్ప కశ్మీర్‌లో వేరే ఏమీ లేదని ఆత్మవంచన చేసుకున్నంత

కాలం ఈ అణచివేత గురించి ఆందోళన చెందవలసిన అగత్యం సగటు భారతీయులకు కలగలేదేమో కాని ఇంకా ఆ వైఖరి సాధ్యమా?

వేర్పాటువాదం అని పేరు పెట్టుకున్నా, కశ్మీరీ జాతీయ వాదం అని పేరు పెట్టుకున్నా ఈ ఆరాటానికి ప్రధాన ప్రతినిధి హురియత్ కాన్ఫరెన్స్ అని కశ్మీర్ ఇండియాలో అంతర్భాగమని నమ్మే నేషనల్ కాన్ఫరెన్స్ నాయకుడు ఒమర్ అబ్దుల్లా సైతం ఒక టీవీ ఛానెల్ నిర్వహించిన చర్చలో పాల్గొంటూ ఒప్పుకున్నారు. తమ బోటివారు కష్టపడితే పదివేల మందిని సమీకరించగలమనీ, హురియత్ కాన్ఫరెన్స్ పిలుపు లక్షల మందిని కదిలించగలదనీ అంగీకరించాడు. 'మనవాడు' అనుకునే ఈ నాయకుడి మాటలయినా మనకు వినబడతాయా?

హురియత్ కాన్ఫరెన్స్‌ను ప్రజల ఆకాంక్షల ప్రతినిధిగా గౌరవించి వారితో ప్రజాస్వామికంగా వ్యవహరించే బదులు ఆ సంస్థను చీల్చి ఒక అనుకూల వర్గాన్ని తయారు చేసుకోవాలన్నది భారత ప్రభుత్వ వైఖరిగా ఉండింది ఇన్నాళ్లూ. దీనికి అమెరికా ప్రోత్సాహం ఉండింది. ముషార్రఫ్ సహకారం ఉండింది. దానితో హురియత్ కాన్ఫరెన్స్ పీడ విరగడయిందని భారత పాలకులు భావిస్తూ వచ్చారు. అది భ్రమ అని గడచిన రెండు వారాల ఘటనలు రుజువు చేశాయి. అయినప్పటికీ మళ్లీ సాధారణ పరిస్థితులు నెలకొనగానే అటువంటి ఆలోచనలే చేసే ప్రమాదం ఉంది. కశ్మీరీల మనోభావాలకు జవాబు చెప్పకుండ అణచివేతతో, కాలయాపనతో దాటవేయడం 60 సంవత్సరాలుగా భారత ప్రభుత్వ విధానంగా ఉంది. దానికిప్పటికే ప్రజలు చాలా మూల్యం చెల్లించారు. ఇకనైనా సూత్రబద్ధమైన వైఖరి అవలంబించి ఏ పరిష్కారం సంబంధిత ప్రజలకు ఆమోదమైతే దానిని స్వీకరించమని మన పాలకుల పైన ఒత్తిడి పెట్టడం శాంతిని నిజంగా కాంక్షించే వారి కర్తవ్యం.



మందుపాతర పేలుడులో గాయపడ్డ ముష్తాక్ అహ్మద్‌ను
పూంచ్ జిల్లా ఆసుపత్రిలో పరామర్శిస్తున్న బాలగోపాల్

కశ్మీర్ అనగానే ఈ రోజు మతోన్మాదం, హింస స్ఫురించే వాతావరణం నెలకొనింది గానీ సగటు కశ్మీరీలో ఇవేవీ కనిపించవు. 'మేము వేరు, మా బతుకు వేరు. మా పాటికి మమ్మల్ని ఉండనివ్వండి అంటే మీకెందుకు అర్థం కాదు? అని స్నేహంగానే విస్మయం వ్యక్తం చేస్తారు. వాళ్ళ భావాలతో నిమిత్తం లేని వేరే ఏవేవో విషయాలకు కశ్మీర్ ప్రతీక అయిపోవడం వల్ల ఈ ప్రశ్న ఎవరికీ వినిపించదు. నెహ్రూ బ్రాండు లౌకికవాదులకు కశ్మీర్ ఆధునిక భారత లౌకికతకు ప్రతీక. అద్వానీ బ్రాండు దేశభక్తులకు కశ్మీర్ అఖండ భారత్‌కు ప్రతీక. పాకిస్తానీ పాలకులకు అనంతమైన జిహాద్‌కు ప్రతీక. కశ్మీర్ గురించి ఆలోచించడమంటే కశ్మీరీల కోసం ఆలోచించడమని మనమెప్పుడు అర్థం చేసుకుంటాం?